# ప్రజలు - ప్రభుత్వము

*

రచన :

కౌంట్ లియో టాల్‌స్టాయి

అనువాదం :

శ్రీ జానపాటి సత్యనారాయణ

*

ప్రచురణము 20

దేశోద్ధారక గ్రంథమాల

3-5-1027 నారాయణగూడ, హైదరాబాదు

# మనవి

కౌంట్ లియో టాల్‌స్టాయ్‌చే 1899 లో "ప్రభుత్వంవల్ల కీడు, హంతకుని పరిపాలన" శీర్షికతో రాసిన వ్యాసాల అనువాదాన్ని ఈ పుస్తకరూపంలో 1939 లో మొదటిసారిగా ప్రచురించాం. ఈపుస్తకములోని విషయ ప్రాధాన్యతనుబట్టి తిరిగి ప్రచురిస్తున్నాం. పాఠకులు ఆ విశిష్టతను గ్రహించుతారు. 1939 లో మిత్రులు శ్రీ జానపాటి సత్యనారాయణగారు స్వయంగా, అమితోత్సాహంతో దీన్ని అనువదించి యిచ్చారు. వారి కెల్లప్పటికి కృతజ్ఞులము. ఇప్పుడు ఈ ప్రచురణ ప్రారంభంలో అధికంగా చేర్చిన టాల్‌స్టాయి పరిచయం, అనుబంధంగా తుదిలో చేర్చిన గాంధీ - టాల్‌స్టాయి లేఖల అనువాదం సిద్ధం కావడానికి తోడ్పడిన మిత్రులకు కూడా కృతజ్ఞతలను అంద జేస్తున్నాం.

గ్రంథమాల పునరుద్ధరణ తర్వాత దేశీయులు మా గ్రంథమాలను హార్దికంగా, ఆర్థికంగా ప్రోత్సహిస్తున్నారు. వారికి మా కృతజ్ఞతాపూర్వక నమస్కారాలు.

దేశకవితా మండలివారి "నవజీవనం" నవలనుండి టాల్‌స్టాయి చిత్రాన్ని తీసుకున్నాం. అందుకై వారికి మా కృతజ్ఞత లందచేస్తున్నాం.

సదా మీ సహకారాభిలాషి
వట్టికోట ఆళ్వారుస్వామి
స్థాపకుడు, ప్రకాశకుడు

## ఈ సంపుటిలో

1. టాల్‌స్టాయి : ఈరచన 1-14

2. మొదటి ప్రకరణము 1-21

ఘోరకృత్యములు

3. రెండవ ప్రకరణము 22-49

*దేశభక్తి - ప్రభుత్వము*

4. మూడవ ప్రకరణము 50-71

*సాంఘిక సంస్కర్తలకొక విజ్ఞప్తి*

5. నాల్గవ ప్రకరణము 72-78

*అరాజకము*

6. అనుబంధము 79-102

*గాంధీ - టాల్‌స్టాయి లేఖలు*

ప్రజలు - ప్రభుత్వము



"మీరేదేశమునకు చెందినవారైననూ, ఏ రాజ్యాధికారమందున్ననూ, మీరేమతమునకు చెందినవారైననూ, వ్యవసాయము, వర్తకులు, ప్రకృతిశాస్త్రము లేక మరే వృత్తికి చెందినవారైననూ, మానవ ప్రకృతిలో భేదము లేదు. సౌఖ్యము, సంతోషము ప్రతివారును కోరుదురు. కావున మీ రందరు పరస్పర సోదరభావము కలిగి, మీ ఉత్పత్తి వస్తువులను విక్రయించుకొనుచున్నట్లే మీలో పుట్టు పరస్పర భిన్నభావములనుకూడ ఒకరికొకరు ఇచ్చిపుచ్చుకొనుచుండుట మూలమున అతిశయసౌఖ్యమును మీరు పొందగలుగుదురు."

—రచయిత

# టాల్‌స్టాయి : ఈ రచన

గౌతమబుద్ధుడు, ఏసుక్రీస్తు, మహాత్మాగాంధీ మొదలైన శాంతి ప్రవక్తలశ్రేణికి చెందినవాడు టాల్‌స్టాయి. ఈయన రష్యాదేశస్థుడు. 1828 ఆగస్టు 28 తేదీన యాస్నాయాపోల్యానా అనే గ్రామంలో సిరిసంపదలతో తులతూగుతూవుండే జమీందారీ వంశంలో ఈయన జన్మించాడు. ఈయన వంశంలో రష్యా చరిత్రలో ప్రముఖులైనవారున్నారు. పీటర్ చక్రవర్తికి మంత్రి అయిన కౌంట్ పీటర్ టాల్‌స్టాయి, కేథరీన్ పరిపాలనలో సర్వసైన్యాధిపతిగా పనిచేసిన ప్రిన్సునికోలాయ్ వాల్కోన్‌స్కీ ఈయనపూర్వీకులు. ఇంత పెద్దకుటుంబంలో జన్మించినా ఈయన పుట్టుకనుంచే విశిష్టమైన స్వభావం కలవాడు. కనుకనే నిరంకుశమైన జమీందారీ వంశంలో పుట్టి పెరిగికూడా వారివలె ప్రపంచంతో సంబంధంలేకుండా కేవలం భోగాలనూ, సుఖాలను అనుభవించుతూ నిరర్థకమైన జీవితం వెళ్ళబుచ్చకుండా అనాథులను, నిస్సహాయులను, హీనస్థితిలో ఉన్నవారిని చూడగలిగాడు. విశాలహృదయంతో ఆ దీనుల బాధలను అర్థం చేసుకోగలిగాడు. వారిపట్ల సానుభూతి ప్రకటించగలిగాడు. వారికి బాసటగానిలిచి సంఘంలో ఉన్నదౌష్ట్యాన్ని నిర్భయంగా చాటగలిగాడు. కారుణ్యవాది కాగలిగాడు. తన రచనలద్వారా, ఆచరణద్వారా ఆదర్శవ్యక్తిగా జీవించగలిగాడు. కాబట్టే మహాత్మాగాంధీవంటి అహింసావాది, సత్యాన్వేషి, ప్రేమైకజీవి టాల్‌స్టాయిని తన గురువుగా భావించాడు.

క్రీస్తుకు ముందు ఎనిమిదవ శతాబ్దంలోవున్న ఒక మహర్షిని మానవత్వాన్ని నిర్వచించమని కోరగా- మానవ ప్రవృత్తుల సమన్వయం, జీవిత వికాసం, మనోవికాసం, సంపూర్ణశాంతి—ఇదే మానవత్వమన్నాడు. ఈ మానవత్వాన్ని నిర్వచించి చెప్పి దీనిని నిలబెట్టడంకోసమే ప్రపంచంలో ఒక్కొక్క శతాబ్దంలో మహాపురుషులు జన్మించారు. బుద్ధుడు, మహమ్మదు,

క్రీస్తు, సోక్రటీస్, కన్ ఫ్యూషియస్, మహాత్మాగాంధీ మొదలగు మహా పురుషులు తమ జీవితాలద్వారా మహాకార్యాలను సాధిస్తే కాళిదాసు, షేక్స్ పియర్, డాంటే, గెథే, ఓమర్ ఖయ్యాం, మిల్టన్, పిరదౌసి, రోమారోలా, గోర్కీ, టాల్ స్టాయి, రవీంద్రుని వంటివారు తమ రచనలద్వారా మానవ జాతిని మేల్కొల్పే కళాఖండాలు సృష్టించారు. యుగయుగాలకూ నిలిచిపో గల సందేశాలిచ్చారు. వీరి రచనలూ, వీరి సందేశాలూ, వీరి వ్యక్తిత్వాలూ అమరమైనవి. సామ్రాజ్యాలు మరుగున పడిపోవచ్చు, చక్రవర్తులపేర్లు విస్మరింపబడవచ్చు, మహాయోధులపేర్లు కాలగర్భంలో కలిసిపోవచ్చు, కాని ప్రపంచంలోని సమస్తజాతులు, ఆ జాతుల భాషలు నిలిచివున్నంత కాలం ఈ మహనీయుల పేర్లు జాజ్వల్యమానంగా ప్రకాశిస్తూవుంటాయి.

టాల్ స్టాయి విశ్వవిఖ్యాత రచయిత; ఈయన కథకుడు, నవలా కారుడు, వ్యాసకర్త, విమర్శకుడు, తత్వవేత్త. ప్రాక్పశ్చిమ దేశాలవారికి సమానంగా అభిమానపాత్రుడైన రచయిత. 1852 లో ఈయన రచించిన "బాల్యం Childhood, కౌమారం Boyhood, యౌవనం Youth" అనే గ్రంథం ప్రచురితమైంది. ఈ గ్రంథంలో టాల్ స్టాయి తాను కుటుం బంలో మానసికంగా, ఆధ్యాత్మికంగా పెరిగిన విధానాన్ని వ్రాశాడు. ఆ తరువాత "వుడ్ ఫీలింగ్" (Wood Feeling) అనే రచన 1855 లో ప్రచురితమైంది. ఈయన వ్రాసిన "కోజక్స్" (Kosacks) అను గ్రంథం 1863 లో ప్రచురింపబడింది.

తరువాత కొంతకాలానికి టాల్ స్టాయి కాకేషియన్ గ్రామాలలో రెండేండ్లపాటు, పిమ్మట డాన్యూబ్ లో మరికొన్ని నెలలపాటు, ఆ పిమ్మట సెవాస్టపోల్ లో ఎనిమిదినెలలపాటు సైన్యంలో పనిచేశాడు. సెవాస్టపోల్ లో ఉండగా ఈయనకు సైనికాధికారులతోను, సామాన్యమానవులతోను బాగా పరిచయం కలిగింది. పరిచయం కలగడమేగాక వారి పద్ధతులను, పిచ్చి వేషాలను బాగా ఆకళింపుచేసుకున్నాడు. ఇక్కడే టాల్ స్టాయి రచయితగా ఒక కొత్తత్రోవ త్రొక్కాడు. అంతకుముందటి యూరపుఖండ రచయితలు

యుద్ధాన్ని వందిమాగధ స్తోత్రాలతో, దృశ్యవర్ణనలతో, సేనానుల ప్రశంసలతో వ్రాస్తూవుండేవారు. కాని టాల్‌స్టాయి సెవాస్టపోల్ ముట్టడినిగూర్చి మూడు భాగాలుగా ఒక గ్రంథం 1854 లో వ్రాశాడు. దీనిలో మిలిటరీ ఆసుపత్రిదృశ్యాలు, ఫ్రెంచి జాతీయుని చంపుతూ ఒకానొక సైనికుడు పడ్డ ఉత్సాహం చదివితీరవలసినవి. ఈ గ్రంథాన్ని టర్జనీవ్ అనే రష్యా రచయిత పిసిమిస్కీ అను మరో రచయిత మిక్కిలి ప్రశంసించారు. పిసిమిస్కీ దీనిని చదివినమీదట "ఈ యువరచయిత (అంటే టాల్‌స్టాయి) ఒకప్పుడు మనలనందరినీ మరుగున పడవేస్తాడు. ఇతను రంగంలోకి విజృంభించాడంటే మాలో కొందరు రచన మానుకుంటారు" అన్నాడు. సెవాస్టపోల్ కథలనుగూర్చి టాల్‌స్టాయి కొన్ని సంవత్సరాల తరువాత ఇలా అభిప్రాయపడ్డాడు: "ఈ గ్రంథం చదివినవారు గ్రంథకర్తకు దైవశాసనమొకటి ఉన్నదని తెలుసుననీ. ఇరుగు పొరుగువారిని ప్రేమించండి, కాని వారిని చంపకండి అని చెప్పడమే గ్రంథకర్త ఉద్దేశమనీ చదువరులు తప్పక భావిస్తారు." ఎన్ని రచనలు చేసినా, రచనా వ్యాసంగంలో ఎంత అనుభవంవున్నా రచయిత తనను తాను గ్రహించినప్పుడే లోకానికొక నిర్దిష్టమైన సందేశమివ్వగలుగుతాడు. తనవ్యక్తిత్వం ఏమిటో టాల్‌స్టాయి తెలుసుకున్నాడని చెప్పడానికి ఇంతకంటె మరొక నిదర్శన మేంకావాలి?

టాల్‌స్టాయి వ్రాసిన నవలికలలో "కుటుంబసౌఖ్యం" (Family Happiness) చెప్పుకోదగింది. ఇందులో మధ్య వయస్కుడైన సెర్జీ మిహాలోవిచ్ మాచా అనే యువతిని పెండ్లాడడం, ఈడూ జోడూ కానట్టి వారి దాంపత్యజీవితం వర్ణింపబడింది. మాచా మంచి ప్రాయంలో వున్నయువతి. ఆమెకు ఉత్సాహం, ఉద్రేకం కలిగించే సంఘటనలుకావాలి. శృంగారమయమైన జీవితాన్ని ఆమె కోరుతుంది. ఆమె భర్తకుమాత్రం పల్లెజీవనమే సంతుష్టినిస్తుంది. సమాజంలో ఏవేవో అనుభవాలు పొందాలని మాచా ప్రయత్నించుతూవుండడం మిహాలోవిచ్‌కు అసూయ, ఆగ్రహం

కల్గిస్తాయి. మాచా అమాయకంగా ఇతర పురుషులతో సరస సల్లాపాలతో కాలక్షేపం చెయ్యాలని ఎప్పుడూ వేకారుతూవుంటుంది. అలా చేస్తుంది కూడా. ప్రఖ్యాత ఫ్రెంచి నవలారచయిత రోమారోలా ఈ నవలనుగూర్చి వ్రాస్తూ "ఈ కథకు ఒక విధమైన పరిపూర్ణత్వం ఉన్నది. కథ అంతా ఒక స్త్రీ హృదయంలో జరిగే సంఘర్షణ. కథను ఆమె నోటంటే మనం వింటాము. కాని అందులో ఎంత నాజూకుదనం! ఎటువంటి ఆధ్యాత్మిక సౌందర్యం!" అని శ్లాఘించాడు.

టాల్‌స్టాయి రచించిన "ఇవాన్ ఇలియిచ్ మృతి"* బహుశా రష్యా సారస్వతం మొత్తంలోను గొప్ప విషాదాంత నవల. ఇందులో సాంకేతికమైన జీవితానికి అలవడి, ఎప్పుడూ నిత్యవిధులలో మ్రగ్గుతూ, తుచ్ఛమైన దురహంకారంతో, ప్రాపంచికవిజయాలను చూచుకొని మురిసిపొయ్యే వ్యక్తుల అల్పజ్ఞత చూపెట్టబడింది. "క్రూయిజర్ సొనాటా" అనే మరో నవలలో కామవాంఛ. ఇంద్రియసుఖాలను టాల్‌స్టాయి నిరసించాడు. "క్రూయిజర్ సొనాటా" "సంస్కృతి ఫలితాలు" (The Fruits of Culture) అనే రెండు గ్రంథాలు టాల్‌స్టాయి బహుముఖ పరిశీలనకు నిదర్శనాలు. "అన్నా కెరినినా" నవల టాల్‌స్టాయికి సకల ప్రపంచంలోను లక్షలాది పాఠకుల ప్రశంసలను చేకూర్చింది, కొందరు ఈ నవల కళరీత్యా సమంజసంగా లేదని విమర్శించినప్పటికీ దీనిలోని కథావస్తువుకు ఒక ప్రత్యేకత ఉన్నది. ఈ నవలను ప్రారంభిస్తూ టాల్‌స్టాయి వ్రాసిన వాక్యాలు ఏ దేశంలోని కుటుంబాలకైనా వర్తిస్తాయి. "సుఖంగావుండే సంసారాలన్నీ ఎల్లప్పుడూ ఒకేవిధంగా ఉంటాయి. గొడవలు ఉండే సంసారాలు ఆ గొడవల గందరగోళంతోనే సతమత మవుతూవుంటాయి" అని అంటాడు. రష్యాలోని పెద్ద తరగతి కుటుంబానికి చెందిన ఒకానొక యువతి సంసార జీవితంలో కట్టుకున్న భర్తతో తృప్తిచెందక చిత్తచాంచల్యంతో నైతికంగా పతనంకావడం, అలా పతనమైకూడా ఆమె మనశ్శాంతి పొందలేక

---

* The Death of Evan Ilych.

పోవడం, చివరకు మృత్యుపుకౌగిలిలో చేరడమూ, ఎంతో ఆప్యాయంగా, వాస్తవంగా, హృదయవిదారకంగా చిత్రించబడింది. రష్యా ప్రజానీకంలో ఈ నవల పొందినప్రచారం అనన్యమైనది. ఒకానొక వారపత్రికలో ఈ నవల సీరియల్‌గా ప్రచురింపబడుతూవుంటే ఆ దేశంలోని గృహిణులు పత్రికా కార్యాలయానికి తమ మనుషులను పంపి ముందు జరుగబొయ్యే కథసంగతి తెలుసుకొనిరమ్మని చెప్పేవారట. అన్నా పాత్రను చూస్తూ, కథలో ఆమెకు తటస్థించే సంఘటనలను చదువుతూవుంటే మన సంఘం లోనే ఎవరో ఒకామె అన్నాలాంటిది ఉన్నదని భ్రమపడతాము.

టాల్‌స్టాయి వ్రాసిన "పునరుత్థానం" ( Resurrection ) అనే నవల 1899 లో ప్రచురింపబడింది. ఈ నవల రష్యాలోని అధికారివర్గాల జీవితాన్ని, రష్యాలోని జైళ్ళ పరిపాలనను కుండ బ్రద్దలుకొట్టినట్లుగా బహిర్గతం చేసింది. మానవుల సౌభ్రాతృత్వం విషయంలో టాల్‌స్టాయి అభిప్రాయాలకు ఈ నవల ప్రతిబింబం అని చెప్పవచ్చు. మానవధర్మానికి ఈ రచన బలీయమైన ప్రోత్సాహం ఇస్తుంది. ఆ ధర్మం ప్రత్యేకంగా ఏ ఒక్కజాతికీ చెందినదికాదు. సమస్త మానవజాతి అనుసరించవలెను ధర్మం అది. బాధలలో, నికృష్టమైన పరిస్థితులలో ప్రతిమానవుడు ఆ ధర్మంవైపు కళ్ళు తెరచిచూస్తాడు. మానవుడు సోదరమానవునిపై దయచూపి ప్రేమించాలని బోధిస్తుంది. "పునరుత్థానం" రచనరీత్యా, చెప్ప బడిన సిద్ధాంతాలరీత్యా, కళావిషయకంగా కూడా ఈ నవల టాల్‌స్టాయి ఔన్నత్యాన్ని చాటుతుంది. అంతేగాక మానవజీవితాన్ని గూర్చి ఆయన చేసిన పరిశీలనను, మానవసంఘంలోని సమస్యలను విప్పిచెబుతుంది. ప్రేమ, త్యాగం జీవితాన్ని నూతనపథాలకు పట్టిస్తాయని టాల్‌స్టాయి సిద్ధాంతం. దీనినే ఆయన ఈ "పునరుత్థానం" ( Resurrection ) అనే నవలలో అభివ్యక్తీకరించాడు.

"యుద్ధం, శాంతి" ( War and Peace ) అనే మరో నవలలో యుద్ధంవల్ల వచ్చే అనర్థాలు ప్రతిభావంతంగా విశదీకరించబడ్డవి. ఈ నవల

ఒక బృహద్గ్రంథం. దీన్నిగూర్చి ఎందరో మహానుభావులు అభిప్రాయాలు వెలిబుచ్చారు.

ఇక కథానికారచనలో టాల్‌స్టాయికిగల ప్రతిభ అమోఘమైనది. ఈయన కథలు ప్రపంచంలోని దాదాపు అన్ని ముఖ్యభాషలలోకి అనువదింపబడ్డవి. కథారచనలో ఈయన ప్రతిభకు "మనిషికి ఎంత భూమి కావాలి? (How much land does a man require ?)" అనే కథ ఒక్కటి చాలు. రష్యాలో శ్రీమంతులు, భూస్వాములు ఎన్నో ఉపాయాలు ఎన్ని పెద్దపెద్ద భూఖండాలను స్వాధీనంచేసుకొని సేద్యగాండ్రకు పొలాలు లేకుండాచేసే దురన్యాయాన్ని చూచి టాల్‌స్టాయి చాలా విచారించాడు. అటువంటి వ్యక్తిని ఒక పాత్రగా సృష్టించి, భూమికోసమై అతడు పడే లోభాన్ని చిత్రించాడు టాల్‌స్టాయి ఈ కథలో. భూసమస్యకు పరిష్కారమేమిటని మనం వితర్కించుకుంటున్న నేటికాలంలో ఈ కథ నైతికంగా ఒక పరిష్కారమార్గాన్ని బోధిస్తుంది. వ్యక్తిగతమైన ఆస్తిని కూడబెట్టుకోవడం నిష్ప్రయోజనమనీ, భూమి సేద్యం చేసేవాని స్వాధీనంలోనే ఉండాలిగాని పూరికే ఆస్తిగా దానిని ఆక్రమించ జూచేవారికి అది చెందకూడదనీ, మానవునికి కావలసింది ఆస్తికాదనీ, ఆత్మకావాలనీ టాల్‌స్టాయి ఈ కథద్వారా ప్రబోధం చేశాడు.

ఇలా చెప్పుతూపోవాలంటే టాల్‌స్టాయి రచనలు చాలా ఉన్నవి. ఈయన జీవితచరిత్రను వ్రాసిన ఒకానొక రచయిత ఈయన పుస్తకాలను దాదాపు నలభై రెండింటిని పేర్కొన్నాడు. టాల్‌స్టాయి చనిపోయిన తరువాత మరో ఆరుపుస్తకాలు బైటపడినవి. ఇవి సమగ్రంగా ఉన్నదీ లేనిదీ ప్రచురింపబడినదీ లేనిదీ సరిగా తెలియడంలేదు. టాల్‌స్టాయి వ్రాసిన విమర్శాత్మక రచనలుకూడా కొంత ప్రాముఖ్యం, విస్తృత కలిగివున్నవి. "కళ అంటే ఏమిటి?" అని ఈయన వ్రాసిన వ్యాసం కొన్ని ఆధునిక ధోరణులను ఖండించేదిగా ఉన్నప్పటికీ కళ అంటే టాల్‌స్టాయికిగల దృక్పథం ఏమిటో దానివల్ల కొంత తెలుస్తున్నది. అలాగే ఫ్రెంచి కథకుడు

మొపాసాను గూర్చికూడా టాల్‌స్టాయి 1894 లో ఒకవ్యాసం వ్రాశాడు. ఆ వ్యాసంలో ఫ్రెంచి సమాజంలోని పచ్చి శృంగారాన్ని టాల్‌స్టాయి నిశితంగా విమర్శించాడు, 1906 లో టాల్‌స్టాయి "షేక్‌స్పియర్, ఆయన నాటకాలు" అనే శీర్షికతో ఒక పెద్ద వ్యాసం వ్రాశాడు. అందులో షేక్‌స్పియర్ నాటకాలు నీతి నియమాలను పాటించనట్టి అప్పటి ఒకానొక పెద్ద తరగతివర్గానికి చెందినవని ఆయన నిందించాడు. షేక్‌స్పియర్ నాటకాలలోని సృజనాత్మక విశిష్టతను ఎవరూ కాదనలేరు. కాని టాల్‌స్టాయివంటి సూత్రబద్ధుడైన వ్యక్తికి ఆ నాటకాలు అలా కన్పించాయంటే అందులో వైపరీత్య మేమీ లేదు.

టాల్‌స్టాయి వ్యక్తిత్వం కేవలం రచయితగానే ఉండిపోలేదు. అటు యూరిపుఖండంలోను, ఇటు ఆసియా ఖండంలోనూ మేధావులైన వ్యక్తులు తమ అసమాన శేముషీవిశేషాలతో అసంఖ్యాకంగా రచనలుచేసి సమాజానికి అందించి సమాజంయొక్క ప్రశంసలనుబడసి అంతటితో పూరుకున్నవారున్నారు. అంటే రచనయినహా వారికేమీ అంతగా ఆసక్తి కలిగించేదికాదు. కాని టాల్‌స్టాయి కేవలం రచనలు చేసిమాత్రమే ఊరు కొనక, తన దేశంలో తన సమాజంలో ఏం జరుగుతున్నదో కళ్లుతెరచి చూచాడు. ఫ్రాన్సుదేశపు ప్రఖ్యాతకవి లూయీ ఆరగాంవలె ఈయన కూడా రచనచేస్తూ సమాజానికి దూరంపోక, సమాజానికి అంటిపెట్టుకొనివుండి దేశీయుల మంచిచెడ్డలను పరిశీలించాడు. సమాజంలో కన్పించే దురన్యాయాలను ఎప్పటికప్పుడు ఖండిస్తూ దేశీయులకర్తవ్యాన్ని ప్రబోధిస్తూ పోయ్యాడు, అలా ఖండించడంలో 'ఎవరిని ఖండిస్తున్నాను? ఎటువంటి వారికి హితబోధచేస్తున్నాను? దానివల్ల తనకేమైన ప్రమాదంకలదా?' అవి, ఎన్నడూ వితర్కించుకొని వెనుకాడలేదు. కాబట్టే ఈయన రచయితగానే కాక గొప్ప ఆత్మగలవ్యక్తిగా, ప్రబోధకుడుగా ప్రపంచప్రఖ్యాతి పొందాడు

1881 మార్చిలో నిహిలిస్టులు రెండవ అలెగ్జాండరు చక్రవర్తిని, హత్యచేయగా ఆ వార్త విన్న టాల్‌స్టాయి వెంటనే జారుచక్రవర్తికి ఒక

లేఖవ్రాస్తూ "క్రీస్తు బోధించిన సూత్రాలను పాటించి నిందితులను క్షమించవలసింది"గా విజ్ఞప్తిచేశాడు. అయన హృదయం అంత ఆర్ద్రమైనది.

ఒకమారు టాల్‌స్టాయి కుటుంబంవారు పెద్ద విందుచేసుకుంటున్నారు. విందు జరుగుతున్న సమయంలోనే దీనులు, శ్రమించి అలసట చెందిన నిరుపేదలు ఆ ప్రక్కనుంచిపోతున్నారు. వారినిచూచిన టాల్‌స్టాయి హృదయం కరిగిపోయింది. 1882 లో టాల్‌స్టాయి మాస్కోనుండి ఒక ప్రకటనచేస్తూ నిరుపేదలకు సహాయపడడానికి ఉద్యమం లేవదీయవలసిందిగా ప్రబోధించాడు. "అవును, ఘనం బీదవాళ్ళకోసం ఏమైనా చేస్తాం. ఎంత సహాయం చేస్తున్నట్లయినా నటిస్తాం. కాని వాళ్ళబుజాలెక్కి కూర్చొని దిగమంటేమాత్రం ససేమిరా దిగం" అంటాడు. టాల్‌స్టాయి సమాజాన్నిచూచి వ్యంగ్యంగా. పేదల ఉద్ధరణ అని గొంతుచించుకోవడం కంటె చేతలద్వారా వాళ్ళను విముక్తంచేయాలని ఆయన భావం.

ఒకపర్యాయం మురికిపేటల జనాభా విచారణ జరుగుతున్న సందర్భంలో, విచారణలో స్వయంగా పాల్గొని ఆ పేటలస్థితిని చూచిన టాల్‌స్టాయి నిర్విణ్ణుడై ఆధునిక సమాజం నైతికంగా సమర్థనీయంగా లేదని చాటాడు.

టాల్‌స్టాయి నేరాలు విచారించే న్యాయస్థానంలో జూరీలలో ఒక సభ్యుడుగా ఉండేవాడు. కాని 1883 లో ఆ సభ్యత్వాన్ని వదులుకున్నాడు. మళ్లీ సభ్యుడుగా ఉండమంటే నిరాకరించాడు. తన యావదాస్తిని భార్యాపిల్లలకు ఇవ్వజూపాడు. తన పనులన్నీ తానే చేసుకొనేవాడు. బూట్లు కుట్టుకునేవాడు. పొలం దున్నేవాడు. విత్తనాలు చల్లేవాడు. బండపై ఎరువు తోలుకొనివెళ్ళేవాడు. వేటాడ్డం, మద్యంత్రాగడం, పొగత్రాగడం, ఇవన్నీ మానుకున్నాడు. డబ్బువాడకాన్ని నిరసించాడు. బహు సాధారణునివలె జీవితం గడుపనారంభించాడు. ఇదంతా చూచి కొందరాయనను విమర్శించారు, కాని అటువంటి విమర్శలను ఆయన లెక్కచేయలేదు. తాను నమ్మిన సిద్ధాంతాన్ని నిశ్చయంగా ప్రతిపాదించి ప్రచారం చేయడంలోను,

దానిని తానే మొదట ఆచరించి చూపడంలోను యూరపుఖండంలోని మేధావులలోనేగాక యావత్ప్రపంచ ప్రముఖులలోను టాల్‌స్టాయి అగ్ర శ్రేణికి చెందినవాడు.

టాల్‌స్టాయి జీవితాన్ని గ్రంథస్థంచేసిన కొందరు రచయితలు ఆయన సిద్ధాంతాలకూ, అభిప్రాయాలకూ అపార్థాలు కల్పించారు. ఆయనపై వివిధమైన ఆరోపణలుచేశారు. మిస్టర్ టయిమర్ మాడ్ అనే రచయిత టాల్‌స్టాయినిగూర్చి వ్రాస్తూ "ఈయన ఇంతవరకు ప్రపంచంలో ఉంటూ వచ్చిన మూఢనమ్మకాలను ఖండిస్తూనే మరొకవైపు స్వీయమైనట్టి మూఢ సిద్ధాంతాలను ప్రచారంచేయడానికి ప్రయత్నించాడు. హింసను అవలంబించ వద్దు, ప్రభుత్వమే అక్కరలేదు, మానవశాసనం ఉండకూడదు, ఆస్తి ఉండకూడదు- ఇవన్నీ టాల్‌స్టాయి ప్రతిపాదించిన మూఢ సిద్ధాంతాలు." అని వ్రాశాడు. డాక్టర్ చార్లెస్ చౌరోలీ అనే మరొక రచయిత "కౌంట్ టాల్‌స్టాయి" అనే పేరుతో వ్రాసిన టాల్‌స్టాయి జీవిత చరిత్రలో "జీవితాన్ని ఎంతో బాగా చిత్రించగలిగిన ఇంతటి మహామేధావి అస్థిరహితము, అనాచరణీయములైనట్టి సిద్ధాంతాలను చెప్పడం వింతగావున్నది. ఆ సిద్ధాంతాలను ప్రతిపాదించి ఆయన తాను విఫలుడవడమేగాక ఇతరులను కూడా పెడమార్గం పట్టించాడు" అన్నాడు. వీరంతా ఏమనివ్రాసినప్పటికీ టాల్‌స్టాయి వ్యక్తిత్వాన్నిమాత్రం వీరు సరిగా అర్థం చేసుకోలేదనే చెప్పాలి. ఆ తప్పు వారిదికూడా కాదు. వారు నివసిస్తున్న యూరపుఖండం నైతికంగా ఆ పరిస్థితిలోవుంది. ఆ క్రైస్తవప్రపంచంలో బోధనలు ఒక తీరుగా ఉన్నవి. ఆచరణ మరొకవిధంగా ఉన్నది. క్రీస్తు ఆత్మనేవారు అర్థం చేసుకోలేనిస్థితిలో ఉన్నారు. ఆ ఆత్మను లోకాని కెరిగించి, తెల్లవారిని 'మిమ్ములను మీరు గుర్తించండి' అని హెచ్చరికచేసిన మహాత్ముడు టాల్‌స్టాయి.

1881 నుంచి టాల్‌స్టాయి వ్రాసిన నైతిక, మత సంబంధమైన రచనలు బహిష్కరింపబడడమేగాక సెన్సారువారిచే అణగద్రొక్కబడ్డవి

కూడా. పెద్ద వర్గాలకు చెందిన పెద్దమనుష్యులు ఈయనను "రాజకీయంగా ప్రమాదకరమైన మనిషి" అని భావించడం మొదలుపెట్టారు. అయితే ఆయన వ్యక్తిత్వాన్నిబట్టి, ప్రపంచంలో ఆయనకుగల పేరు ప్రఖ్యాతులను చూచి ప్రభుత్వం ఆయనను అరెస్టుచేయడానికి సాహసించలేకపోయింది. బుక్నర్ అనే మహాశయుడు ఇదే విషయాన్ని ప్రస్తావిస్తూ ఇలావ్రాశాడు:

"రష్యాలో మొట్టమొదటి సారిగా ఒక వ్యక్తిత్వం, ప్రభుత్వానికీ చర్చికీ వ్యతిరేకంగా నిలబడి ఎలుగెత్తి తన అభిప్రాయాలను నిర్భయంగా చాటింది. పూర్వాచారపరాయణులు, పాత మనస్తత్వం గలవారు టాల్స్టాయి పేరెత్తితేనే పండ్లు పటపట కొరికినప్పటికీ ఆయనపై చేయివేయడానికి ఎవరికీ ధైర్యం లేకపోయింది, తలచుకుంటే వారాయనను చర్చినుంచి బహిష్కరించి, ఆయన రచనలు అచ్చుకాకుండా చేయగలిగేవారే. కాని అదికూడా వారు చేయలేకపోయ్యారు. కారణం ఆ వ్యక్తిత్వం అటువంటిది."

రష్యారైతులు, శ్రామికులు పడుతున్న దుర్భర అవస్థను, వారి ఆర్థికదుస్థితిని చూచి టాల్స్టాయి చాలా విచారపడ్డాడు. అధికమైన పన్నులు, భూములనుంచి బేదఖలీలు, ధనమదాంధుల అత్యాచారాలు, ఇవన్నీ జరగడానికి ప్రభుత్వంయొక్క సైనికశక్తియే ముఖ్యకారణమనీ, అసలు ఆ దురవస్థకంతటికీ క్రైస్తవ మతంపేరిట చేయబడుతున్న దుర్బోధలే కారణమన్న అభిప్రాయానికి వచ్చాడు. అప్పటినుంచి ప్రభుత్వాన్ని, చర్చిని విమర్శిస్తూ వ్యాసాలు వ్రాయడం మొదలుపెట్టాడు. ఆ శ్రేణిలోవే ప్రస్తుతం ఈ గ్రంథరూపంలో వచ్చిన "ప్రభుత్వంవల్ల కీడు- హంతకుని పరిపాలన" (Evils of Government and Rule by Murder) అను వ్యాసాలు. ఈ వ్యాసాలు చాలా తీవ్రమైన దృక్పథంతో వ్రాయబడడంచేత వీటిలో వెలిబుచ్చబడిన భావాలు యూరపుఖండంలోని మహామహుల నందరినీ కలచివేశాయి.

ఈ రెండువ్యాసాలు 1899 ప్రాంతంలో వ్రాయబడినప్పటికీ ప్రపంచ పరిస్థితి— అంటే యుద్ధభయం మానవులను అప్పుడు ఎలా ఆవరించి ఉండేదో ఈనాడు కూడా అంతేవున్నది. పైగా ఆటంబాంబు, హైడ్రోజన్ బాంబు మొదలగు దుష్టమైన మారణాయుధాలు విపరీతంగా తయారుచేయ బడి ప్రయోగింపబడుతున్న యీకాలంలో యుద్ధమంటే మృత్యువుకూ, సర్వనాశనానికీ పర్యాయపదంగా గోచరిస్తున్నది. వాస్తవంకూడా అంతే. అసలు ఈ యుద్ధాలు ఎందుకొస్తాయి అనే విషయాన్ని టాల్‌స్టాయి సుదీర్ఘంగా ఆలోచించాడు. చివరకు యుద్ధముల పుట్టుకకు కారణం స్వార్థంతో కూడుకున్న దేశభక్తియేనని ఆయన అన్నాడు. నిజమైన దేశ భక్తి ఇతరజాతుల సౌఖ్యాన్ని భంగమొనర్చేదిగా కాక తమ ప్రజలకు సౌఖ్యదాయకమైనదిగా ఉండవలెనని అన్నాడు. ప్రభుత్వాలు ఆయుధ నిర్మాణం ఆపనంతవరకు యుద్ధాలు తప్పనిసరి అని తేల్చుకున్నాడు.

ప్రజలు, వారు ఏ రాజ్యానికి చెందినవారైనా పరస్పరం కలహించ నొల్లరనీ, సైన్యాధికారులతో కూడిన ప్రభుత్వాలే మిక్కిలి అపాయకర మైనవనీ, దేశభక్తి అనే ఆచ్ఛాదనతో నడుస్తూవున్న ప్రభుత్వాలను అంత మొందించనిదే మానవజాతికి మేలు కలుగజాలదనీ ఉద్ఘాటించాడు. యుద్ధాల కన్న, రక్తపాతాలకన్న ఇరుగు పొరుగువారితో సఖ్యంగావుండి శాంతిగా జీవించవలెననీ జీసస్ బోధలే యీరావుఖండానికి అనుసరణీయమైనవని చెప్పాడు. ఇదే స్వతంత్ర భారతదేశం నేడు ప్రబోధిస్తున్న పంచశీల సహ జీవన సిద్ధాంతం.

ఆనాడు రష్యాలో జరుగుతున్న అత్యాచారాలను చూచి "రష్యాలో జరుపబడుతున్నదంతా ప్రజాక్షేమంపేర, శాంతిభద్రతలపేర చేయబడు తున్నది. ఈ మాటేవాస్తవమైతే రష్యాలో జరుగుతున్నదంతా రష్యాలో నివసిస్తున్న నా కొరకు జరుగుతున్నట్లేకదా! నిజమైన క్రైస్తవ మతధర్మ ముల కప్పిపుచ్చి, పెడమార్గాల నవలంబిస్తున్న మోసపు పీఠాధిపతులు నా కొరకా?" అని ప్రశ్నించిన ధీరోదాత్తుడు టాల్‌స్టాయి. "అమానుష

చర్యలు ఆగనైనా ఆగాలి. లేకపోతే అవి ఎవరికొరకని చేయబడుతున్నవో ఆ ప్రజలనుంచి నన్ను వేరుచేసి. ఆ దురంతాలన్నీ నా కొరకు జరుప బడడం లేదనే ఆత్మసంతుష్టి నేను పొందడానికిగాను నన్ను జైలులోనైనా పెట్టండి" అని ఆనాటి నిరంకుశ అధికారులను కోరిన మహానుభావుడు టాల్‌స్టాయి.

ప్రజలపై అత్యాచారాలను జరిపే ప్రభుత్వం ఉండడంకంటె అరాజకమే మేలని ఆయన వాదించాడు. అయితే అరాజకం హౌర్జన్యయుత విప్లవాలమూలాననే సాధనమవుతుందని తలచడంతో అరాజకవాదులు పొర బడుతున్నారని టాల్‌స్టాయి వారిని హెచ్చరించాడు. మారవలసినది, నశించవలసినది అధికారవాంఛ, దుష్టబుద్ధిగాని వ్యక్తులు కాదని ఆయన చాటాడు.

శక్తిని శక్తితో నిర్మూలించడం మంచిదికాదన్నాడు.

నిరంకుశ ప్రభుత్వాలనుంచి విముక్తి పొందాలంటే ప్రజాప్రబోధం ఒక్కటే మార్గమని, చంపడం తప్పని ప్రజలకు బోధించాలని హితవు చెప్పాడు.

సంఘంలో శాంతిగాని, ఉద్రేకంగాని ఒకరిద్దరి వ్యక్తిత్వంపై ఆధారపడక, జాతి యందలి అధిక సంఖ్యాకుల స్థితిగతులపైనను, ప్రభుత్వాన్ని గూర్చి వారికిగల భావాలపైనను, వారి మత భావాల ననుసరించి ఏర్పరచుకొను మంచి చెడ్డలపైనను ఆధారపడి ఉంటుందని తెలిపాడు.

ప్రజలను హింసించి వారిని శాంతపరచలేరు; మానవమాత్రులకు సహజమైన ప్రేమను, సమాధాన మార్గాలను విడిచి, మీరెంత దుఃపిరాడని గట్టి ప్రయత్నాలుచేసినా ప్రయోజనం పొందలేరని ప్రభుత్వాధికారులకు టాల్‌స్టాయి హెచ్చరికచేశాడు.

ఏ దేశానికి చెందినవారైనా, ఏ వృత్తిగలవారైనా అందరూ పరస్పరం సోదరభావం కలిగి ఒకరి సరుకులను మరొకరికి విక్రయించు కున్నట్లే వారిలో కలిగే పరస్పరభిన్నభావాలను కూడా ఒకరికొకరు తెలుపు

కుంటూ ఉండడంవల్ల అధికసౌఖ్యం పొందగలుగుతారు. మానవులకు మంచిని ఒనగూర్చువారు మొదట తాము మంచివారుగా తయారుకావాలి. మానవులను సత్ప్రవర్తన గలవారుగా ఉండమని ప్రోత్సహించడానికి ఒకటే మార్గంవున్నది. మనుష్యుడు తనయందు, ఇతరప్రాణులయందు ఒకేవిధంగా ప్రవర్తించాలి. న్యాయమగు హక్కులు అవి నీతికి సంబంధించినవైనా, లేక ప్రకృతికి సంబంధించినవైనా, ప్రజలందరికీ వర్తించాలి. తనకొరకై ఇతరులచే పని చేయించకూడదు. విసుగుపుట్టించే పనులను స్వయంగాచేయాలి. శాశ్వతవిప్లవం ఒకటి రావాలి. కాని అది నీతికి సంబంధించినదై ఉండాలి అని టాల్‌స్టాయి సర్వప్రపంచానికీ చాటాడు. టాల్‌స్టాయి ఏ వాక్యాలలో ప్రపంచానికి ఒకమార్గం చూపాడో అక్షరాలా అవే అమలుజరుగకపోయినా ఆయన రచనలలో అంతర్గతమైవున్న ఆయన ఆత్మమాత్రం అమరమైనది. అదే నేటి కల్లోలప్రపంచానికి వెలుగు చూపుతుంది.

టాల్‌స్టాయికీ ఆయన భార్యకూ ఉన్నట్టి అభిప్రాయభేదాలు 1910 అక్టోబరు 28 తేదీన పతాకస్థాయి నందుకున్నాయి. ఇక ఇద్దరికీ పడరాని స్థితి ఏర్పడింది. అదేరోజు ఆయన ఇంటిని, కుటుంబాన్ని విడిచి, తన సొంతడాక్టరు మకోవిట్‌స్కీ వెంటరాగా, షమోర్డిన్ కాన్వెంట్‌లో వున్న తన సోదరి మేరీని తుదిసారిగా చూచాడు. ఆ తరువాత రష్యా వదలిపోవాలని నిశ్చయించుకున్నాడు. కాని రైలులోనే జబ్బుపడి, వారం రోజులు బాధ అనుభవించి అస్టాపోవోలో 1910 నవంబరు 7 తేదీన కాలధర్మం చెందాడు. ఆయన మరణించిన తరువాత భార్యకు ఆయన వ్రాసిపెట్టుకున్న ఉత్తరం దొరికింది. అందులో 1881 నుంచి తాను గడుపుతూవున్న జీవితానికీ తన లక్ష్యాలకూ ఏవిధంగా సంఘర్షణ జరిగిందీ, ఎలా తాను ఇల్లువిడిచివెళ్ళాలని నిర్ణయించుకున్నదీ వివరిస్తూ, భార్య తనను అనుసరించనందుకు ఆమెను ఏమాత్రం నిందించకుండా, వారిద్దరి ముప్ఫయి అయిదేండ్ల దాంపత్య జీవితాన్ని ఎంతో ఆప్యాయతగా గుర్తుకు తెచ్చాడు.

చివరిగడియలలో ఆయన ప్రపంచాన్ని గూర్చి మాట్లాడుతూ "ఈ ప్రపంచంతో, ఈ మనుషులతో నేను విసిగిపోయ్యాను" అన్నాడు.

టాల్‌స్టాయినిగూర్చి రష్యా ప్రముఖరచయిత టర్జనీవ్ ఇలా అన్నాడు : "ఆయనతో పోల్చితే నేను ఏపాటివాడను ? సమకాలిక యూరపు సాహిత్యంలో ఆయనకుసాటి ఎవరూలేరు. ఆయన ఏ వస్తువును స్వీకరించి రచనచేస్తాడో అది ఆయనకలంతో ప్రాణంపోసుకుంటుంది. ఆయన సృజనాత్మకశక్తి ఎంత విశాలమైనదో తలచుకుంటే ఆశ్చర్యం కలుగుతుంది."

రష్యా సారస్వతాకాశంలో మహోజ్జ్వలతారవంటి వ్యక్తి మాక్సింగోర్కీ ఒకప్పుడు టాల్‌స్టాయిని గూర్చి తన అభిప్రాయమిస్తూ "టాల్‌స్టాయి తనకోసం మరొక నాలుగుగోడల గదిని కట్టుకొని, ఆ నాలుగు గోడల మధ్యవరకే పరిమితమైవుండక విశ్వసాహిత్యంలో సువిశాలమైన స్థానాన్ని ఆక్రమించుకున్నాడు. ఆయన ప్రతిభ బహుముఖమైనది. నేను ఎప్పుడుచూచినా ఆయనలో నాకొక కొత్త వ్యక్తిత్వం గోచరిస్తూవుండేది" అన్నాడు.

టాల్‌స్టాయి నేటి ప్రపంచానికి ఉత్తమసాహిత్యాన్నేగాక ఉత్తమోత్తమమైన ఆశయాలను కూడా అందజేశాడు. కాబట్టే ఆయనరచయితగాను, మహర్షిగాను, మహాత్ముడుగాను స్థిరంగా నిలచిపోయ్యే స్థానాన్ని చేరుకున్నాడు. ఈయన ఒక కాలానికిగాని, ఒక దేశానికిగాని హక్కుభుక్తమైపోయినవాడు కాదు. ఎందుచేతనంటే ఈయన రచనల్లో జీవితపు సత్యాలు ప్రతిబింబించాయి. ఈయన సందేశము మానవకోటికంతటికీ శిరోధార్యమైనది. కాబట్టి ఈయన ఒక్క రష్యాకేగాక నిఖిలప్రపంచానికి చెందిన విశ్వమానవుడు.



# ప్రజలు - ప్రభుత్వము

## మొదటి ప్రకరణము

### ఘోర కృత్యములు

ఏడు ఉరిశిక్షలు. (పీటర్సుబర్గులో రెండు, మాస్కోలో ఒకటి, పెన్సాలో రెండు. మరియు రీగాలో రెండు.) నల్గురు ఉరి తీయబడిరి. (ఖేరసన్‌లో యిద్దరు, విలానాలో ఒకరు, ఒడెస్సాలో ఒకరు.)

ఈ ప్రకారం ప్రతిదినము, ప్రతి పత్రిక ప్రకటించుచున్నది. ఇట్టివి వారములు కాదు; నెలలుకాదు; సంవత్సరములకొలది సాగుచున్నవి. అది ఈ రష్యాలో - ఎచ్చటనైతే నిందితులు కనికరింపదగినవారుగా జనులు భావింతురో, మరి ఎచ్చటనైతే నిన్న మొన్నటివరకు ఉరిశిక్షను న్యాయశాస్త్ర మంగీకరించియుండలేదో - అట్టి రష్యాలోనే. ఈ సందర్భమున పశ్చిమ యూరపుఖండవాసులతో మాట్లాడునప్పుడు నేనెంత గర్వించుచుంటినో నాకు జ్ఞాపకము కలదు. అయితే ఇప్పుడో! రెండవ సంవత్సరముకాదు; మూడవసంవత్సరము నడచుచున్నది. ఉరిశిక్షలు - ఉరిశిక్షలు - ఉరిశిక్షలు - అంతులేదు. ఈ రోజు పత్రిక తీసుకొంటిని. ఈ రోజు ౯ వ మే. పత్రికలో ఈ కొద్దిమాటలు గలవు. "ఎలిజబెత్‌గ్రాడ్ జిల్లాలోని, ఖేరసన్ గ్రామ భూస్వాముల ఆస్తులను దోచుకొన ప్రయత్నించిన ౨౦ మంది గ్రామస్థులు ఉరితీయబడిరి."

ఎవరి కాయకష్టముపై మనము జీవింతుమో, మనకు సాధ్యమైన అన్నిసాధనలచే ఎవరిని భ్రష్టులుగ నొనర్చితిమో, ఇంకనూ చేయుచుంటిమో, మనకు విశ్వాసములేనట్టి ఏ విషపూరితవిధానము మనశక్తికొలది ఎవరిపై

అమలు చేయుచుంటిమో అట్టి ౧౨ గురు కష్టజీవులు—తమ కాయకష్ట ముతో పండించిన పంటలు, కట్టిన యిళ్లు, నేసిన వస్త్రములు అనుభవించ కుండ ఉరిత్రాళ్ళచే ఊపిరాడకుండ బిగింపబడిరి. ఎవరిచయ, పరిశ్రమ మరియు నిరాడంబర జీవనముపై ఈ రష్యాదేశ మాధారపడియున్నదో, అట్టి ౧౨గురి భర్తలు, తండ్రులు, బిడ్డలు నిర్బంధింపబడి, కారాగారముల యందు సంకెళ్ళతో బంధింపబడిరి. ఉరితీయు త్రాళ్ళను పట్టుకొనకుండు టకై చేతులను వెనుకకు విరిచికట్టి వారు ఉరికంబములవద్దకు గొంపో బడిరి. ఈ ఉరితీయబడువారి తరగతి (కష్టజీవులు)కి చెందిన కొందరు ఆయుధపాణులై, పరిశుభ్రమైన సైనికదుస్తుల ధరించి, కాళ్ళకు మంచి కాలిజోళ్ళను ధరించి నిందితులవెంట నడతురు. వారి ప్రక్కన వెండి బంగారపు నగిషీలు చెక్కబడిన దుస్తుల ధరించి ఆ దుస్తులపై విలువ గలిగియున్న పెద్దగడ్డపు పురుషుడొకడు నడచును. ఆ సమూహము ఒక చోట ఆగును. ఈ వ్యవహారకాండకు సంబంధించిన అధికారి ఏమో చెప్పును. కార్యదర్శి కాగితమొకదానిని చదువును. కాగితము చదివిన పిమ్మట ఆ సమూహములోని ఉరితీయబడువారి నుద్దేశించి, ఆ పొడుగాటి గడ్డపుమనిషి క్రీస్తుదేవునిగూర్చి ఏమో చెప్పును. ఈతని వాక్యములు ముగియగనే, ఉరితీయువారు (ఇంతటి చిక్కైనపనిని ఒకరు చేయజాలరు గాన పలువురుందురు ) ద్రవపదార్థము నొకదానిని తయారుచేసి, మంచిగా బిగియుటకై త్రాళ్ళయొక్క ముడులమధ్య దానినివేసి, ఉరితీయబడవలసిన వారిని ఉరికంబముల కెక్కించి, వారి ముఖములను గుడ్డతోకప్పి ఆ ఉరి త్రాళ్ళను మెడలకు తగిలింతురు. వారి శరీరపుబరువుచే మెడలకు తగిలించ బడిన ఉరిత్రాళ్ళు బిగియునిమిత్తము వారి కాళ్ళక్రిందనున్న బల్లలను తొల గించి వ్రేలాడునట్లు చేతురు. దానిచే నూపిరాడక వారలు చాలా బాధపడు దురు. ఒక నిమిషముక్రింద సజీవులుగా ఉన్నవారు మొదట కొద్దికొద్దిగా ఊగి తరువాత కదలిక ఆగిపోయి శవములగుదురు.

ఇదంతయు పైతరగతికిచెంది విద్యావంతులు, నవనాగరికులనబడువారిచే బాగుగా యోచింపబడి, ఏర్పరుపబడిన విధానము. ఈచేయబడుపనుల నెవరును చూడకుండు నిమిత్తము రహస్యముగా వేకువజామున జరుగున ట్లేర్పాటు చేతురు. మరియు ఈ దుష్కృత్యము లొనర్చువారు తమలో ఏ ఒక్కరును బాధ్యులుకానట్లు తామనుకొనుటకు, యితరులకు చెప్పుటకు శాఖోపశాఖలుగా విభజించుకొని చేయుదురు. మనచే అంగీకరింపబడిన ఈ పనులను చేయుటకు సంఘములోని మిక్కిలి నీతిదూరులు దురదృష్టవంతులునగు ఉద్యోగులను ఏరికోరి నియమింతురు. ఈ సామాన్య కుతంత్రముకూడ ఈక్రిందివిధముగా నేర్పాటుచేయబడినది. సైనికన్యాయసభవారు శిక్షల విధింతురు. కాని ఉరితీయబడుచోట వారుండరు. ఇతరోద్యోగులుందురు. ఇక కేవలము మెడలకు బాగుగా బిగియునట్లు త్రాళ్ళను తడిపి తగిలించుపనిని ఆయుద్యోగులు చేయరు. ఈపనికై ఆత్మలనేగాక మానవులమను మాటనుకూడ మరచునట్లుచేయు కల్లును (ఇది పైతరగతి వారిచేతనే విక్రయింపబడుచున్నది.) తప్పత్రాగినట్టిన్ని, నీచముగాను, నిర్లక్ష్యముగాను చూడబడుచూ వంచింపబడిన అమాయకులు నియమింపబడుదురు. ఒక వైద్యుడు శవములను చుట్టివచ్చి పని మంచిగా జరుపబడినదని అచ్చటనున్న అధికారులకు తెలియజేయును. ఆపండ్రెండుగురు వాస్తవముగా చచ్చిరి. పిమ్మట అధికారులు బాధాకరమైననూ అవసరమైన తమవిధిని నెరవేర్చినట్లు మనస్సమాధానపడి తమతమ నిత్యకృత్యములకు వెళ్ళుదురు. శరీరములు చల్లబడి బిర్రబిగిసినవి. మరియు అవి అచ్చటనుండి తీయబడి పూడ్చబడినవి.

ఆహా! ఎంతటి ఘోరకార్యము. ఒకసారికాదు. ఈ రష్యాప్రజలలోని మంచితరగతికిచెంది తప్పుదారిత్రొక్కింపబడిన ఈ పండ్రెండుగురేకాదు, సంవత్సరాలకొలది అంతులేకుండ ఇట్లే జరుపబడుచున్నది.

ప్రభుత్వ చర్యలచేతనే తప్పుదారిపడిన వందలు వేలకొలది మరదృష్ట ప్రజలపై జరుపబడుచున్నది.

ఈ ఘోరము లింతటితో నాగలేదు. అదే నెపముతో, అదే మహా భయంకర క్రూరబుద్ధితో జైళ్ళయందును, కోటలందును, ప్రవాసము లందును నిర్బంధింపబడి (యమబాధల) దౌర్జన్యముల పాలుకావింప బడుచున్నారు.

ఇది ఘోరము. దీనికిమించిన ఘోరముకలదు. యుద్ధములందును, దొంగతనములందును, పోట్లాటలందును స్వీయరక్షణపేర తమలోతాము సంతృప్తిపొంది యితరులకు నచ్చచెప్పుటవంటివిగాక, ఇందుకు విరుద్ధ ముగా యోచించి, చర్చించి, నిర్ణయించబడి చేయబడుచున్నవి. ప్రత్యేక ముగా ఈపనులను ఘోరములనుట ఎందుకన—ఈపనులకు బాధ్యులైన ప్రధానన్యాయాధికారి మొదలు ఉరితీయువారివరకును గల అందరును స్వయముగా యిట్టిపనులు చేయుకోరరు. దీనివలన మానవులపై మానవుడు అధికారము వహించి మానవుల ప్రాణములనే అపహరించు నిరంకుశ ప్రభుత్వము ఎంత దుస్సహమైనదను విషయము అన్నిటికన్న స్పష్ట ముగా రుజువగుచున్నది.

ఒకని కష్టమును, అతని ధనమును, అతని గుడ్డమును. ఇంకనూ అతని కుమారుని, కుమార్తెను అపహరించ చూచుటయే దుస్సహకర మైన విషయమైయుండ, ఒకడు మరొకనిచే ఆత్మవినాశకరమగు పనుల చేయ నిర్బంధించుటయు, ఆధ్యాత్మికోన్నతికి భంగమొనర్చ జూచుటయు ఎంతటి అసహ్యకరమగు విషయము! వీటికంతయు బాధ్యులైనవారు చేయుచున్న ఘోర మిదియే. ప్రజాక్షేమమనుపేర ప్రధాన న్యాయాధికారి మొదలు ఉరితీయువానివరకుగల యావన్మందిచేతను లంచము లిచ్చి, బెదరించి, మోసగించి, చేయించుచున్నవారు చేయుచున్న పని యిదియే.

ఈ ఘోరములను ఒకచెంప రష్యాయందంతటను జరుపుచూ, మరొకచెంత ఈ పనులు ఉపయోగకరమైనవనియు, అవసరమనియు యితరులకుకూడ నమ్మబలుకు చున్నారు. ఈ ఘోరము లన్నింటికి ఎవరు ముఖ్య బాధ్యులో, ఎవరి ఆజ్ఞలచే యీ పనులు జరుపబడుచున్నవో వారు తలచినంతమాత్రమున ఆపగలరు, కాని వారి దృష్టియందు ఆదర్శ జీవు లుగా నిర్ణయింపబడినవారిని ఇతరులుకూడ తమ చిరకాలానుగత ఆచార ముల వదలి, అనుసరించునట్లు విధానములు కల్పించియు, పెద్దపెద్ద ఉప న్యాసము లిప్పించియు, యింకను అవసరమగుచో నిర్బంధించుచున్నారు. మరియు, హుస్సరుదళములలోని సైనికుల జాకెట్లపైన. చేతులవద్ద అంచు లిట్లుండవలెనని, మెడలకు తగిలించుకొను కాలర్లు రంగు లిట్లుండవలెనని ఏవేవో పిచ్చి పిచ్చి ఉత్తర్వులు ప్రకటించుచుందురు.

ఇందువలన కలుగుచున్న అత్యంతభయంకర పర్యవసాన మేమన హత్యలకు, అమానుష క్రౌర్యములకు పాలుగావింపబడిన ఆ నిర్భాగ్యులు వారి కుటుంబములకు జరిగిన హానియేగాక, ఎండిన గడ్డివాములకు నిప్పంటుకొన్నట్లు, రష్యారాజ్యమందలి అన్ని తరగతులవారి మధ్యను ఈ చెడుగు వ్యాపించుచున్నది. మరియు ఈ చెడుగు అతిశీఘ్రముగా అమాయకులగు పాటకజనుల మధ్య పెరుగును. ఎందుకనగా దొంగల చేతను, దోపిడిగాండ్రచేతను, విప్లవకారులందరిచేతను కావింపబడు దౌర్జన్యములకన్న నూరంతలు హెచ్చుగా మించిపోయిన ఈ ప్రభుత్వ దౌర్జన్యములు అవసరమైనవనియు, తప్పనివనియు భావింపబడి, కావింప బడుచున్నవి. ఇట్టి దౌర్జన్యములను కేవలము సమర్థించుటయే కాక, జను లచే, న్యాయబద్ధమైనవనియు, సదా భావింపబడు వివిధసంస్థలచే అనగా శాసనసభ, కార్యనిర్వాహకసభ, మతశాఖ—చక్రవర్తి ఈ వివిధసంస్థల ఆమోదమును పొందినవియునై యున్నవి.

కొద్దికాలముక్రింపట, రష్యా మొత్తముపై యిద్దరైననూ ఉరితీయువారు లేకుండిరి. క్రీ. శ. ౧౮౮౦ ప్రాంతమున ఒక్కడే యుండెను. ఆ రోజులలో రష్యా మొత్తముపై రెండవ ఉరితీయువాడు దొరుకుట లేదనియు, ఉన్న ఒక్కనినే అవసరమగు స్థలములకెల్ల గొనిపోబడుచున్నట్లు సంతోషముతో వచించిన మిత్రుని వాక్యములు నాకు జ్ఞాపకమున్నవి. ఇప్పుడటుల లేదు. మాస్కోపట్టణములో ఒక చిన్న వ్యాపారస్థుడుండెను. అతని వ్యాపారమునందు లాభములు లేకుండెను. అందుచే ఆ వ్యాపారమును నిల్పి, ప్రభుత్వమువారిచే నిర్ణయించబడు మనుష్యుల ఉరి తీయుటకై, ఉరితీయబడువాని ఒక్కొక్కనికి ౧౦ పౌనులు (షుమారు ౧౪౦ రూపాయలు) వేతనము నిర్ణయించుకొని, కొద్దికాలము ఈ ఉద్యోగమును నిర్వహించెను. కొంత ధనము సమకూర్చుకొని పిమ్మట తన మొదటి వ్యాపారములోనికి మారెను.

ఒరేల్ పట్టణమందు ఇతర స్థలముల యందువలెనే గడచిన మాసములో ఒక ఉరి తీయువాడు కావలసివచ్చెను. వెంటనే, తలకు ౫ సవరనులు (సుమారు ౭౦ రూపాయలు) వేతనముపై, ప్రభుత్వముచే నిర్వహింపబడు కూనీల పనిచేయుటకు ఒకడు దొరికెను. ఈ నిర్ణయమైన తరువాత ఇట్టి పనికి, యితర పట్టణములయందు హెచ్చు వేతనము యివ్వబడుచున్నట్లు తెలుసుకొనెను. అతడు ఉరి తీయవలసిన సమయమందు, ఉరి తీయబడువాని నెత్తినటోపి, ఒంటిపై అంగరకా తగిలించి, ఉరికంబమునకు తీసుకొని వెళ్ళుటకు ముందు, ఆ పనిని ఆపి, ప్రభుత్వాధికారి వద్దకు వెళ్ళి "గౌరవనీయులగు ఓ ప్రభో! మరొక ౨½ సవరనులు (౩౫ రూపాయలు) అధికముగా నివ్వవలెను. లేనిచో, నేను చేయజాలన నెను, కోరిన మొత్తమును పొంది నిర్ణయకార్యము ముగించెను.

మరొకతూరి అయిదుగురు ఉరితీయబడవలసియుండిరి. ఉరితీయబడు రోజుకు ముందుగా ఒక నూతన పురుషుడు, ప్రభుత్వపుకూనీల

పనిని నిర్వహించు ప్రభుత్వాధికారిని సందర్శించవెళ్ళెను. ప్రభుత్వాధికారి ఇతనికి దర్శనమిచ్చెను. ఇతడు ఆ ప్రభుత్వాధికారితో ఒకానొకడు మనిషి ఒక్కొక్కనికి ఏడున్నర సవరనులు కోరియుండెనుగదా! ఈ రోజున అయిదుగురిని ఉరి తీయవలసియుండునని వింటిని. ఆ పనియంతయు నా కప్పగించిన, ఆ మొత్తమునకే అయిదుగురి పనిని సక్రమముగా నెరవేర్చగలననియు, పనియందు లోప ముండదనియు చెప్పెను.

ఈ కోరిక నంగీకరించిరో, లేదో నాకు తెలియదు. కాని, కోరినట్లు మాత్రము నాకు తెలియును.

ప్రభుత్వముయొక్క ఘోరములు ప్రజలలోని నీచాతి నీచులలోను, అత్యంత నీతిబాహ్యులలోను ప్రతిబింబించుచున్నవి. అంతేగాక, ఈ ఘోర కృత్యములు సాధారణ నీతిపరులైనట్టి జనసామాన్యముపై ప్రాబల్యము వహించుచున్నవి. మరియు ప్రభుత్వము లొనర్చు ఘోరకృత్యములను జను లందరు—ముఖ్యంగా యువకులు ప్రతినిత్యము వినుచుండుటచేతను, చదువు చుండుటచేతను, ఇట్టి భయంకరకృత్యములు చేయువారిని గౌరవహీనులుగా చూడక, గౌరవించబడు చుండుటచేతను, బహుశః ఈ పనులు అందరు తలంచునంత ఘోరములు కావేమోయను వాసనకు దిగుచున్నారు.

మనము ఎంత తేలికగా వాతావరణమును గూర్చి మాట్లాడుకొను చుందుమో, అంత తేలికగా ఉరి తీయుటలు, హత్యలు, బాంబులను గూర్చి యిప్పుడు ప్రజలు వ్రాయుచున్నారు, చదువుచున్నారు. ఇంకను కళ్లు తెరచీ తెరవని విద్యార్థులు మామూలు నిత్యకృత్యములవలె చదువు సంధ్యలు వదిలి చంపుటకు సిద్ధపడుచున్నారు. భూమిలేని ప్రజల సమస్యను పరిష్కరించుటకై, గొప్ప భూస్వాముల చంపి, వారి భూములను స్వాధీనపర్చు కొనుటయే మంచి సాధనముగా జనులు భావించుచున్నట్లు కనబడుచున్నది.

ప్రభుత్వమువారు తమ ఉద్దేశ్యములు నెరవేర్చుటకై కావించునట్టి హత్యలను చూచి, కష్టజీవులగు సామాన్య జనులుకూడా దొంగతనములు,

దోపిడులు, పరుల పీడించుట, మరియు హత్యలుచేయుట మొదలైన వన్నియు సామాన్యచర్యలేయని భ్రమించి చేయుచున్నారు.

అవును ! దానివలన సంభవించిన అవ్యక్తమైన ఆధ్యాత్మిక, నైతిక దౌష్ట్యము మరింత ఘోరమైనది.

శాంతిక్రమములు కాపాడు నిమిత్తము, ఈ భయంకర కృత్యము లన్నియు చేయుచున్నట్లు మీరు (ప్రభుత్వము) చెప్పెదరు. మీరు శాంతి భద్రతలు కాపాడుదురా ?

ఏవిధముగా మీరు వాటిని కాపాడుదురు ? మీరు క్రైస్తవ మతమునకు చెందినవారు. క్రైస్తవ పీఠాధిపతుల సహకారము, ప్రోత్సాహము మీకు గలదు. అట్టి మీరు మీ విశ్వాసఘాతుక చర్యలచే, మీచే యొనర్పబడు అన్నిరకముల చిత్రవధలచే, మానవుని హృదయమునకు అసహ్యము గూర్చే హత్యలచే, మానవులయందు మిగిలియున్న ఆ కొద్దిపాటి సత్యము నందలి విశ్వాసము. పాపభీతిని, మీరు నశింపజేయుచున్నారు. మీరొనర్చు హత్యలు ! ఒకటా !! కాదు, అసంఖ్యాకములు. ఈ హత్యలను సమర్థించు కొనుటకై మీలో కొందరిచే వ్రాయబడిన—దైవదూషణాకరములగు, న్యాయశాసనము 'లా' అని మీచే పిలువబడుచూ—ఆ నీచపు అసత్యపు పుస్తకములపై ఆధారపడి చేయుచున్న ఘోరములు—మానవునియందలి మత విశ్వాసమును నశింపజేయును.

ప్రజల శాంతింపజేయుటకు, విప్లవ మణచుటకు, ఇదొక్కటియే మార్గమందురు. అయితే, అది సువ్యక్తమైన అబద్ధము. మీరు వ్యవసాయ దారులు కోరినట్లు. భూములపై వ్యక్తుల అధికారమును తొలగించి, అవి సమిష్టి ఆస్తిగా పరిగణింపబడవలెనను కోరికను తృప్తిపరచి, వ్యవసాయ కులు ఉద్రిక్తులు కాకుండునట్లు చేయవలెను. మరియు ఉద్రేకులు, విష పూరితులై మీతో పోరాటముచేయ సిద్ధపడినట్టి యితరులను సమాధాన పర్చవలెను. లేనిచో, మీరు వారిని శాంతింపచేయజాలరనుట స్పష్టము.

మీరు ప్రజల హింసించుటవలనగాని, ఆయాసపెట్టుటవలనగాని, ప్రవాసముల కంపుటవలనగాని, స్త్రీలను పిల్లలను ఖైదులందుంచుటవలన గాని, ఉరికంబము లెక్కించుటమూలమునగాని శాంతిపరచజాలరు. మానవ మాత్రులకు సహజమయిన ప్రేమ, సమాధాన మార్గముల విడనాడి మీరెంత ఊపిరాడని గట్టి ప్రయత్నములు చేసినను ప్రయోజనమును పొందజాలరు. మీకృత్యములవలన మీరు వ్యాధినివారణ చేయజాలకపోవుటయేగాక పరిస్థితు లింకను అధోగతి పాలొనర్చుచున్నారని గ్రహించినచాలును. ఇది మాత్రమే వాస్తవము.

ఈ జరుగుచున్నదారుణములకు కారణము అధిభౌతిక విషయములపై ఆధారపడినవిగాక పూర్తిగా ఆధ్యాత్మిక ప్రవృత్తికి సంబంధించినవై యున్నవి. ఎటుల పెద్దపెరిగిన మనుష్యుడు తిరిగి బాలుడు కాజాలడో, అటులే మార్పును కోరుచున్న ప్రవృత్తి ఎట్టి నిర్బంధవిధానము నాపజాలదు. ప్రజల ద్వేషముగాని, శాంతిగాని ఒకవ్యక్తి జీవించియుండెనా ? ఫురితీయబడెనా ? అనుదానిపైగాని, లేక మరొకవ్యక్తి కారాగారమందున్నాడా లేదా యను విషయముపైగాని ఆధారపడి యుండలేవు. సంఘమునందలి శాంతిగాని, ఉద్రేకముగాని ఒకరిద్దరి వ్యక్తిత్వముపై నాధారపడక జాతియందలి అధికసంఖ్యాకుల స్థితిగతులపైననూ, ప్రభుత్వమును గూర్చి వారికిగల భావములపైననూ, వారి మతభావముల ననుసరించి ఏర్పరచుకొను మంచిచెడ్డలపైననూ ఆధారపడియున్నది.

పరిణామశక్తి కేవలము ప్రాపంచిక జీవిత పద్ధతులపై ఆధారపడక ఆధ్యాత్మిక ప్రవృత్తి ననుసరించి యుండును. మొత్తము రష్యాయందలి పదవవంతు జనమును చంపిననూ, పీడించిననూ మిగతాజనుల ఆధ్యాత్మికప్రవృత్తి మీరు కోరువిధముగా ఉండదు. ఇప్పుడు మీరు చేయుచున్న సోదాలు, మీ రహస్యాపరాధశోధనలు, మీ కారాగారములు, మీ నిర్బంధ ప్రవాసమందిరములు, మీ ఉరికంబములు మొదలగున వేవియు జనులను

మీరు కోరుస్థితికి మార్చజాలక పోవుటయేగాక శాంతిస్థాపనకుగల అవకాశములను రూపుమాపుచున్నవి.

అయితే ఏమిచేయవలెను? ఏమిచేయవలెనందురు: ఇప్పుడు జరుపబడుచున్న దుష్కృత్యము నెటుల నిలుపుదల చేయబడవలెను?

ఇందుకు జవాబు బహు సులభము. మీరు చేయుచున్న దుష్కార్యముల చేయుట మానుడు.

ప్రజల శాంతింపజేయుటకు ఏమిచేయవలెనో ఎవ్వరికిని తెలియక పోయిననూ (ఏబది సంవత్సరముల క్రిందట ప్రజలను దాస్యమునుండి రక్షించుట అవసరమాయెను. ఇప్పుడు భూమిని వ్యక్తుల స్వాధీనము నుండి తొలగించుటయే ప్రజాశాంతిని నెలకొల్పుటకు చేయవలసిన పని యని చాలమంది బాగుగా నెరుంగుదురు.) ప్రజల శాంతిపర్చుటకు వారికి ఉద్రేకము పుట్టించునట్టి పనులను చేయకుండుటయే మంచిపద్ధతియనుట స్పష్టము.

మీరు ఏది చేయుచున్నారో అది ప్రజలకొరకు చేయబడుటలేదు. ఏది వాస్తవమునకు వ్యసనకరమై గర్హింపదగినదో దానిని మీరు అనుకూలమయినదని పొరపడుచు, అట్టి యధికారమును నిల్పుకొను నిమిత్తము స్వార్థబుద్ధితో చేయుచున్నారు. కాన మీరు చేయునదెల్ల ప్రజలకొరకు చేయబడుచున్న దనకుడు. అది వాస్తవముకాదు. మీరు పొందు ఆతురత అంతయు మీకొరకే. మీ అత్యాశ, అధికారవాంఛ మొదలగు స్వార్థపరత్వముతో కూడిన మీ ప్రయత్నము లన్నియు మీరు కోరునట్టి వైచ్యస్థితిలోనే మరికొంతకాలము జీవించుటకై చేయబడుచున్నవి.

మీరు చేయుచున్నదంతయు, ప్రజలమేలుకొరకని మీరెంత ఆర్భాటముతో ప్రకటించినను మానవులు మీనిజస్థితిని బాగుగా గ్రహించినారు. మరియు మీరొనర్చు ఆటంకములు అణచిపెట్టుటకు మీరేదృష్టితో చూడ నభిలషింతురో, ఆ దృష్టితో చూడబడుటలేదు. మరియు పైనుంచి ఊడి

పడిన గొప్పదేవతలవలె మిమ్ముల తలంచక మిమ్ముల నిర్లక్ష్య మొనర్చు టయేగాక, ప్రత్యేకస్వార్థపరులగు దుర్మార్గులని మిమ్ములగూర్చి తలంచు చున్నారు.

అయితే, మేముకాదు. విప్లవకారు లిదంతయు మొదలిడిరందురు. మరియు విప్లవకారుల భయంకరకృత్యము లన్నియు, కఠినచర్యతీసు కొనుట (మీరొనర్చు నేరములకు మీరిడిన నామము) మూలముననే అణచవీలగునందురు. విప్లవకారులుచేయు క్రూరకృత్యములు భయంకరము లని మీరందురు ;

నేనుకాదని తగాదాచేయను. కాని, అవి భయంకరములేగాక పుండొకచోటనుండ మందు వేరొకచోట పెట్టినట్లు మీవలెనే వారిపనులును బుద్ధిహీనమైనవియే. అయితే వారొనర్చు పనులెంత భయంకరములైన వైనను ఆబాంబులు, ఆదోపిడులు, ఆ రహస్యకృత్యములు, ఆ ద్రవ్యాప హరణములు, చివరకు ఆ హత్యలు, అన్నియు మీరొనర్చు ఘోరములకు తెలివితక్కువతనమునకు లోకువైనట్టివే.

మీ రేసుద్దేశ్యములకొరకు ఎట్టిపద్ధతుల ననుసరించుచున్నారో అదే పద్ధతిని వారుకూడ అనుసరించుచున్నారు. మీరొక విధానమును సంఘ శ్రేయమునకు లాభకారియని మీ దృష్టితోచూచి, నిర్ణయించి దాని కను గుణ్యముగా మిగతాజనులు అందరు మార్చుకొనవలసి యుండుననియు, అటుల మార్చుకొనునట్లు కోరుటకు మీకు హక్కు, అధికారము కల దనియు భ్రాంతిని చెందుచున్నట్లే—వారును (విప్లవకారులు) అదే భ్రాంతికి లోనైరి. ఉభయుల భ్రమ ఒక్కటే. సాధనమార్గములు—ప్రాణములు తీయుటతోసహా—దౌర్జన్యయుతములు. ప్రజాశ్రేయోభిలాషతో చేయబడినపగుటచే అవినీతికరములుకావని సమర్థింపజూతురు. మనకు దూరదృష్టికలదనియు, మనమే అంతయు తెలిసినవారమనియు ఊహించి మన ఊహలపై ఆధారపడి చేసిన నిర్ణయములు సంఘశ్రేయ మొన

గూర్చునను భ్రాంతికిలోనై నీతికి భంగమురాకుండ అసత్యములాడుట, దొంగిలించుట చివరకు హత్యలు చేయవచ్చును కాబోలు !

ప్రభుత్వాధికారులైన మీరు విప్లవకారుల చర్యలను—దురంతములు—ఘోర నేరము లందురు. అయితే వారుచేసినవి, చేయునవి, మీరు చేసియుండలేనివి—ఎన్నియో రెట్లధికముగా చేయుచున్నవి—వాటికన్న మించినవికావు. మీరు చేయునదే వారునూ చేయుదురు. మీరు గూఢచారుల నియమింతురు, మోసములొనర్తురు, అచ్చొత్తించి అసత్య ప్రకటనలు (గజెటు - జరీదా) చేతురు. వారును ఇదేపద్ధతి నవలంబించుచున్నారు. మీరు అన్నిరకముల దౌర్జన్యపద్ధతులతో ప్రజల ఆస్తులను స్వాధీనపర్చుకొని మీరా ఆస్తులను మీరు తలంచు విధమున నుపయోగింతురు. వారు చేయునదికూడ అంతియే. మీరెవరిని అపాయకరులని తలంతురో అట్టి వారిని ఉరితీయుదురు. వారును అంతే. మీరవలంబించి చేయుచున్న అవినీతికరమైన పద్ధతులనే వారును అనుసరించుచుండ ఇక విప్లవకారులను మీరెటుల నిందించజాలుదురు ? మీకృత్యములకు మీరు సమాధానములిచ్చునట్లే వారును వారి కృత్యములకు సమాధానములు చెప్పుదురు. వారిచేష్టల వలన కలుగజాలనిహాని, మీచేష్టలవలన కలుగుచున్నదని వేరుగా చెప్పవలెనా ! వారికంటె మీరొనర్చు ఘోరములు ఏవనిన: మీరు దేశముయొక్క సంపదను దుర్వినియోగ మొనర్చుట, యుద్ధములకు తయారుచేయుట, విదేశ జాతులను స్వాధీనపర్చుకొని హింసలపాలుచేయుట- ఇట్టివే యితరములు మీరొనర్చుచున్నారు.

దేశ సంరక్షణము మీపెద్దలు చేసినట్లుగా మీరు చేయుచున్నట్లు చెప్పుదురు. విప్లవకారులకుకూడ ఫ్రెంచి విప్లవమునకు పూర్వమునుండియే వచ్చుచున్న సాంప్రదాయములు కలవు. ఇక సత్పురుషులందురో—ఆదర్శముగా తీసుకొనదగినవారు సత్యము, స్వాతంత్ర్యముకొరకు సర్వమును

త్యజించిన ధీరులు—ఎందరో, వారికికూడ కలరు. ఇట్టివారు మీకంటె వారికి తక్కువగాలేరు.

ఇక మీరు ఉభయులమధ్యగల భేదము విచారించుచో ఉన్నది యున్నట్లుండవలెనని మీరందురు. కాదు, మార్పుకావలెనని వారందురు. విచిత్రమై వినాశనకరమగు భ్రమలకులోనై, ఇప్పుడున్నవారికిని రాబోవు సంతతివారికిని సరిపోవు విధానమును ఎవరో ప్రత్యేకవ్యక్తులు కొందరు అందరికిని నిర్ణయించగలమని తలంచుటయు, ప్రజలపై బలవంతముగా అమలుపరచజూచుటయు, సాహసముతోకూడిన పనియైయున్నది. మీ పంథానే వారును (విధానమునందు) అనుసరించియుండనిచో ఎట్లున్నదో ఎల్లకాలమటులనే యుండవలెనను మీ వాదనకంటే మార్పులు కావలెనను వారిమాటలు సహేతుకములని చెప్పకతప్పదు. ఇక మిగతావిషయములలో మీరు ఎటుల చేయుదురో, ఏఏసాధనల నుపయోగింతురో వారును అవే సాధనలతో అటులనే చేయుదురు. పూర్తిగా వారు మీశిష్యులే, 'నీవు నేర్పిన విద్యయే నీరజాక్ష' యన్నట్లు, అక్షరాల మిమ్మనుసరించు చున్నారు. పన్నాగములన్నియు మీవద్ద సంగ్రహించినవే. వారు మీ శిష్యులేకాదు, మీలోనుంచి పుట్టినవారు; మీపిలకలే. మీరే లేనిచో వారుండియుండరు, తన బలముకొద్ది తలుపులనుత్రోయుచో మరల డీకొనునట్లే మీస్థితి యున్నది.

మీ ఉభయులమధ్య భేదమేమైన ఉన్నచో మీకంటే వారే మేలని స్పష్టముగా కాన్పించును. వారి చర్యల సమర్థించగలకారణము లెవ్వనిన: ౧. మీకంటె మిక్కిలిగా వ్యక్తి ప్రాణాపాయమునకు లోనై వారు నేరములు చేయుచున్నారు. ౨. సాహసకార్యములనిన, అపాయముల నెదుర్కొనుటయనిన యువకుని దృష్టి ఆకర్షించును. ౩. వయస్సుమీరిన పెద్దలును సహజముగా ఓర్పువహించవలసిన మీరే, భ్రమలకు లోనైన యువకులయందు కనికరము చూపవలసిన మీరే ఘోరకార్యము లొనర్చుచుండ

సాహసకార్యములనిన, అపాయముల నెదుర్కొనుటయనిన ఉత్సాహము పుట్టించు వయస్సునందుండుటచే యువకులు పెదవారుల త్రొక్కుట సహజము. వారి చర్యల సమర్థించగల మరొక్క విషయమేమన, వారొనర్చు హత్యలు ఎంత గర్హింపదగినవైననూ వారి హత్యలు—ఎంతో నిర్లక్ష్యముగా క్రమపద్ధతిని ప్రవాసములయందుంచుట. యావజ్జీవ శిక్షలు, వురికంబములకెక్కించుట, నిలువున కాల్చిచంపుట మొదలగు మీచర్యలంత క్రూరములైనవికావు. ౪. వారూహించు మేలును ప్రజలందరికి ఒనగూర్చు నిమిత్తము సాధన లెట్టివైననూ సాధించుటే ప్రధానవిషయమను విశ్వాసముతో మతనియమములను పూర్తిగా త్రోసివేసి ఒకరినిగాని, అనేకమందినిగాని వారు చంపుదురు. ఇక ప్రభుత్వాధికారము వహించిన మీరో—క్రింది వురితీయువానితో మొదలిడి అత్యున్నతాధికారివరకు గల మీరందరు మీరొనర్చు—అకార్యముల కెట్టి సంబంధములేని మతరక్షణ పేర చేయుచుందురు.

మరియు మీరు వయస్సున పెద్దలైన మీరు—ఇతరులకు నాయకులైన మీరు—మతవిశ్వాసములు కల మీరు—పసిపిల్లలవలె పోట్లాడుచూ చెప్పు సమాధానము, "మేము ప్రారంభించలేదు వారే మొదలిడిరి" అనియేనా ? ప్రభువులమని చెప్పుకొను మీరు చెప్పగల సారాంశమిదియే కదా !! అయితే మీరేమతమునకు చెందినవారు ? సోదరమానవునిపై తీర్పు చెప్పుటగాని శిక్షించుటగాని, చివరకు నింద మోపుటగాని నిషేధించిన వానిని దేవునిగా విశ్వసించువారలేనా ?

ఎవ్వడు అసందిగ్ధముగా శిక్షించుటకేగాక క్షమించుటే కర్తవ్యముగా నిర్ణయించెనో, ఎవ్వడు, ఒకడు ఒక చెంపకొట్టిన తన రెండవ చెంప చూపవలసినదనియు ప్రతిక్రియ చేయకూడదనియు ఆజ్ఞాపించెనో, రాళ్ళు రువ్వి చంపబడవలసినట్లు శిక్షింపబడిన స్త్రీ కథలో మానవునిపై మానవునికి తీర్పుచెప్పు అధికారము లేనేలేదని స్పష్టముగా నిర్ణయించెనో

అట్టి బోధకుని భగవంతునిగా విశ్వసించు మీరు, "వారు ప్రారంభించిరి. వారు చంపెరి, కాన మేమును వారిని చంపుదుము." అనుటకన్న మంచి కారణములు లేవా ?

నాకు పరిచయముగల చిత్రకారుడొకడు 'ఉరి' అను చిత్రమును చిత్రించదలచెను. ఉరితీయువాని నమూనా అతనికి కావలసియుండెను. మాస్కో పట్టణమునందు ఆ కాలములో ఆ ఉరితీయుపనిని ఒక కాపలావాడు చేయుచున్నట్లు తెలిసికొనెను. ఆ చిత్రకారుడు ఆ కాపలావానియింటికి వెళ్లెను. ఆరోజు ఒక పండుగదినమైయుండెను. ఆ కుటుంబమువారు క్రొత్తదుస్తులను ధరించి పానీయపుబల్లచుందర కూర్చొనియుండిరి. ఆయింటి యజమాని మాత్రము అచ్చట లేకుండెను. ఇంటిలోనికి వచ్చుచున్న ఆగంతుకునిగాంచి యింటియజమాని దాగినట్లు తరువాత తెలసెను. అతని భార్యకూడ కలవరపడినట్లు కాన్పించెను. తనభర్త యింటలేడనెను. కాని అతని చిన్నపిల్ల నాన్న మిద్దెపై నున్నాడని రహస్యమును బయలు పెట్టెను. తనతండ్రి చెడుపనిచేయుచున్నట్లు పాపమా చంటిపిల్ల తలచియుండలేదు. అందువలన పరులను చూచుటకు భయపడునని పాపమాపిల్ల ఎరుగదు. ఆ చిత్రకారుడు తానొక చిత్రము చిత్రించ దలచితిననియు ఆ చిత్రమునకు ఆమెభర్తయొక్క చిహ్నములు తగియుండుటచే చూడ వచ్చితిననియు (యథార్థమును కప్పిపుచ్చి) ఆ యింటి యజమానురాలుకు చెప్పెను. ఆమెతో కొంత సంభాషణ జరిపి ఆమెను సమాధానపర్చు నిమిత్తము, ఆమె పిల్లవానిని తనవద్ద శిష్యునిగా చేసుకొని పనినేర్పుదునని సూచించెను. ఈ వాగ్దానమామెను ఆకర్షింపజాలెను. లోనికివెళ్లి కొద్దిసేపటికి భర్తను పంపెను. అతను కోరచూపులతో చిరచిరలాడుచూ, వ్యాకులతతో భయకంపితుడుగా ఉన్నట్లు కాన్పించెను. ఆ చిత్రకారుడు తన్నెందుకు పిల్చెనో, తనవలన అతని కేమిపని యున్నదోయని ఆందోళన చెందుచుండెను. అతనిని వీధిలోచూచితిననియు, తాను చిత్రించదలచిన

చిత్రమునకు ఈతని ముఖచిహ్నములు తగియుండెననియు ఆచిత్రకారుడు చెప్పెను. ఆమాటలను విన్నంతనే ఆ కాపలావాడు, చిత్రకారుడు తన్నెక్కడకలిసెనో ఏ సమయమునందో, ఏ దుస్తులలోనుండగనో యని ఆతురతను పొందెను. పాప మాతడు తనకేమి యపకారము జరుగునో యని భయముతో రాజీ కొప్పలేదు.

అవును ! ఈ ఉరితీయువాడు తానొక ఉరితీయువాడననియు, తాను తప్పుచేయుచున్నాననియు, అందుచే యితరులు తన్ను నిరసింతురనియు వానికి తెలియును. ఆతడు మనుష్యులను చూచుటకు సిగ్గు, బిడియములు పొందుచుండెను.

ఈ అంతరాత్మ ప్రేరితజ్ఞానము, ఈమనుష్యులయెదుట కనబర్చు భయము కనీసము కొంతలోకొంత పాపపరిహారము కాగలదని నాతలంపు. అయితే ఆపనికి బాధ్యులైన మీరో ! ప్రధానమంత్రి, రాజుతోసహా మీరందరు ప్రతిరోజు జరుపుచుండు ఘోరములను తప్పిదముగా తలంచుటయే లేదు. ఈ భయంకర కృత్యములవలన పుట్టవలసిన సిగ్గు, బిడియములుకూడ మీలోనున్నట్లు కాన్పించవు. అయితే ఆ ఉరితీయువానివలె మీరును భయముకలిగి యున్నారు. మీరొనర్చు నేరముల బాధ్యత పెరుగుచున్నట్లే మీ భయముకూడ పెరుగుచుండుననుట నిస్సందేహము. కార్యదర్శికి మించిన భయము ప్రభుత్వ న్యాయవాదికి. ప్రభుత్వన్యాయవాదికన్న తీర్పు చెప్పెడి న్యాయాధికారికి ఈ న్యాయాధికారికన్న రాష్ట్రాధిపతికి. రాష్ట్రాధిపతికి మించినభయము కార్యనిర్వాహకాధ్యక్షునికి. అందరికిమించిన భయము. చక్రవర్తికి ఈ ప్రకారము అందరును భయకంపితులగుచున్నారు. అయితే ప్రభుత్వమువారికిగల భయమునకును, ఆ వురితీయువాని భయమునకును సంబంధములేదు. కారణమేమన మీరు తప్పిదములొనర్చితిమని భయపడుటకు మారుగా ఇతరులు మీ తప్పిదములకు ఎక్కడ హానిచేయుదురో యని భయపడుచున్నారు.

కాన ఘోరనేరములకు, మూలపురుషులైనట్టియు, మిమ్ముల మీరు నిందించుకొనుటకు బదులుగా యితరుల నిందించునట్టియు, యిన్నిచేసియు తలలెత్తుక తిరుగు మీకన్న సామాన్యమానవుడుగా తలంచబడు ఆ దుర దృష్టపు కావలివాడు ఎన్నియోరెట్లు మేలని నా నమ్మకము.

మానవమాత్రులమగు మనము నిగ్రహములేనివారము. మనమెన్నియో ప్రమాదములకు లోనగుచుందుము. ఒకరి నొకరు విమర్శించుకొను స్థితిలో లేమనియును నాకు తెలియును. భరింపరాని ఈ ఘోరనేరములకు బాధ్యు లగువారును వారొనర్చునేరములు పెరుగుచున్న ప్రెల్ల సంఘములో వారు పొందుచున్న మిథ్యాగౌరవమును చూచుచూ నాలోపుట్టి రేకెత్తుచున్న నాభావములను అణచుకొనుట కెంత ప్రయత్నించినను అణచజాలకున్నాను. ఇక నాభావములను నిరోధించ ప్రయత్నించను.

ఏలయన వారి చర్యలలోని అపరాధిత్వమును గ్రహించజాలక పోవుట. ఇట్టిచర్యల చేయువారు నిరసింపబడుటకు మారుగా గౌరవము పొందుచుండుట, తాముకూడ పైవారి ననుసరించి వారితోపాటు గౌరవ మర్యాదలు పొందవలెనని యితరులుకూడా వారి ననుసరించుటవలన వారొనర్చు చర్యలలోని అపరాధిత్వమును బహిరంగపర్చుట మూలముగా వారిందరు తమనిజస్థితిని గ్రహించునట్లుచేయుట నావిధిగా తలంచుచున్నం దున ఇక నా భావముల నణచజాలను.

ఇక నెంతమాత్రము నా భావములను ప్రకటించకుండ నుండ జాలను! వీనిని బహిరంగపర్చుటచే, వీరితో నాకుగల సంబంధమును, ఈ నేరములలో నాకుకూడ కొంతబాధ్యత యుండవచ్చునను నా భావమును, తొలగగలవు.

ఇప్పుడు ఏష్యాలో జరుపబడుచున్నదంతయు ప్రజాక్షేమమను పేరను, శాంతిభద్రతల నిమిత్తమనియును చేయబడుచున్నవి. ఈ మాటయే

వాస్తవమగుచో, రష్యాయందు జరుగుచున్నదంతయు రష్యాలో నివసించుచున్న నా కొరకు కూడా జరుగుచున్నట్లే కదా!

మానవుని స్వభావసిద్ధమైన, ప్రాధాన్యమైన తానుపుట్టిన భూమిపై తాను స్వేచ్ఛగా జీవించుహక్కును తొలగించి, చేయపడుచున్న హింస నాకొరకా! మానవులలోని కొందరి గ్రామజీవనమును నాశనమొనర్చి, ఏకరూపవేషముల (Uniforms) ధరింపజేసి, మారణకృత్యము లొనర్చుటకు శిక్షణ యివ్వబడిన అయిదులక్షల సైనికులు నాకొరకా!! నిజక్రైస్తవ ధర్మములకప్పిపుచ్చి, పెడమార్గము లవలంబించుచున్న ఆమోసపు పీఠాధిపతులు నాకొరకా!! ఒక స్థలమునుంచి మరొకస్థలమునకు పంపు ప్రవాసశిక్షలన్నియు నాకొరకా!! లక్షలకొలది జనులు చాలీచాలని జైళ్ళలో, విషజ్వరములతో బాధపడు ఆ దురదృష్టవంతులందరు నాకొరకా!! దేశములనుండి వెడలగొట్టబడినట్టియు, జైళ్ళలో మ్రగ్గుచున్నట్టియు, ఉరికంబము లెక్కించబడుచున్నట్టియు వారల భార్యల, తండ్రుల, ఆర్తనాదములన్నియు నాకొరకా!! ఈ లంచగొండితనము, ఈ గూఢచారవర్గము నాకొరకా!! వందలకొలది జనులు అజ్ఞాతవాసములో మూసియుంచబడుట, కాల్చివేయుట నాకొరకా!! ఈ ఘోరకృత్యము లొనర్చుటకు ఉరితీయువారు దొరుకుటయే దుర్లభముగానుండి, యిప్పుడు సులభముగా లభించుచున్న ఈ అసహ్యకృత్యము లొనర్చువారందరు నాకొరకా!! వారు స్త్రీలను, శిశువులను, చంపుటకై పదునుచేయబడిన త్రాళ్ళతో కూడిన ఆ ఉరికంబము లన్నియు నాకొరకా!! మానవునిపై మానవుని భయంకర క్రౌర్యమంతయు నాకొరకా!!

ఏమిచిత్రము! పైన వివరింపబడినదంతయు నాకొరకు జరుపబడుచున్నది. మరియు ఈభయంకర కృత్యములలో నేను భాగస్వామినట!!

నా ఈవిశాలమైనగది, నా భోజనశాల, నాధరించు వస్త్రములు, నావిశ్రాంతి; వాటికిని నాకును మధ్య నిస్సందేహముగా ఏదో పేచి

యున్నట్లు, నేనుపయోగించు వాటిని నావద్దనుండి తీసుకొనదలచినవారిని ఆటంకపర్చు నిమిత్తము ఈ భయంకర కృత్యములన్నియు జరుపబడు చున్నట్లు నేనూహించవలసియుండునుకదా !

ఈ విషయ మింత స్పష్టముగా కాన్పించుచుండ ఇక నేనెంత మాత్రము సహించజాలను.

ఇట్టి జీవితము గడపుటిక దుర్లభము. ఏమైనగాని ఈ ప్రకారం జీవించలేను. జీవించుట దుస్సాధ్యము.

నేను, దీనిని వ్రాయుచున్నది ఇందువలననే. నేను నాశక్తికొలది ఒక్క రష్యాయందేగాక, ప్రపంచమంతటను, విరివిగా ప్రచార మొన ర్తును. రెండేమార్గములు కలవు. రెంటిలో ఒకటి జరిగితీరవలెను. ఈ అమానుషచర్యలు ఆగనైన ఆగవలెను. లేదా ఎవరికొరకని చేయబడు చున్నవో, ఆ ప్రజలనుంచి నన్ను వేరుచేసి, ఈ దురంతములు నాకొరకు జరుపబడుటలేదను ఆత్మసంతుష్టిని నేను పొందగల్గునట్లు నన్ను జైలులో నుంచుడు. కానిచో, నేను దేనివలన కలలోనైన పొందజాలని సుఖమనుభ వించజాలుదునో, ఆ పంద్రెండుమందికో, యిరువదిమందికో మెడలకు తగిలించిన త్రాళ్ళవంటి యొక త్రాడును నామెడకు తగిలించి, నాతలను సంచితోకప్పి, నాముదిగొంతుకు తగిలించబడిన త్రాడు నా శరీరభారముచే బిగిసి నేను చచ్చునట్లు ఉరితీయుటో జరిగితీరవలెను.

ఈ రెంటిలో (దురంతము లాపుటో లేక నన్ను ఉరి తీయుటో) ఒక లక్ష్యమును సాధించుకొరకు, ఈ ఘోరదురంతములతో సంబంధము గల్గి తోడి సోదరమానవులకు, స్త్రీలకు, బాలురకు మెడకు ఉరి, నెత్తికి సంచి తగిలించు ఆ ఉరిదీయువాని మొదలుకొని కారాగారాధిపతితోసహా అధికారులందరిని ఉద్దేశించి నేను చెప్పుచున్నాను.

ఓ సోదరమానవులారా ! వివేకము గనుడు. ఆగుడు. యోచించుడు. మీరేమిచేయుచున్నారో తెలుసుకొనుడు. మీరెవరో జ్ఞాపకముచేసుకొనుడు.

మీరు, ఉరితీయువారు, సైన్యాధిపతులు, ప్రభుత్వ న్యాయవాదులు, న్యాయాధీశులు, ప్రధానమంత్రి, చివరకు జారుచక్రవర్తి- మీరందరు మనుష్యులుకారా ? ఈరోజు యింటిలో రేపు, మంటిలో! ప్రత్యేకముగా ద్వేషము పుట్టించినట్టియు, పుట్టించుచున్నట్టియు, పలురకముల హంతకులగు మీరు దీనిని తెలుసుకొనుడు. దేవుని రాజ్యమగు ఈ లోకములో క్షణకాల జీవితము (ఈ కొద్ది వ్యవధిలో మీరు చంపబడకపోయిననూ) గడుప వచ్చిన మనల మృత్యువు వెంటాడుచున్నది. అట్టి మనసు పరుల పీడించుటలు, చంపుటలు జీవిత వ్యాపారములగుట సాధ్యమా ? ఎక్కడ చంపబడుదుమో యని భయకంపితులగు మీరు, మీకు, మీ యిరుగుపొరుగు వారికి, చివరకు భగవంతునికి ద్రోహ మొనర్చినవారగుచున్నారు. ఈ పనుల్నొనర్చుటద్వారా కోట్లకొలది ప్రజాక్షేమమునకై మహత్తర కార్యముల సాధించినట్లు మీరు సంతృప్తినిపొంది, ఇతరులను సంతృప్తి పర్చగల్గుదుమనుట సాధ్యమా ? ముఖస్తుతులు, పరిపాటియైన కుతర్కములు మిమ్ముల మత్తుల చేయకమునుపే యివన్నియు ఉత్తమాటలనియు, మీరొనర్చు ఘోరకృత్యముల కప్పిపుచ్చుటకు చెప్పు సాకులనియు మీలో ప్రతి ఒక్కరికిని తెలియదా ? ఇంకనుమంచి మనుష్యులమేయని మీరు తలంచగలరా ? మనలో ప్రతిఒక్కనివలె మీరుకూడ మనలందరిని బద్ధుల చేయగలవాడొక డున్నాడనియు, ఈలోకమున ప్రవేశించుటకు, యిందుండుటకు, ఈలోకము వదిలివెళ్లుటకు అతనియిచ్ఛ చొప్పుననే జరుగుచుండుననియు, ఈ క్షణకాలజీవితము కూడ అతని యిచ్ఛయే కారణమనియు మీరు తెలుసుకొనకుండ నుండజాలరు. అతడు మనల కోరిన దొక్కటియే. అది మానవుల పరస్పరప్రేమ.

అయితే మీరుచేయుచున్నదేమి ? మీ ఆత్మశక్తిని దేనికొరకు వినియోగ పరుచుచున్నారు ? మీరెవ్వరిని ప్రేమింతురు ? మిమ్ముల ప్రేమించువారెవరు ? మీ భార్యా ! మీ బిడ్డయా ! ! అయితే అది ప్రేమ యనిపించు

కొనదు. ఆలుబిడ్డలయొక్క ప్రేమ మానవప్రేమయా? అంతకన్న గాఢముగా పశువులుకూడ ప్రేమించును. మానవుని మానవుడు ప్రేమించుట మానవప్రేమ. ప్రతిమానవుడు భగవంతుని బిడ్డడనియు, తద్వారా మన మందరము సోదరులమనియు భావము కలిగియుండుట మానవప్రేమకు చిహ్నము. పై విధమున మీరెవ్వరిని ప్రేమింతురు? ఒక్కరిని ప్రేమించరు.

అడవిమృగముల చూచి భయపడునట్లు మిమ్ముల చూచి ఉరితీయువానిగా తలచి భయపడుదురు. లోలోన మిమ్ముల చూచి యసహ్యించుకొనుచున్నను, నిరసించుచున్నను జనులు మిమ్ముల స్తుతింతురు. వారి నిరసన మెట్టిదో మీకును తెలియును; అందుచే మీరు భయపడుచున్నారు.

ఇక యోచించుడు. మీలో ప్రతి ఒక్కరును—రాజు మొదలు ఎట్టిచేయువానివరకు—హత్య లొనర్చుటయందు ప్రీతికలవారు. మీరెవ్వరో తెలుసుకొని మీరొనర్చుచున్న పనులు మానుడు! మానుడు! మీకొరకు గాదు, మీ గొప్పతనముకొరకైగాదు, మానవులకొరకుకూడ కాదు, మీ రపనిందలపాలు గాకుండుటకు గాదు. అయితే మీ ఆత్మకొరకు. మీలో నున్న ఆ దేవునికొరకైననూ ఈ ఘోరములు మానుడు.





# రెండవ ప్రకరణము

## దేశభక్తి - ప్రభుత్వము

ఒకనిని దేశభక్తుడనుట సహింపజాలనంత అవమానమొనర్చినట్లు తలచబడుకాలము త్వరలో రానున్నది. దేశభక్తియనగ మనము పుట్టినదేశపు ఆధిక్యతను పొగడుచు, స్వార్థము నిమిత్తము పరుల కొల్లగొట్టుట యని యర్థము.

ఈమనరోజులలో దేశభక్తియన అస్వాభావికము, జ్ఞానహీనము, హానికరమైనదిగా పరిణమించినదనియు, మానవజాతియొక్క దుస్థితికి మూలకారణము దేశభక్తియేయనియు నేనింతకుముందే చాలాసార్లు తెలిపియుంటిని. కాన ఇప్పుడు జరుగుచున్నపద్ధతిని దేశభక్తినిగూర్చిన ప్రచారము ఇకముందు జరుగకుండునట్లు, పరోపకారబుద్ధిగలవారు సాధ్యమైన అన్నిసాధనలతోడను నిరోధించుటయేగాక నిర్మూలించవలెను. మరొక చిత్రమేమన: ఆయుధములు తయారుచేయబడుటకును, యుద్ధములు జరుగుటకును ఈదేశభక్తియే మూలమనుట కెట్టి సందేహములేదు. సర్వనాశనమే దేశభక్తివలన రానున్న ఫలితము. వెనుకకే పోవుచుంటిమనియు, దేశభక్తిమూలమున పొందదగిన అరాజకము, హాని, ఇదివరకే చాలా పొందితిమనియు, ఇంకనూ పొందుదుమనియు, నేను చేయువాదన సారాంశము. అయితే, చెడ్డ దేశభక్తిమాత్రమే హానికరమైనదనియు, నైతికాభివృద్ధికి తోడ్పడు దేశభక్తి మంచిదనియు, అట్టిదానిని ఖండించుట అనాలోచితపు పనియనియు కొందరనవచ్చును.

అయితే ఉన్నతభావ ప్రేరితమైన దేశభక్తియనగ ఎట్టిదో మనకింత వరకు ఎవరును చెప్పియుండలేదు. లేక, ఎవరైన చెప్పినను అర్థశూన్య

పదసమూహమై గంభీర సహాసములతో కూడియుండెను. మన మను కొనుచున్న దేశభక్తికి సామ్యమేయుండక, మనకు నేడు సంప్రాప్తమైన కష్టములకు కారణమైన దేశభక్తిని గూర్చిన సరియగు నిర్వచనము చేయ బడుటలేదు.

సాధారణముగా నిజమగు దేశభక్తి ఇతరజాతుల సౌఖ్యమును భంగమొనర్చునదిగాక, తమ ప్రజలకు సౌఖ్యమొనగూర్చునదిగా ఉండ వలెను.

ప్రస్తుత యుద్ధము (౧౮౯౯-౧౯౦౨ లో దక్షిణాఫ్రికాయుద్ధము జరుగుచుండెను.) గూర్చి ఒక యాంగ్లేయ మిత్రునితో మాట్లాడుచు. ఆంగ్లేయులను యుద్ధమునకు ప్రేరేపించిన కారణము అత్యాశకాదనియు, వారూహించు దేశభక్తియనియు నేనంటిని. ఇంగ్లీషు సంఘముయొక్క మనస్తత్వమునుబట్టి యిది వ్యక్తమగుచున్నదంటిని. ఆ ఆంగ్లేయమిత్రుడు నాతో నేకీభవించలేదు. మీరనునదియే నిజమగుచో వారిని యుద్ధమునకు ప్రేరేపించిన దేశభక్తి చెడ్డదని తెలుననెను. తనవలె నిజమైన దేశభక్తి కలవారు యిట్టి యుద్ధములకు దిగరనుభావము వానిమాటలయందు కాన్పించుచున్నది.

'అయితే నీవు ఇంగ్లీషుజాతివారిని మాత్రమే. సవ్యమయిన పద్ధతిని ఆచరించకోరుదువా ?' యని యడిగితిని. మానవులందరు ఉత్తమపద్ధతిని ఆచరింపకోరెదనని అత డనెను.

దీనివలన, న్యాయమగుహక్కులు నీతికి సంబంధించినవిగానీ. ప్రకృతికి సంబంధించినవిగానీ ప్రజలందరికి వర్తించవలెనని స్పష్టమగు చున్నది. అయితే నేడు మన ఎదుట జరుగుచున్నది దేశభక్తికిగాక యిందుకు భిన్నముగానున్నది.

దీనిని సమర్థింపచూచువారలు దీనిని దేశభక్తి యనవచ్చును. కాని ప్రతిజాతి తమకొక ప్రత్యేకాధిక్యత కలదని దానిని సమర్థింపచూచుట

దేశభక్తి కాజాలదు. ప్రతిజాతి తనయొక్క ప్రత్యేకతను నిల్పుకొన ప్రయత్నించుట మానవసంఘాభివృద్ధికి ప్రధానవిషయమందురు. దేశభక్తి పేర, ఈ ప్రత్యేకాధిక్యతను సమర్థించుచూ చేయుచర్యలు అవసరమని తలంతురు. అదెంతమాత్రము వాస్తవము కాజాలదు. ఒకానొకకాలమునందు మానవాభివృద్ధికి ఆచారములు, మతములు, భాషలు అవసరముండియుండవచ్చునుగాని సర్వమానవసోదరత్వమును స్థాపింపజూచుచున్న ఈకాలమునందు ఈ ప్రత్యేకాధిక్యతలు హానికరములుగా పరిణమించగలవు. కాన ప్రత్యేకాధిక్యతగలదని భావించుట, దానిని పోషింపజూచుట మానవసంఘ ఐక్యతకు తోడ్పడుటకు మారుగా మానవులమధ్య చీలికను కలిగించి సఖ్యతను చెఱచును.

మానవజాతిని భ్రాంతికి లోనొనర్చినట్టియు, అపార కష్టనష్టములకు కారణభూతమైనట్టియు మనమందరము చూచుచున్న దేశభక్తి మానవుని ఆధ్యాత్మికోన్నతి కుపకరించునదికాదు. మరియు ఆధ్యాత్మికోన్నతి, ప్రత్యేకజాతులకు ప్రత్యేకముగా అభివృద్ధిచేయుటకు సాధ్యమగునదికాదు. ప్రతివ్యక్తి ప్రతిరాజ్యము రెండవవ్యక్తి, రాజ్యముకన్న అధికులమని తలంచుట దానిని నిలబెట్టుకొనుటకు ప్రయత్నించుట, ఇతరులను నష్టముల పాలొనర్చుట మూలముననే సాధ్యమగును. ఇది స్వార్థమేగాని దేశభక్తి కాజాలదు.

సారాంశమేమన దేశభక్తియను తలంపులు చెడ్డవి. హానికరమైనవి. ఈ సిద్ధాంతము బుద్ధిహీనమయినది. ప్రతి ఒకడు, ప్రతి ఒక రాజ్యము తమలోరాము యితరులకన్న మంచివారల మనుకొనుట కేవలము భ్రాంతియేగాక హానికరమనుట స్పష్టము.

దేశభక్తివలె కాన్పించుచున్న యిది ఎంతటి హానికరమో ప్రతివారికిని తెలియగలదు. కాని చిత్రమేమన విద్యావంతులు, మేధావంతులు నగువారు ఇందలి బుద్ధిహీనతను గ్రహింపకపోవుటయేగాక ఈ రహ-

స్యము బహిర్గతము కాకుండుటకు తీవ్రమగు మూర్ఖపు పట్టుదల, ప్రయత్నములు సల్పుచూ దేశభక్తి గొప్పదనియు, ఉపయోగకరమైనదనియు చాటుచుందురు.

దీనిభావమేమి? ఆశ్చర్యకరమగు ఈ సమస్యనుగూర్చి నాకొక ఊహ పొడముచున్నది. సృష్ట్యారంభమునుండి నేటి వరకును మానవ చరిత్రను విమర్శించిచూచిన వ్యక్తులు, సజాతివర్గములు తాముండిన స్థితి నుండి ఉన్నత స్థితిని పొందగోరి తదనుగుణముగా ప్రయత్నించుచున్నట్లు కాన్పించును.

ప్రతివ్యక్తి, ప్రతి సజాతీయ వర్గమును, అభివృద్ధియను సౌధమున కొన్ని మెట్లెక్కి తమ మొదటి పశుప్రాయస్థితినుండి ప్రస్తుత నాగరక స్థితికి వచ్చినట్లు చరిత్రలవలన తెలియును.

ప్రతివ్యక్తి, ప్రతిసంఘము నూతన భావప్రేరితమై తదనుగుణముగా ప్రయత్నించుటయు, ఇట్టి ప్రయత్నములలో కొందరు ముందుకు సాగిపోవుట, మరికొందరు వెనుకబడుట, హెచ్చుమంది యిటునటు గాక మధ్యమార్గమందుండుటయు తటస్థించుయుండెనుగాని ప్రతివారును తమ స్థానమునుండి క్రమక్రమముగా మార్పులు పొందుతూ ముందుకే సాగుచుండిరి. ఈ ప్రకారము మూడువర్గములుగా విభజింపబడి, భిన్న భిన్నస్థానములయందు భిన్నభిన్న ఆదర్శములు, అభిరుచులతో ఉండినట్లు తోచుచున్నది.

ప్రత్యేక వ్యక్తులు, సంఘములు సన్నగిలి వింతగా కాన్పించు వెనుకటి ఆచారవ్యవహారములు మాని, అభివృద్ధికరములని తలంచుచు నూతనమార్గము లవలంబించుచుండిరి. ఉదాహరణముగా పూర్వకాలపు దోపిడులు, పరస్త్రీలను యెత్తుకొని పోవుటవంటి విపరీతము లిప్పుడు లేవు. పాతపద్ధతులు తిరిగిరావు.

నూతనాభిప్రాయములు మానవులయందు విద్య, అనుభవములు, తదనుగుణ ప్రవర్తనల మూలమున చొప్పింపబడుచున్నవి. నియమిత కాలములో క్రొత్త పద్ధతులను ఆచరణయందుంచునట్లు అధికారబలముచే నిర్బంధింతురు. మన కాలములో ఆస్తులను గూర్చియు, రాజ్యవ్యవస్థ, వ్యాపారము, పశుసంతతి వృద్ధిచేయుటనుగూర్చియు యోచింపబడుచున్నది. రానున్న మార్పులను గూర్చిన యోచనలు అప్పుడే ప్రారంభమై, కార్య రూపము దాల్చనున్నవి. జనులు తమ పూర్వాచారములు వదలజాలక ఒక చెంప వాటికొరకై పెనుగులాడుచూ రానున్న మార్పుల కనుగుణముగా తమ నిత్యజీవనమందు సమన్వయము చేయ ప్రయత్నించుచున్నారు. మరియు కొందరు కార్మిక స్వాతంత్ర్యము, స్త్రీ స్వాతంత్ర్యము, మాంసాహార నిషేధము మొదలగువాటిని గూర్చి యోచించుచుండ, మరొక అడుగు ముందిడి, కొందరు దౌర్జన్యపద్ధతుల మానవలయుననియు, సాంఘిక పద్ధతులపై ఆస్తుల విభజన జరుగవలెననియు, మతసమ్మేళనము, తద్వారా సర్వమానవసోదరత్వమును స్థాపించవలెననియు యోచనలు చేయుచున్నారు.

కాన ప్రతివ్యక్తి, ప్రతిసంఘము వారే స్థితియందున్ననూ ప్రాతపద్ధతులను ప్రక్కకుత్రోసి రాబోవు సంస్కరణముల గూర్చి యోచించుచుందురు. ఈ ప్రకారము ప్రాత కొత్త పద్ధతులకు మధ్య మానవులు నిరంతర సంఘర్షణ సల్పుచున్నారు. ఒక ఆదర్శమును ఆచరణయందుంచుటకు పోరాడి, పోరాడి అమలుకు తేగల్గినంతలో మరొక నూతనాదర్శము దృష్టిగోచరమగును. అంతవరకును అది ఊహాప్రపంచము నందే సంచారము చేయుచుండును. ఇక ఆ ఆశయసాధనకు తిరిగి ప్రయత్నము ప్రారంభమగును. మానవ సంఘమునందు పలుకుబడి సంపాదించ గలిగినవారు కొందరుందురు. వారలు పూర్వాచారములే తమకు లాభకరములని తలంచి వాటినే అమలునందుంచుటకు విశ్వప్రయత్నము లొనర్తురు.

ప్రత్యక్షజీవనమున కవి ఎంత విపరీతముగా కాన్పించినను ఆ ప్రాత ఆచారములే అమలునందుంచ కోరుదురు. పీఠాధిపతుల చూడుడు: ఆ పీఠ మునకు సంబంధించిన మతాదర్శములద్వారా ఆ మతపీఠములకు అధికారు లైరి. ఆ ఆదర్శములు మారిన ఆ అధికారముకూడ పోవునను దురుద్దేశ ముతో పాత ఆదర్శములే మంచివని బోధించుచూ అధికార పురస్సర ముగా నిర్బంధించి అమలు జరుప ప్రయత్నించుచుందురు. ఇట్టి చిత్రము లెన్నియో పూర్వము జరిగినవి, ఈనాడును జరుగుచున్నవి.

రాజకీయములయందుకూడ యిదే పద్ధతి అవలంబింపబడుచూ వచ్చినది. దేశభక్తిపేర ప్రజలను నిరంకుశాధికారముతో లోబర్చుకొం దురు. ఏ రాజకీయ విధానము వారి నా స్థానమును నాక్రమించుటకు తోడ్ప డెనో వారా స్థానమునందే స్థిరముగా నుండు నిమిత్తము ఆ పాతవిధాన ములే శ్రేష్ఠములని చెప్పుచూ, అధికారముద్వారా అమలు చేయజూతురు. తద్ద్వారా తమ స్వార్థమును నిల్పుకొనుచున్నారు.

దేశభక్తిపేర జరుగుచున్న దురంతములకును, నూతనాశయము లను పేర జరుగుచున్న ఆందోళనకును మధ్యసంఘర్షణ జరుగుచున్నదని నాకు స్పష్టముగా తోచుచున్నది.

తమ ప్రజలపైమాత్రమే గల ప్రత్యేక ప్రేమచే తమ ప్రజలను శత్రువుల దాడినుండి రక్షించుటకు తమ శక్తిని, ధనమును చివరకు ప్రాణమునైనను నర్పించి ఇతరజాతులను, రాజ్యములను అమానుష కృత్య ములద్వారా సర్వనాశన మొనర్చుటయే దేశభక్తితో కూడిన అత్యుత్తమ కార్యమనియు, నాగరకతా లక్షణమనియు భావించబడుచున్నది.

అయితే ౨౦౦ సంవత్సరములక్రిందటనే మానవులు అత్యున్నత భావప్రేరితులై సర్వమానవ సోదరత్వము అన్నిటికన్న ఉత్కృష్టమైనదని నిర్ణయించిరి. ఈ మానవుల మధ్య సోదరభావము క్రమముగా వృద్ధినం దుచూ ఈనాటి యానసౌకర్యములద్వారా, వ్యాపారములద్వారా, శిల్పప్రకృతి

శాస్త్రములద్వారా మానవసంఘమునందు సోదరభావము త్వరితగతిని వ్యాపించి, పరస్పర సహకారబుద్ధిని అలవరచుకొనుచున్నారు. వీటిమూలమున ప్రజలు తమ యిరుగుపొరుగువారు జయింతురనిగాని, దోచుకొందురనిగాని, చిత్రవధలపాలు జేతురనిగాని భయములేక సుఖముగా జీవించుచుండిరి. ప్రజలు (ప్రభుత్వములు యిందు జేరరావు) పరస్పర సహకారముతో వ్యాపారములు, లలితకళలు, ప్రకృతిశాస్త్రములు నేర్చుకొనుచూ ఒకరిపై నొకరు ద్వేషము చెందకుండిరి. ఈ పరస్పర స్నేహము క్రమక్రమముగా, వృద్ధిచెందినకొలది సర్వమానవ సోదరభావముల కెట్టి సంబంధముగాని, అవసరముగాని లేనట్టి దేశభక్తి యను భావము సన్నగిలి, క్రమక్రమముగా మానవుల మధ్యనుండి అంతర్ధాన మయ్యెడిదే. కాని యిందుకు భిన్నముగా జరిగినది. హానికరమైనట్టియు, ప్రాతపడినట్టియు, దేశభక్తియను భావము యింకనూ నిల్చియుండుటేగాక భయంకర స్వరూపముతో మానవుల ఎదుట తాండవమాడుచున్నది.

ప్రజలు తమ కెట్టి లాభము లేకపోయినను ప్రభుత్వములు ఇతర జాతులపై అత్యాచారము లొనర్చి, వారి ఆస్తులను దోచుకొనుచుండ, అటుల దోచుకొనిన ఆస్తులను నిల్పుకొను నిమిత్తము స్వరక్షణయనుపేర చేయు ఘోరములను హర్షించి సానుభూతి చూపుచున్నారు. అంతియేగాదు, గర్వించుచున్నారు. పెద్ద పెద్ద రాజ్యములవారు చేయు ఈ ఘోర దురంతములను చిన్నచిన్న రాజ్యములవారుకూడ అనుకరించ ప్రయత్నించుచున్నారు. కాని ఇట్టి పనులయందు ప్రజలకు ప్రయోజనము లేకపోవుటయే గాక యిట్టి ఘోరకృత్యములు తమ శాంతిమయ జీవనమునకు విరుద్ధమనియైన గ్రహించుటలేదు. పెద్ద పెద్ద రాజ్యములవారి అధికారముక్రింద నుండు చిన్న రాజ్యములవారు తాము అటుల లోబడియుండుటకును, పైవారు అధికారము చేయగల్గుటకును తమలో దేశభక్తి లోపించుటయే కారణమని భ్రమించుచున్నారు. మరియు దేశభక్తియను అంటుజాడ్యమును

తమ తమ రాజ్యములందుకూడ వ్యాపింపచేయుచున్నారు. ఈ దేశభక్తి యను మత్తుచే మైమరచి, తమ నిత్యకృత్యములన్నియు కట్టిపెట్టి, తమ్ము జయించినవారు తమపై చేసిన ఘోరములవంటి ఘోరములనే తమకు లోకువైన వారిపై ప్రయోగించ సిద్ధపడుచున్నారు.

ఈ ప్రభుత్వవర్గములు—కేవలము ప్రభువులు, ప్రభుత్వోద్యోగి యులు మాత్రమే కాదు—వారికి తోడ్పడు ధనికవర్గములు, పత్రికాధిపతులు, యంత్రాగారాధిపతులు, ప్రకృతి శాస్త్రవేత్తలతోసహా వీరందరును కష్ట జీవులగు కార్మికులకన్న తమ స్థితి సౌఖ్యవంతమైనదగుటచే దానిని నిల్పుకొనుటకు దేశభక్తిని సాధనగా నుపయోగించుకొనుచున్నారు. ఈ దేశభక్తిని ప్రచార మొనర్చుటకు అవసర సాధనోపాయములన్నియు వీరలకు గలవు. ప్రతివారియందును దేశభక్తి పెంపొందునట్లు ప్రయ త్నించుటయేగాక ఇట్టి దేశభక్తియందు మిన్నలగువారలకు బహుమతుల చేకూడ మరింత ప్రోత్సాహము కలిగింతురు.

ప్రభుత్వోద్యోగియొక్క దేశభక్తి పెరుగుచుండునట్లెల్ల అతని ఉద్యోగమునందు అభివృద్ధి పొందుచుండును. సైనికులుకూడ యుద్ధసమ యములయందు ఉద్యోగముల యందు పై పదవుల సంపాదింతురు. అసలీ యుద్ధముల పుట్టుకకు కారణము దేశభక్తియే!

దేశభక్తి ఫలితముగా వచ్చు యుద్ధములు పత్రికాధిపతులకు, వర్త కులకు అపారధనరాసుల సమకూర్చును. ప్రతి వ్రాయసకాడు, ఉపాధ్యా యుడు, ఉపన్యాసకుడు, ఎంతదేశభక్తిని హెచ్చుగా వెదజల్లగల్గునో, అంత హెచ్చు లాభమును పొందును. దేశభక్తి పెరిగినకొల్ల రాజుల, చక్రవర్తుల కీర్తికూడ వృద్ధియగును. మిక్కిలి గౌరవింపబడుదురు.

ప్రభుత్వములు ఆయుధములను, ధనమును, కళాశాలలను, అచ్చు కూటములను తమ స్వాధీనమందుంచుకొన్నవి. పాఠశాలలయందు బాలు రకు చరిత్రద్వారా తదితర దేశస్థులందరికన్న తమ పూర్వులే గొప్పవా

రనియు, ప్రజ్ఞావంతులనియు, వారొనర్చిన కార్యములే సక్రమమైనవనియు బోధించి బాలురయందు దేశభక్తిని నుద్రేకింపజేయుదురు. ప్రజలకు సభలద్వారా, దిర్బారుల మూలమున, జ్ఞాపకచిహ్నముల నెలకొల్పి దేశభక్తి పేర దొంగప్రకటనలద్వారా ప్రబోధమొనర్తురు. అన్నిటికి మించిన చిత్ర మొకటి కలదు. ఇతరజాతులకు, ప్రభుత్వములకు చెందిన ప్రజలపై అత్యాచారములు, అన్యాయము లొనర్చి వారలనుద్రిక్తుల నొనర్చి వారటుల నుద్రేకులుకాగా తమ ప్రజలను ప్రతిక్రియకు దేశభక్తిపేర పురిగొల్పుదురు. విదేశీయులపై రోషము, ద్వేషము పుట్టింతురు.

ఈ భయంకర రోషానల జ్వాల యూరోపుఖండమునం దంతటను తీవ్రముగా వ్యాపించినది. మనకాలమునందీ దేశభక్తి విషమించినది. ఇది ప్రవేశించని చోటులేదు.

ఎన్నడోకాదు, నిన్నమొన్నటి విషయ మొక టిచట ఉదాహరింతును. దేశభక్తియను మత్తుకు లోనై క్రైస్తవజాతికి చెందిన మానవు లొనర్చిన ఘోరముల పరికింపుడు: జర్మను ప్రభుత్వమువారు వారి ప్రజలయందు దేశభక్తిని నుద్రేకింపచేసి, తత్ఫలితముగా జర్మనీదేశపు ప్రతి పౌరుడును సైనికుడుగా చేరవలెనను నిర్బంధశాసన మొకటి గావించిరి. పుత్రులు, భర్తలు, తండ్రులు, విద్యావంతులు, చివరకు దైవారాధన తత్పరులు, ఏరువారనక యావన్మంది హత్యలొనర్చుటయందు నేర్పరులు కావలసివచ్చెను. సైనికాధికారుల ఆజ్ఞల శిరసావహించి బానిసలవలె చెప్పిన వారినెల్ల చంపుటకు సిద్ధపడవలసివచ్చెను. అణచబడిన జాతుల హత మొనర్చుటయేగాక అవసరమగుచో హక్కులకొరకని పోరాడు కార్మికులను, చివరకు ఆత్మీయులగు తండ్రులనుగాని, సోదరులనుగాని చంపుటకు సంసిద్ధులు గండవి ఆ సిగ్గుమాలిన నిరంకుశ ప్రభువగు రెండవ విలియం ఉత్తర్వులు గావించెను. ఉత్తమ తరగతికి చెందిన సత్పురుషులకు అవమానకరమైన ఈ భయంకర శాసనము దేశభక్తిపేరిట జర్మను

ప్రజలెల్లరు మారాడక శిరసావహించవలసినవారైరి. ఈ ఆర్భాటముల ఫలితముగా ఫ్రెంచివారితో పోరాడి జయమును పొందిరి. ఈ విజయము జర్మను ప్రజలకు మరింత దేశభక్తిని నుద్రేకింపచేయుటకు తోడ్పడెను. ఈ దేశభక్తి ఫ్రాన్సు, రష్యారాజ్యములకుకూడ నెగబ్రాకెను. దీని సారాంశ మేమన యూరప్‌ఖండవాసు లెల్లరు ఒక్కుమ్మడి సైనికులుగా చేరిరి. బానిసజాతులకన్న హీనస్థితిని సైనికాధికారుల ఆజ్ఞల క్రింద ననుభవించ వలసివారైరి. అవమానకరమైనట్టియు, క్రూరమైనట్టియు వెఱ్ఱెత్తిన ఈ ప్రభుత్వముల చర్యలకు హద్దులేకుండెను. బలహీనజాతులకు చెందిన ఆసియా, ఆఫ్రికా, అమెరికా యందలి చిన్నచిన్న రాజ్యములవారిపై పై మూడు (జర్మని, రష్యా, ఫ్రాన్సు) రాజ్యములవారును పోటాపోటీలతో అన్యా యాక్రమణకు గడంగిరి. ఈ ఆక్రమణమంతయు చపల చిత్తత, గర్వము, దురాశలచే చేయబడెను. మరియు ప్రభుత్వముల మధ్య దేశభక్తి పేర ద్వేషము, అసూయ, అనుమానములకు కారణమాయెను.

ఈ ఆక్రమణమూలమున నాశనము గావింపబడిన గ్రామస్థులస్థితి ఎంత దుర్భరముగా నుండునో యూహించ శక్యముగాదు. కాని వీరు మాత్రము యుద్ధసమయములందు యిట్టివి జరుగుట మామూలేయని తేలి కగా త్రోసిపుత్తురు. ఇతర రాజ్యముల కొల్లగొట్టి సర్వనాశన మొనర్చితి మను చింతగాక మేము ముందు, మేము ముందని ఒకరితో నొకరు (ఆ మూడు రాజ్యములవారు) కలహించుచుందురు. అన్యాయాక్రమణ గావించి ప్రాణమానధనముల కొల్లగొట్టుటయేగాక, రాజ్యాధికారులమనుచు ఆ ప్రజల ప్రాథమిక హక్కులనే నాశనమొనర్తురు—నాశనమొనర్చిరి, నేటికిని చేయుచున్నారు. వారిలో వారు (పెద్ద రాజ్యములవారు) కలహిం తురు, మోసములొనర్తురు. లంచము లిత్తురు, గూఢచారుల నుంతురు, దోచుదురు, హత్యలొనర్తురు. ఇన్ని ఘోరములు జరుగుచున్నను ప్రజలు

దేశభక్తిపేర తమ ప్రభుత్వములు ఇతరులపై గావించినప్పుడు ఆనందింతురు; ఇతరులొనర్చిన, ఘోరనేరములందురు.

వివిధ మనుష్యులమధ్య, రాజ్యములమధ్య ఒక రొకరిపై ద్వేషములు పెంచుకొని పొందవలసిన కారణము లెవ్వియు లేకపోయినను ప్రతి ప్రభుత్వమును బలహీనజాతుల కబళించు నిమిత్తము కోరలు చాపి, భయంకర కాళపిశాచ స్వరూపముతో తాండవమాడుచున్నది.

క్రైస్తవజాతికి చెందినవారమని చెప్పుకొనువారిట పశువులుగా మారిరి. చంపుటకు, చంపబడుటకు తయారైనవారు మాత్రమేగాక, సర్కసును చూచుచున్న ప్రజలానందించునట్లు యుద్ధవార్తలవలన ఆనందమును అందరును యిప్పుడు పొందుచున్నారు.

పెద్దలే కాదు. నిర్మల మనస్కులగు బాలురుకూడ ఈ దేశభక్తిచే ప్రేరేపింపబడి ఆనందించుచున్నారు. ఈ రోజున చనిపోయినవారు ౨౦౦ కాదు, ౧౦౦౦ అని తెలిసినప్పుడు వీరు పొందు ఆనందమునకు మేరయేయుండదు. పిల్లల నిట్టి క్రూరకృత్యము లొనర్చుటయందు తర్బీతు చేయు తలిదండ్రులుగూడ నేనెరుంగుదును.

ఇంతియేకాదు. ఇంకను కలదు. ఒకరిని మించి మరొకరు సైన్యమును పెంచజూతురు. అటుల పెంచినగాని దేశభక్తిని రక్షింపజాలమని వారి తలంపు. కోటల నిర్మాణమందేమి, యుద్ధనావల నిర్మించు విషయమందేమి యిదే ధోరణి. ఒకనికి ౧౦ కోటలున్న రెండవవాడు ౧౧ కోటల నిర్మించును. తిరిగి మొదటివాడు ౧౨ చేయించును. ఇదేప్రకారం సాగును.

నేను నిన్ను గిచ్చెదని ఒకడనును, నీ తల పగలకొట్టుదుననును రెండవవాడు. కత్తితో పొడుతుననును మొదటివాడు. కాదు దుడ్డుకర్రతో తలపగులకొట్టెదనని రెండవవాడు. చూడు నిన్ను కాల్చివేతునని మొదటివాడు. ఈ ప్రకారం పోరాడుచున్నారు. ఆ పోరాడునది పిల్లలా ? త్రాగినవారా ? లేక పశువులా ? ఇట్లు పోరాడుటెందులకు ? పేరు పొంది గొప్ప

ప్రభుత్వములకు చెందినట్టివా రొనర్చుచున్న దిదియే! వీరే ప్రజలకు విద్యా బుద్ధులు, నీతి గఱపువారు!

నానాటికి స్థితి విషమించుచున్నది. ఈ అధోగతికి అంతమున్నట్లు కనబడుటలేదు. ఈ మధ్య జరిగిన ఘోరములనుండి బయటపడు మార్గమే కనబడుటలేదు. ఇంగ్లండు ఫ్రాన్సువారల మధ్య జరిగిన యుద్ధమును గూర్చియు, దాని తరువాత జరిగిన హేగు సమావేశఫలితమును గూర్చియు గమనించుడు.

అంతర్జాతీయ న్యాయస్థానమువారు నిరంతరముగా తయారుచేయ బడుచున్న ఆయుధ నిర్మాణము నాపుజేసి, యుద్ధము జరుగకుండునట్లు కట్టుదిట్టు చేతురని కొందరు ఆశించిరి. హేగు సమావేశ మనంతరము యుద్ధముతిరిగి తటస్థించుటవలన ఆశలు నిరాశలాయెను. ప్రభుత్వములు ఆయుధ నిర్మాణము నాపనంతవరకు యుద్ధములు తప్పనిసరియని తేలినది. ఒడంబడిక లొనర్చుటకు ముందు పరస్పర విశ్వాసము కలిగియుండుట అవసరము. యుద్ధములలో సంధిసూచనగా జండాలను క్రిందికి దించినట్లు పరస్పర విశ్వాసచిహ్నముగా ఆయుధ విసర్జనకు గడంగవలెను.

పరస్పర విశ్వాసము లేనంతవరకు ఆయుధ విసర్జనగాని, సైనిక సంఖ్యను తగ్గించుటగాని పొసగదు. పైగా ఆయుధ నిర్మాణము, సైనికు లను చేర్చుకొనుట మరింత హెచ్చుతగును. ప్రతిప్రభుత్వము యితర రాజ్యములకు గూఢచారుల బంపి, ఆయా రాజ్యముల ఆయుధబలమును, సైనిక సంఖ్యను తెలుసుకొనుచు తదనుగుణముగా తాము పెంచు చుందురు. అవకాశము కలిగినవెంటనే ఒకరినొకరు కబళింపజూతురు. ఇట్టి స్థితిలో ఎట్టి సంభాషణలు, సమావేశములు ఫలవంతములు కాజాలవు. మరియు తెలిసియు జరిపించబడుచున్న సమావేశములు బుద్ధిలేని పను లనియు, కాలక్షేపముకొరకు జరుగునట్టివనియు, ఉత్తనటన, మోసమనియు అనవలెను.

ఇతరులకన్న రష్యా రాజ్యప్రభుత్వమువారి ప్రవర్తన విపరీత మార్గమున నడచుచున్నది. హేగు యుద్దేశ్యములకు కేవల భిన్నమార్గము నందున్నది. రష్యా ప్రభుత్వముచేయు దొంగ ప్రకటనలను గూర్చి నోరెత్తి మాట్లాడు అధికార మెవ్వరికిని లేదు. రష్యా ప్రభుత్వము తనకు లోకువైన చిన్నచిన్న రాజ్యములవారిని నిర్దయగా చంపుచున్నది. పోలెండును నిలువున హత్యచేసినది. తుర్కీ, చీనా రాజ్యములను దోచుకొన్నది. ఫిన్‌లెండు ప్రజలను ఊపిరాడక అల్లాడి ఆకులు మేయునట్లు ముప్పుతిప్పలు పెట్టుచున్నది. ఇంటనిటుల ప్రవర్తించుచు, బయట హేగు సమావేశమునందు ఆయుధ విసర్జనను గూర్చిన సూచనలు ప్రవేశపెట్టుచున్నది.

ఇంతకు మించిన చిత్రము మరొకటి కలదు. ఒక చెంప ప్రతిరాజ్యమును ఆయుధముల సంఖ్యను, సైనికుల సంఖ్యను పెంచుచూ, పెద్దపెద్ద మొత్తములను జీతములక్రింద మ్రింగుచూ, వారములకొలది ఏవేవియో గొప్ప సమస్యలను చర్చించి పరిష్కరించువారివలె నటించుచున్నారు. ఈ సమావేశములవలన నెట్టి ప్రయోజనము లేదని హేగునందు సమావేశమైన ప్రతినిధులకు తెలియకపోలేదు. కాని శాంతి స్థాపనకై తీవ్ర పరిశ్రమ చేయుచున్నట్లు నటించు వీరి చర్యలకన్న హాస్యాస్పదమగు విషయము వేరేమి గలదు ?

హేగు సమావేశము ముగిసీ ముగియక మునుపే ప్రారంభమైన ట్రాన్సువాలు యుద్ధమును నాపుటకు నెవరును ప్రయత్నించనైనలేదు. దీనివలన మనకేమి స్పష్టపడుచున్నది ? ఈ ప్రభుత్వములవలన మనకు సౌఖ్యము సున్నయనియు, హాని నిశ్చయమనియు స్పష్టమగుటలేదా ? ఈ ప్రభుత్వము లెంత ప్రయత్నము చేసినను ఆయుధ విసర్జన చేయజాలవు. యుద్ధము లాగవు.

ప్రభుత్వముల ఉనికికి ఒక కారణ ముండవలెనుకదా ! ఇతరుల దాడినుండి ప్రజలను రక్షించు బాధ్యత తమపై నున్నట్లు, ఆ బాధ్యత

నెరవేర్చుటకు తామే యుద్ధములకు దిగుచున్నట్లు చెప్పుదురు. కాని ప్రజలు ఏ రాజ్యమునకు చెందినవారైననూ తమలో తాము కలహించ నొల్లరు. ప్రభుత్వములు శాంతిని కోరుటకు బదులు ఇతర రాజ్యములకు ఉద్రేకము పుట్టించి, వారికి ఉద్రేకము పెరిగినప్పెల్ల తమ ప్రజలకు దేశ భక్తిని పురిగొల్పుదురు. ప్రజల ధనప్రాణములు అపాయమునందున్న వనుచు వారి రక్షణయను నెపమున యుద్ధములకు దిగుదురు.

ప్రభుత్వములు తమచేతనున్న అధికారము యితర రాజ్యముల వారిని ఉద్రిక్తుల చేయుటకును, వెనువెంట ప్రజలకు దేశభక్తిపేర యుద్ధ మునకు ఆయత్తులగుటకును నుపయోగింతురు. జగడములపైననే ఆధార పడిన ప్రభుత్వములు వేరువిధముగా నెటుల ప్రవర్తించగలుగును ?

ఒకానొక కాలమునందు ప్రజలు తమలో తాము కలహించు కొనకుండ రక్షించుటకు ప్రభుత్వము లుండుట అవసరమని భావించిరి. నేడు ఆ ప్రభుత్వాలే ప్రజాశాంతికి భంగకరములుగా పరిణమించినవి.

విత్తనములు నాటుటకు భూమిని దున్నుట తెలివిగలవారి లక్షణము. గాని విత్తనములు నాటినపిమ్మట భూమిని దున్నువారి నేమనవలెను ? తెలివితక్కువ పనియేగాక నష్టదాయకముగూడ నగును. ప్రభుత్వములు నేడు ప్రజలచే చేయించుచున్న పను లిట్టివే. ఉన్న ఐకమత్యమును చెడ గొట్టి శాంతికి భంగకరముగా ప్రవర్తింతురు. కాన ప్రభుత్వములే లేకున్నచో శాంతిని భంగమొనర్చువారే యుండరు.

ప్రభుత్వమే లేకున్న బ్రతుకజాలమన్నట్లు ప్రజలు తలంతురు. అసలీ ప్రభుత్వము లన నేమి ?

ప్రభుత్వముల మూలముగా నేడు కలుగుచున్న ఉపద్రవములకన్న-ప్రభుత్వములే లేకున్న-'యిరుగు పొరుగువారు చేయుదురనుకొనుచుండు దౌష్ట్యములే 'మేలురా బాబు' యను స్థితి రాకున్నంతకాలము ప్రభుత్వము లుండుట అపాయకరము కాకపోవచ్చును, గాని నేడో ! ఉపద్రవము

లన్నిటికన్న ప్రభుత్వము మూలమున కలుగుచున్న ఉపద్రవములే మిక్కిలి హానికరములుగా పరిణమించుచున్న ఈనాడు ప్రభుత్వము లుండుట అనవసరము. స్వార్థరహితులు, పరోపకారపారీణులునగు వారి చేతులలో ప్రభుత్వాధికారమున్నను ప్రభుత్వ సంస్థలనునవి యుండుట అవసరమని తలంచను. కాని హానికరములుమాత్రము కావని అంగీకరింతును. ఇందుకు విరుద్ధముగా దౌర్జన్యములకు మూలకందమైన ప్రభుత్వ సంస్థలు సత్పురుషులచే నిర్వహింపబడుటకు బదులుగా అధర్మములకు జంకని సిగ్గు బిడియములులేని స్వార్థపరులచే నిర్వహించబడుచున్నవి.

కాన ముఖ్యముగా సైన్యాధికారములతో కూడిన ప్రభుత్వములు మిక్కిలి అపాయకరములు.

ప్రభుత్వమన అసంఖ్యాక జనులపై అధికారము వహించునట్టి అల్పసంఖ్యాకుల సంస్థయేగాని యితరము గాదని స్థూలముగా చెప్పవచ్చును. ఆ అల్పసంఖ్యాక సంస్థకు చెందినవారు వారిలో కొందరిని ఎన్నుకొని అధికారము వారి పరమొనర్తురు. వారు తిరిగి మరొక చిన్న వర్గమును తయారుచేతురు. ఆ చిన్నివర్గము ఒక్కని నెన్నుకొనును. ఆ ఒక్కని చేతిలో—సైన్యాధికారముతో సహా—సర్వాధికారములు ఉంచబడును. ఇయ్యది వ్యూహమువలె అభేద్యముగా నుండును.

ఈ సర్వాధికార పదవి వహించువాడు (రాజు) లేక అధ్యక్షుడు కుయుక్తులందు ఆరి తేరి, మానాభిమానములు వదలి అధర్మమునకు జంకనివాడుగాని లేక అతని సంతతికిచెందినట్టి సాహసు లాస్థాన మాక్రమింతురు.

ఈరో జొక బలహీను డుండును. రేపొక అనర్హు డుండును. మరొకనా డొక హంతకు డాపీఠ మధిష్ఠించును. దీనినే ప్రభుత్వమందురు.

ఇట్టి ప్రభుత్వమునకు సర్వాధికారములు అనగా ధనప్రాణముల పైననేగాక వారి ఆధ్యాత్మిక, నైతిక, విద్య, మత విషయములయందును సంపూర్ణాధికారము కలిగియుందురు.

ప్రజలు ఇట్టి భయంకరశక్తి నొకదానిని సృష్టించి, నీతిమాలు దగు నొకని కాశక్తిని వప్పగించి, అతనికి బానిసలుగా యుండుచూ, పిమ్మట అందుండి విషజ్వాలలు బయలుదేర ఆశ్చర్యపడుదురు. అరాజకుల బాంబులకు భయపడుదురేగాని తమ కాళ్ళక్రింద గొయ్యి త్రవ్వెడి ఈ ఘోరభయంకర సంస్థను గూర్చి భయపడుచున్నట్లు కాన్పించరు.

పూర్వమునందు సర్కాశియన్ జాతివారు తమ శత్రువుల నెదిరించు నప్పుడు తమలోనివారెవ్వరును యుద్ధరంగమునుండి పారిపోకుండుటకై ఒకరి కాళ్ళ కొకరు లంకెలువేసుకొని యుద్ధము చేయుచుండిరి. అదేవిధముగా ప్రజలు తమ శత్రువుల ప్రతిఘటించు నిమిత్తము ఒకరినొకరు అంటిపెట్టుకొని యుండుట లాభకరమని తలంచిరి. అయితే అపాయస్థితి తొలగినను ఆ పద్ధతినిమాత్రము వదలియుండలేము. ఒకరికొకరు త్రాటితో కట్టుకొని, ఆ త్రాటికొనను ఒకని చేతికిచ్చి అతని యిష్టప్రకారము నడచుకొనుచు అయ్యది ఎట్టి హానిని చేసినను గ్రహించుటలేదు.

ప్రజలు చేయుచున్న దింతియేగాక మరేమున్నది? ఒక భయంకర స్వరూపముగల శక్తిని సృష్టించి దాని చేతులలో సైన్యాధికారములతో సహా సర్వాధికారములు ఉంచి, నే డనుభవించుచున్న దేమి?

ఆయుధ నిర్మాణమువలనను, యుద్ధములవలనను నిరంతరాయముగా సాగుచున్న భయంకర ఘోరకృత్యముల వారినుండి ప్రజలను రక్షించుటకు సంస్థల సమావేశములతో, పంచాయితీల పెద్ద మనుష్యులతో అవసరములేదు. విషజ్వాలల గ్రక్కు ఆ ప్రభుత్వయంత్రమును కూల ద్రోయవలెను.

ఈ ప్రభుత్వ యంత్రమును కూలద్రోయుట కొక్కటే మార్గము కలదు. ఈ ప్రభుత్వముల ఉనికికి ఆధారభూతమైన ఆ దేశభక్తిని నిర్మూలింపుడు, దేశభక్తి అనాగరకమైనది. హానికరమైనది. అవమానకరమైనది. చెడ్డది. పైగా అవినీతికరమైనది. తమకన్న బలవంతులగువారు

తమ్ము అవమానముల పాలుజేసి కష్టనష్టము లొనర్చుచుండ తాము తమ కన్న బలహీనులగు వారిపై యిట్టి చర్యలనే జరుపవలెనని పురిగొల్పునది గాన దేశభక్తి అనాగరకమైనది. ప్రజల శాంతి, సంతోషములకు దూరుల నొనర్చి, పరస్పర సహజ ప్రేమను నాశనమొనర్చి నీచాతినీచులగువారి చేతులలో అధికారముంచుటకు ప్రోత్సహించు దేశభక్తి హానికరమైనది. మానవులను బానిసలుగా చేయుటయేగాక, జగడాలకోరులు కిరాతక హృదయులుగా తయారుచేసి ఒకని శక్తిని, ప్రాణమును స్వలాభమునకుగాక ప్రభుత్వప్రయోజనములకై వినియోగింప ప్రోత్సహించునదగుట దేశభక్తి అవమానకరమైనది. మానవులందురు భగవంతుని బిడ్డలనియు, తద్వారా మనమందరము సోదరులమనియు తెలిసియుండియు, సర్వేశ్వరునికి కుమారులమగు మనలమ మాతృదేశమను పిచ్చికి లోనొనర్చి, ప్రభుత్వపు బానిసలుగా చేసిన ఈ దేశభక్తి అమానుషకరమైనది.

ప్రజలు దీనిని గ్రహించిన చాలును. మనల బంధించియుంచిన ఈ ప్రభుత్వములను బంధనములు ఎట్టి పోరాటములతోడను అవసరము లేకుండగనే వాటియంతట నవే విడిపోవును. ఆ ప్రభుత్వయంత్రములు తుత్తునియలై కూలిపోవును. ఆపైన నవి అపాయకరమగు విషజ్వాలల గ్రక్కజాలవు.

ప్రజలుకూడ దీనిని గ్రహించ మొదలిడిరి. అమెరికా దేశీయు డొకడు వ్రాసినదానిని ఈ క్రింద ఉదహరించుచున్నాను :—

"మేము రైతులము- వ్యవసాయముచే జీవింతుము. మేము పారిశ్రామికులము- యంత్రాలయములయందు పనిచేతుము. మేము వర్తకులము వ్యాపార మొనర్తుము. ఉపాధ్యాయులము- బాలబాలికలకు విద్యాబుద్ధుల గరపెదము. మిమ్ముల మా పనుల చేసుకొననిండు. మాకు యిండ్లు వాకిళ్ళుగలవు. ఆలుబిడ్డలు గలరు. మేము కష్టించి జీవింతుము. మా ఇరుగు

పొరుగువారితో మా కెట్టి తగాదాలును లేవు. మాకు మా పనులుగలవు. మమ్ముల వదలుడు. మా జోలికి రాకుడు.

"కాని వదలుదురా! ఆ రాజకీయ వేత్తలు వదలరు. వారు మాపై అధికారము చేయుటకే తలబడినారు. మేము కష్టించి సంపాదించుదానిని అనుభవించుచూ జీవించ దలచినారు. మాకు పన్నుల విధింతురు. మా రక్తమాంసముల పీల్తురు. మమ్ముల సైనికులుగా జేతురు. వారి యుద్ధములకొరకు మా పిల్లల లాగుకొనిపోదురు. సోమరిపోతులందరు ప్రభుత్వమును ఆశ్రయింతురు. వారలకొరకై మావద్ద పన్నులు వసూలు చేయబడుచున్నవి. దేశరక్షణకొరకై సైన్యము లున్నవందురు. ఇది కేవలము మోసము- నటన. అదిగో చూడుడు! జర్మనువారు మనపై పడ నుంకించుచున్నారని ఫ్రెంచివారు తమ ప్రజలను జడిపింతురు. బ్రిటీష్ అనిన రష్యాకు భయము. ఇంగ్లీషువారికి ఎవరినిచూచినను భయమే. యూరప్ రాజ్యములవారు నేడో రేపో మనపై పడనున్నారనియు, కాన ఆయుధములను విరివిగా తయారుచేసి సైనిక సంఖ్య పెంచుట అవసర మనియు అమెరికావారందరు.

"ఇదంతయు మోసము, అబద్ధము. ఫ్రాన్సు, జర్మని, ఇంగ్లాండు. అమెరికా దేశములందలి అమాయక ప్రజలెవరును యుద్ధముల కోరరనుట నిశ్చయము, కాన మా గొడవ మేము చూచుకొందుము. మా దారిని మమ్ములపోనిండు. హాయిగా భార్యాపిల్లలతో సుఖపడక యుద్ధములకు పోగోరువారెవరుందురు? మేము శాంతిప్రియులము. యుద్ధములనిన మాకు అయిష్టము. యుద్ధముల నిరసింతుము.

"ఆయుధధారులగు సైనికులుండుటయే యుద్ధములకు కారణము. పెద్దపెద్ద సైన్యములకూర్చి పోషించు రాజ్యములు యేరోజుకైనసూ యుద్ధ ములలో తగుల్కొనకలేరదు. గుద్దులాట కుబలాటపడువానికి ఏనాటికైనను అతనిని మించినవాడు ఎదురుపడకపోడు. ఆనా డిద్దరు జుట్లు పట్టుకొం

దురు. ఇప్పుడు జర్మనివారికిని, ఫ్రాన్సువారికిని ఉభయులలో నెవరు గొప్పయను పిచ్చిపట్టినది. వారు చాలాసార్లు యుద్ధముల చేసిరి. మరల మరలచేతురు. ప్రజల కోరికపై ఈ యుద్ధములు జరుగుటలేదు. ఇదంతయు పై తరగతికి చెందితిమని యనుకొనువారికి పట్టిన గొడవ. కొంపలు మునుగుచున్నట్లు ఆర్భాటము లొనర్చి, యుద్ధము తప్పనిసరియని యందురు.

"గాన భగవదాదేశము ప్రకారము జీవించదలచువారికి స్వేచ్ఛలేదు. పన్నుల విధించి, దౌర్జన్యము లొనర్చి, అమాయకప్రజలను ప్రభుత్వములు మోసగించుచున్నవి.

"భగవంతుడు మనకు నమ్రత, సాత్వికబుద్ధి కలిగియుండుటకును, శత్రువుల తప్పులను క్షమించుటకును బోధించెను. చంపుట పాపమనెను. కాని పై తరగతికి చెందితిమనుకొనువారు తమ కందు విశ్వాస మేమాత్రము లేకపోయినను, పవిత్ర బైబిల్ గ్రంథముల నెత్తిన పెట్టుకొని అప్రమాణముల నొనర్చుటకుకూడ వెనుదీయరు.

"కాయకష్టము చేయకనే, పెద్దపెద్ద విలువగల దుస్తుల ధరించి కులుకుచు ఠీవిగా తిరుగుచుందురు. మా రక్తమాంసముల త్రాగుచు, మా కాయకష్టముపై నాధారపడిన ఈ పెద్దపిట్టల బారినుండి తప్పించుకొనుటెట్లు? వారితో పోరాడవలెనా?

"కాదు. మాకు రక్తపాతము లొనర్చుటయందు విశ్వాసములేదు. పైగా వారివద్ద తుపాకులున్నవి. విరివిగా ధనరాసులున్నవి. మాకన్న వారికి ఎదదుర్చగలశక్తి మిక్కుటముగా యున్నది. అయితే మనలను కాల్చ నుంకించు వారెక్కడివారు?

"మన యిరుగుపొరుగువారు కారా? వారుకూడ మన సోదరులే! శత్రువుల దాడినుండి దేశరక్షణచేయుట ప్రతివాని విధియనియు, ఇట్టి కార్యము భగవత్ప్రీతికరమనియు బోధించి, భ్రమింపజేతురు. కాన

పై తరగతికి చెందితిమని చెప్పుకొనువారు తప్ప, మనకు వేరే శత్రువులు లేనేలేరు. మనము సక్రమముగా పన్నుల చెల్లించుచూ వారి ఆజ్ఞల శిరసా వహించుచున్నంతవరకు మన రక్షణకొరకున్నట్లు నటింతురు.

"ఈ ప్రహారము మన నెత్తురు పీల్చి మన సోదరులనే మనపై విడుతురు. మనల చంపుటకే తోడ్పడునట్టియు, మనము పన్ను చెల్లించ నిచో, జైళ్ళయందుంచు నిమిత్తము మనల తీసుకొని వెళ్లుటకు తోడ్పడు నట్టియు ఆ సైనికుల పోషించు నిమిత్తము పన్ను చెల్లించిగాని వేరొకపని చూచుకొనజాలరు. నీ భార్యకు తంతి నిచ్చుటకుగాని, నీ స్నేహితునితో కుశలప్రసంగము చేసుకొనుటకుగాని, నీ భోజనపదార్థముల నిచ్చు వ్యాపారస్థుని బిల్లు చెల్లించుటకుగాని మొదట నవకాశములేదు. మొదట పన్ను చెల్లించితీరవలెను.

"వీటినుండి విముక్తిని బడయవలెననిన ప్రజాప్రబోధ మొనర్చు టొక్కటియే మార్గము. చంపుట తప్పని ప్రజలకు బోధించవలెను. భగవదాదేశమును తిరిగితిరిగి ప్రచారము చేయవలెను. క్రమక్రమముగా పై తరగతికి చెందితిమనుకొవారికి తల లొగ్గుట మానవలెను. వారి తుపాకిగుండ్ల ధాటికి నిల్వవలెను. డబ్బు కక్కుర్తికై పనిచేయు రాజకీయవేత్తల యుద్ధము యుద్ధమను దొంగ కేకలకు భ్రమింపకూడదు. వారుకూడ మన వలె కష్టించి జీవించవలెను. జీసస్ తాను నమ్మినదానిని బోధించెను. వీరటులకాదు. అధికారమందుండి పై తరగతికి చెందినవార మనుకొను వారల సంతృప్తిపర్చు నిమిత్తము యితరులకు బోధింతురు.

"ఇక మేము సైనికులుగా చేరము. వారి ఉత్తర్వులపై యితరుల కాల్చము. నిరాయుధులు, నిరపరాధులు నగు వారి ఎదురు రొమ్ములకు తుపాకుల గురిపెట్టము. రాజుగారి యాజ్ఞయని వ్యవసాయదారులను, పారిశ్రామికులను ఇక కాల్చము. పులిపులియను దొంగకూత లిక మమ్ము భయపెట్టజాలవు. ఇంతవరకు మీరు కోరినంత పన్నులు చెల్లించితిమి.

కాని యికముందు మేము న్యాయ మనుకొనునంతవరకే చెల్లింతుము. మీ భోగములకు, మీ ఆటపాటలకు పన్నుల నివ్వ నిరాకరింతుము. అవకాశము కలిగినప్పుడెల్ల నిశ్చయముగాను మనస్సులోని మాట చెప్పెదము. ఈరీతిగా తీవ్రప్రబోధ మొనర్తుము.

"మా హృదయాంతరాళములనుండి నిస్పృహ వెలువడుచున్నది. నిర్బంధసైనిక విధానమునకు అయిష్టత చెంది ఇక యితరులతో పోరాడ నిరాకరింతురు. యుద్ధములు రక్తపాతములకన్న యిరుగుపొరుగు వారితో సఖ్యముగాయుండి శాంతిగా జీవించవలెనను జీససు బోధలే మంచివి. వాటి ననుసరించుచో సుఖింతుమని బోధింతుము.

"భూమిపై శాంతి వర్ధిల్లుగాక ! ఆయుధముల త్యజించి తనయందు, నఖిల భూతములయందు నొక భంగి సమహితత్వమును జరుపుట శ్రేష్ఠమైన పద్ధతియని తెలుసుకొనవలెను".

ఇట్టిభావములేగల వ్రాతలు పలుతావులనుండి వచ్చుచున్నవి. ఒక జర్మనీ సైనికు డిటుల వ్రాసెను :—

"క్రీ. శ. ౧౮౬౬ - ౧౮౭౦ సంవత్సరముల మధ్య పర్షియా సైనికాధికారుల క్రింద రెండుసార్లు యుద్ధరంగమునకు వెళ్ళియుంటిని. అప్పటినుండి నేను యుద్ధములవిన మనఃపూర్తిగా నిరసింతును. యుద్ధములు నా జీవితము దుఃఖభాజన మొనర్చినవి. మేము అంగవైకల్యముపొంది అసమర్థులమైనప్పుడు, మాకిచ్చు ఉపహారవేతనముల తలంచిన, మమ్ము యుద్ధములకు పురిగొల్పిన మా దేశభక్తినిగూర్చి సిగ్గుపడవలసియుండును. యుద్ధములో నాకుడిభుజము విరిగిపోయెను. రోజుకు తొమ్మిది అణాల వంతున మాత్రమే పరిహారముగా నిత్తురు. వేటకుక్కలకు కూడ యింత తక్కువ మొత్తము యివ్వరు. రెండుసార్లు గాయములుపడి, నా కుడి భుజమునకు బాధకలిగెను. క్రీ. శ. ౧౮౬౬ సంవత్సరపు ఆస్ట్రియా యుద్ధమునందు పాల్గొనియుంటిని. ఆభయంకరదృశ్యముల కళ్ళారచూచితిని.

నాకు తగిలిన గుండుదెబ్బలవలన నా భుజము నిలుపున చీరుకొనిపోయి యుండెనని చెప్పియుంటినిగదా! ఆరోగ్యమునకై చాలా రోజులు అవస్థ పడితిని. కాని కోలుకొనలేదు. ఆ రోజునుంచి భూమిపై కాలిడజాలక పోతిని. నాతో అవసరము తీరినందున ఆ కొద్ది ఉపకారవేతనము కూడ యిచ్చుటమానిరి. వీధులవెంట బిచ్చమెత్తి జీవించు దుస్థితిపట్టెను.

"మాలిమిచేయబడిన అడవి మృగములాయన్నట్లు రక్తతృష్ణగల వీరు ఒకరినొకరు తలపడి చంపుకొన సిద్ధపడుదురు. బలాబలములు చూచుకొనుటపత్ప వేరే లాభములేని ఈ భయంకర యుద్ధములో తగు ల్కొనిన మానవజాతిలో నేనొక అనామకుడ కావచ్చును. గాని ఆ కొండ శిఖరముపై నిలువబడి క్రీస్తుబోధించిన మహోపదేశములు నాకు శాంతిని ప్రసాదించినవి. యుద్ధములుకూడ పెద్దయెత్తున నడుపబడు వ్యాపారములని చెప్పవచ్చును. ఈ వ్యాపారము అమాయకప్రజల ప్రాణములతో, ధనవంతులు, బలవంతులు నగువారిచే నిర్వహింపబడుచున్నది.

"యుద్ధమనిన హృదయము కంపించిపోవును. ఆ భయంకర ఆక్రందనల తలంచినప్పుడెల్ల నా గుండెలు ఝల్లుమనును.

"వ్యక్తిపరమగు పరస్పరవిరోధములేవియు లేకపోయినను, అడవి మృగములవలె ఒకరినొకరు చంపుకొందురు. తమ చర్యలు భగవత్ప్రీతి కరములని నోరు వాయిలేని ఆ భగవంతునిపైనిడి, భగవంతుని నామము అపవిత్రము కావించుచున్నారు".

"నాతోడి సైనికుని దవడ యుద్ధమునందు గుండుదెబ్బచే పగిలెను. పాప మాతడా బాధకు తాళజాలక బొబ్బలుపెట్టి తన్నుకొన మొదలిడెను. పిచ్చెత్తినట్లు నటునిటు పరుగులిడెను. ఆ నడి ఎండకాలమునందు పుండును తడుపుకొనుటకు చల్లటి నీరెచ్చటను దొరకకపోయెను. మా సైన్యాధికారియగు యువరాజు (ముందు కాబోవు చక్రవర్తి) "యుద్ధ

ములవలన శుభములు కలుగుననుట అసంభవము" అని తన దినచర్య వ్రాయు పుస్తకమునందు వ్రాసుకొనెను.

అతివ్యయప్రయాసలతో పోషించి భద్రముగా కాపాడుచున్న దేశ భక్తియందలి మోసమును క్రమముగా ప్రజలు గ్రహించగల్గుచున్నారు.

అయితే ప్రభుత్వము లుండనిచో మరేముండునని చాలామంది ప్రశ్నింతురు.

ఏమియు నుండదు. చాలాకాలమునుంచి నిరుపయోగముగానున్న అనవసరపు చెత్తను తొలగించినవార మగుదుము. దుష్టాంగంబు ఖండించి శేషాంగశ్రేణికి మేలుగూర్చినవార మగుదుము.

కాని ప్రభుత్వములే లేకపోయినచో ప్రజలు తమలో తాము కల హించి కొట్టుకొని చత్తురని కొందరు తలంచుచున్నారు. ఏల ? దౌర్జన్య ములో బుట్టి, దౌర్జన్యములతో పెరిగి, దౌర్జన్యకృత్యము లొనర్చుటయందు ఆరితేరిన సంస్థలను నేడు అనవసరమని తోచినందున తొలగించుచో, పరస్పరము కలహించి చచ్చుట ఎట్లు పొసగును ? ఇందుకు విరుద్ధముగా దౌర్జన్యములకు పుట్టినిల్లగు సంస్థను రూపుమాపుటవలన ఒకరినొకరు చంపుకొని చచ్చుటలు ఆగిపోవునని మా ఊహ.

ఇప్పుడో ! దౌర్జన్యము లొనర్చుటకు, చంపుటకు ప్రత్యేకముగా మనుష్యులను తర్బీతు చేయు సంస్థ నొకదానిని సక్రమముగా నిర్వ హించుచూ, యితరులను ఆజ్ఞాపించుటకు, అవసరమగుచో చంపుటకు, తమకు అధికారము కలదని విఱ్ఱవీగువారు కొందరిప్పుడుగలరు. దౌర్జన్య ముతోకూడిన తమ చర్యలు మంచివనియు, చేయతగినవేయనియు ఆవర్గము వారు తలంచుచున్నారు.

ముందో ! ప్రజలను యుద్ధములకు తర్బీతు చేయు సంస్థలుండవు. ప్రజలపై దౌర్జన్యము లొనర్చు అధికారమెవ్వరికినిఉండదు. దౌర్జన్యములు, హత్యలు ఎవరుకావించినను అట్టివారలు దుర్మార్గులుగా తలంపబడుదురు.

ఈ ప్రభుత్వములు రూపుమాసిపోయినపిమ్మటకూడ దౌర్జన్యములు జరుగు చుండినను జరుగుచుండవచ్చును. కాదనను, గాని ప్రత్యేకముగా దౌర్జన్యములు, హత్యలు గావించు హక్కుకలదను సంస్థయొకటి యుండి ఆ సంస్థ వలయు సాధన సామగ్రుల సమకూర్చుకొనుచు, మరొక చెంప తమ కృత్యములు మంచివనియు, అవసరమనియు సమర్థించుచూ, చేయు దౌర్జన్యములు, హత్యలకన్న ప్రభుత్వములు లేనిచో జరుగు దౌర్జన్యములు, హత్యలు చాలా తక్కువగా ఉండుననుట కెట్టి సందేహమును లేదు.

దౌర్జన్యము లొనర్చుటకు, అట్టి కృత్యముల సమర్థించుకొనుటకు పూనిన ప్రభుత్వములను నిర్మూలించుటవలన అనవసరమును, హానికరము నగు సంస్థల తొలగించిన వారమగుదుము.

అయితే, ప్రభుత్వసంస్థలను తొలగించినపిమ్మట న్యాయశాస్త్రములు, ఆస్తులు, న్యాయస్థానములు, రక్షణశాఖ, విద్యాసంస్థలు నుండవా? అనగా ప్రభుత్వ దౌర్జన్యములతో సహా సాంఘిక కట్టుదాట్లను ఉద్దేశ్య పూర్వకముగా నిరాకరింతురా?

దౌర్జన్యము లొనర్చు ప్రభుత్వసంస్థల తొలగించుట అవసరమైన అన్ని సంస్థలను వదలుట యని యర్థముకాదు. కత్తియుఖశిపింపులపై నాధారపడని న్యాయముగాని, న్యాయస్థానముగాని, వ్యక్తి ఆస్తులుగాని, పోలీసు అధికారములుగాని, ఆర్థిక కట్టుదాట్లుగాని, విద్యాసంస్థలుగాని ఉండగలవు.

తమ అధికారము చిరస్థాయిగా ఉండుటకొరకై స్వార్థదృష్టితో స్థాపించబడిన సంస్థల స్థానే న్యాయమైనట్టియు, సహేతుకమైనట్టియు, సాంఘిక వ్యవస్థయుండును. ఆ సంస్థకు దౌర్జన్యములతో సంబంధముండదు. ప్రజలకు వాస్తవముగా అవసరమగునంత మేరకు న్యాయస్థానములు, విద్యాసంస్థలు, ప్రజాసంఘము లుండును. ప్రస్తుత ప్రభుత్వ సంస్థలయందలి దుర్గుణముల కెట్టి స్థానముండదు. ప్రజాభిప్రాయ ప్రకటన కాటంకపర్చు దుర్మార్గమైన హానికరమగు సంస్థలుమాత్రమే నిర్మూలింపబడును.

ఒకవేళ ప్రభుత్వము లంతమొందించిన పిదప కూడ దౌర్జన్యములు, పరస్పర కలహము లుండునని తలంచినను ప్రస్తుత స్థితికన్న హీనస్థితి మాత్ర ముండదనుట నిశ్చయము. అస లిప్పుడున్నస్థితికన్న అధమము వేరేముండును? ప్రజలు నాశన మొనర్పబడిరి. యుద్ధములకు హానిసలై ప్రతిరోజును ఇప్పుడో, అప్పుడో రానున్న ప్రభుత్వ ఉత్తర్వుల కెదురు చూచుచూ, వుత్తర్వులైనదే తడవుగా చంపుటో, చచ్చుటో యని సిద్ధముగా నుండవలసిన ప్రస్తుత స్థితికన్న హీనస్థితి వేరేమి కలదు?

సర్వనాశమునకు గురియగుచున్న ప్రజలు ఆకలిచే ఆలోచించవలసిన దిదియేకదా! రష్యా, ఇటలీ, యిండియాదేశ ప్రజలు అన్నముస కలచు టించు స్థితిలోనేయున్నారు. లేనిచో కడుపుమంట కాగ రేక స్త్రీపురుషులు యుద్ధములయందు సైనికులుగా చేరుటకన్న వేరు గత్యంతర మేమి కలదు? ట్రాన్సువాలునం దియ్యదికూడ ప్రారంభమైనది. స్త్రీపురుషులు యుద్ధములో చేరుచున్నారు.

ప్రభుత్వములు లేనిస్థితిని అరాజకమని యనుచో ప్రభుత్వము లుండుటవలన కలిగిన ప్రస్తుత దుస్థితికన్న మించిన అరాజక మేమి రాగలదు?

దేశభక్తియను భావదాస్యమునుండి విముక్తిని పొంది ఈ దేశభక్తి యను ఆచ్ఛాదనచే నడుచుచున్న ప్రభుత్వముల నంతమొందించనిచే మానవజాతికి మేలు కలుగజాలదు.

ఓ మానవులారా! మీరందరు యోచించుడు. మీ క్షేమమునకై, మీ శారీరకమానసికోన్నతికై ప్రయత్నములు సల్పుడు. సోదర సోదరీ మణుల క్షేమమునకై యోచింపుడు. మీ విరోధులు బోయర్లుకారు. ఆంగ్లే యులుకారు. జర్మనులుకారు, రష్యనులుకారు. కాని మీకు మీరే విరోధులు. ప్రభుత్వ నిర్మాణమునకు మీ దేశభక్తియే కారణము. మీరు నిర్మించిన ప్రభుత్వములే మిమ్ముల నణచియుంచి మిమ్ముల సౌఖ్యహీనులుగా చేసినవి.

ప్రభుత్వములు మిమ్ముల అపాయములనుండి రక్షించుటకు బాధ్యత వహించెను. ఆ రక్షణ బాధ్యతాఫలితములే మిమ్ముల బానిసలుగాచేసి మీ సర్వనాశనముకు కారణభూతమాయెను. ఇంకనూ మీ భార్యాపుత్రులతో సహా మిమ్ములను ఉరికంబముల కెక్కించువరకు వారా రక్షణ బాధ్యతను వదలుకొనరు.

ఎంతటి ఘోరకృత్యములనైనను వాటి పరిణామ మెటులయుండినను, మార్పేమియు లేకుండ ఈ ప్రభుత్వయంత్రము నడచుచునే యుండును. అంతియేకాదు. మరింత తీవ్రస్వరూపములో ప్రభుత్వములు ఆయుధధారులై మీరు మేల్కొనని జాగ్రత్త వహించిననే తప్ప, మిమ్ముల సర్వనాశన మొనర్చునిదే విడువవు. మిమ్ముల రక్షించుటకుగాని, దురంతముల నాపుటకుగాని ఎవరును మీకు తోడ్పడరు.

మీ ముక్తి కొక్కటే మార్గము కలదు. సర్వాధికారములు కట్టి కట్టి, ఒక్కని పరమొనర్చ అట్టి అధికారము వహించినవాడును, వాని పరంపరా వచ్చు వారును, తమ పరమైన అసాధారణాధికారములను నిల్పుకొనుటకై ఎంతటి ఘోరకృత్యములనైన చేయక వదలరు. నెపోలియనులు, మొదటి నికోలస్, బిస్మార్కు, ఛేంబర్లేన్, రోడ్స్, మరియు జారుచక్రవర్తిపేర అధికారమును నిర్వహించుచున్న రష్యా రాజ్యపు నియంతలు మొదలగువారందరు ఘోర దుష్కృత్యము లొనర్చుటయందు పేరుపొందినవారు, కాన మనల బంధించియున్న ఆ దేశభక్తి యను త్రాడు త్రెంచినచో మన కష్టములన్నియు గట్టెక్కగలవు.

మీ కష్టములకెల్ల కారణము మీరే. మీ ఉదాసీనతయే కారణము.

ఆ చక్రవర్తులు, ఆ రాజులు, ఆ శాసన సభాసభ్యులు, ఆ రాష్ట్రాధిపతులు, ఆ ధనికవర్గము, ఆ పీఠాధిపతులు, ఆ పత్రికాధిపతులు, ఎల్లరును నిరంకుశముగా ప్రవర్తించగల్గుటకు మీరే కారకులు. మీరు కష్టించి

పండించు పంటలను కడుపార మెక్కి, బలిసి, మిమ్ముల దేశభక్తిపేర మోసగించి జీవించుచున్నారు.

మీ రేదేశమునకు చెందినవారైననూ, ఏ రాజ్యాధికారమునందున్ననూ, మీ రేమతమునకు చెందినవారైనను, వ్యవసాయము, పత్తకము, ప్రకృతిశాస్త్రము లేక మరేవృత్తికి చెందినవారైనను మానవప్రకృతిలో భేదము లేదు. సౌఖ్యము, సంతోషము ప్రతివారును కోరుదురు. కాన మీరందరు పరస్పర సోదరభావము కలిగి, మీ మీ ఉత్పత్తి వస్తువులను విక్రయించుకొనుచున్నట్లే మీలో పుట్టు పరస్పర భిన్నభావములనుకూడ ఒకరికొకరు యిచ్చి పుచ్చుకొనుచుండుట మూలమున అతిశయ సౌఖ్యమును మీరు పొందగల్గుదురు.

అయితే, ఆ కోటలు, ఆ వాడరేవులు ప్రభుత్వములు కూలత్రోయబడినపిమ్మట ఎవరి స్వాధీనమందుండవలెనను చింత మీకు వలదు. వాటినిగూర్చి యోచించ మొదలిడుచో మీ ప్రభుత్వములు, యుద్ధములు, యుద్ధములయందు పాల్గొనుటకై మీరు ప్రోత్సహింపబడుట, అటుల ప్రోత్సహింపబడి, మీరా యుద్ధములలో పాల్గొనినచో ఇతర రాజ్యములవారి ధనరాసులను కొల్లగొట్టి తెచ్చుట, ఆ తెచ్చిన ధనరాసుల తిర్గి శత్రువులు అపహరింపకుండ రక్షించుకొనుటకు మీరాయుధపాణులై నిల్చుట - ఈ ప్రకారం పాత పురాణమంతయు తిరిగి ప్రత్యక్షమగును. కాన అవి ఎవరి వశమందుండుననిగాని, ఏమైపోవుననిగాని చింతవలదు. మీ యిష్టము వచ్చిన దేశమునందు నివసించు హక్కు మీకు కలదు. ఏదేశమైనను ఒక్కటియని భావించవలెను. నాదేశము, నాదేశమను భావములు నీలో రేకెత్తనిచ్చుచో నీ దేశరక్షణకై పరదేశముల కొల్లగొట్టవలెనను భావములు వెనువెంట బయలుదేరును. అప్పుడే ప్రభుత్వములు, సైన్యములు ప్రత్యక్షమగును. ఈ ప్రభుత్వముల ఉనికి యంతయు దేశభక్తిపై నాధారపడి యున్నదని పైన పేర్కొనియుంటిమి. దౌర్జన్యములపై నాధారపడి నీపై

సవారిచేయు ఆ ప్రభుత్వముల బానిసత్వము పటాపంచ లొనర్చుటకు దేశ భక్తియను సంకుచిత భావమును వదలుము. మానవుల మధ్య పుట్టి, మానవులలో పెరుగుచుండు మీరందరు ఏకజాతీయులగుట, మీరందరు సోదరులు. కాన సర్వమానవ సోదరభావమును మీలో పెంపొందించు కొనుడు.

ఆ యా దేశములకు చెందినవారము గామనియు, ఆ యా ప్రభుత్వాధికారమునకు లోబడినవారము గామనియు, భగవంతు డొక్కడేయని ఎల్ల రంగీకరించిన విషయమగుట మనమందరము ఆ సర్వేశ్వరుని పుత్రులమనియు తెలిసికొని, ఆ సర్వమానవ శ్రేష్ఠుండగు వానిపుత్రులమగు మనము తోడిమానవుల బానిసలముగా ఉండుట ఎంత హీనమో తెలుసుకొనిన జాలును. ఆ వెర్రెత్తిన, అనవసరపు త్రుప్పుపట్టిన ఉపద్రవకరమగు ప్రభుత్వ సంస్థలు, ఆ దౌర్జన్యములు, ఆ అమానుష చర్యలు, ఆ నేరములు మేఘములవలె విడిపోవును.





# మూడవ ప్రకరణము

## సాంఘిక సంస్కర్తల కొరకు విజ్ఞప్తి

నేను కార్మికుల కొరకు విజ్ఞప్తి గావించియుంటిని. ఆ విజ్ఞప్తియందు "ప్రస్తుత నిర్బంధమునుండి కార్మికులు రక్షింపబడవలెనని, ప్రస్తుత జీవన విధానమునందలి స్వార్థపరత్వమునశించవలెను. ఇరుగుపొరుగు వారితో పోరాడుట మానవలెను. నీయం దితరు లెట్లు ప్రవర్తింపకోరుదువో నీ వితరులయందట్లు ప్రవర్తించవలెనను పెద్దలవాక్యము ననుసరింపవలెను" అని తెల్పియుంటిని.

కాని నేనంతకుముం దూహించినట్లే నా అభిప్రాయములతో నేకీభవించని కొంద రప్పుడే విమర్శనలకు గడంగిరి.

ఇదంతయు భ్రమ. అసంభవము. ఒక చెంప మానవ సంఘమునందు చెడుగు కాన్పించుచుండ, మరొక చెంప దుర్భర దారిద్ర్యముచేతను దౌర్జన్యయుత నిర్బంధములవలనను, అష్టకష్టములు పడుచున్న మానవులందరు సత్పురుషులుగా మారువరకును ఊరక చూచుచుండవలసినదేనా ? యని వారల విమర్శనలయొక్క సారాంశమై యున్నది.

ఆచరణయోగ్యము కానట్లు కాన్పించుచున్న నా విధానము ఆచరణయోగ్యమే గాక, ప్రస్తుత సాంఘిక లోపములు తొలగుటకు ప్రకృతి శాస్త్రవేత్తలు తెల్పుచున్న విధానములకన్న, బహుశ్రద్ధతో గమనింపదగినదని యిందు నిరూపింపదలచుచున్నాను. ఉత్తమమాటల సమారాధనతో తృప్తిపడువారి కొరకుగాక, మనఃపూర్తిగా మానవసేవచేయు కుతూహలముగలవారి నిమిత్తము నేను వ్రాయుచున్నాను. అట్టివారికొరకే ఈ వ్యాసమున విజ్ఞప్తి గావించబడినది.

సాంఘిక కట్టుబాట్లపై నాధారపడిన మానవసంఘము, అసాంఘికపు కట్టుబాట్లయందు దెప్పు డేయేమార్పులు జరిగిన తదనుగుణముగా తమ తమ జీవన విధానములను మానవులు మార్చుకొనుచుందురు. ఒకానొక కాలమునందు మానవులుకూడ పశువులనుభవించుచుండు స్వేచ్ఛవంటి స్వేచ్ఛను కలవారై, తమలో తాము చంపుకొని తినుచుండిరి. కొంతకాలమునకు ఆ పద్ధతి క్రమముగామారి, ఒకని యధికారమునకు తలయొగ్గుపద్ధతి వచ్చెను. అటుల ఒకని అధికారమునకు లోబడుట సంతోషకరమైన విషయముగా భావించియుండిరి. మరికొంతకాలము గడిచిన పిమ్మట ప్రజల ప్రాణ, మాన, ధనముల భద్రతకొరకొక సంస్థయుండు టవసరమనియు, అట్టి సంస్థ స్వీయలాభములకుగాక, ప్రజాసౌకర్యముల నొనగూర్చు నిమిత్తము ఆ సంస్థకు కొన్ని అధికారము లుండుట అవసరమనియు భావింపబడెను. ఈ ప్రకారము క్రమముగా రాజ్యములు, సామ్రాజ్యములు, ప్రజాసంస్థలు, ప్రజాస్వామ్య ప్రభుత్వములు ఒకటివెంట నొకటి మార్పు చెందుచూ నేటికి పరిశ్రమలన్నియు వ్యక్తుల అధికారములనుండి తొలగించి జాతియొక్క సమిష్టి ఆస్తిగా పరిగణింపబడవలెనను ఆందోళన గావించు స్థితికి వచ్చితిమి.

పరస్పర భిన్నముగా కాన్పించు ప్రతిమార్పును ప్రజలపై అమలు పరచు నిమిత్తము ప్రభుత్వములు శాసనములద్వారా ప్రజల నిర్బంధించుచూ, అవసరమగుచో అధికార బలమునుకూడ చవిచూపుచుందురు. ఇట్టి అధికారమే నేటికికూడ పనిచేయుచున్నది.

ప్రజలు తమలోతాము కలహించకుండుటకును, ధన ప్రాణముల రక్షణనిమిత్తము కొద్దివ్యక్తులతోకూడిన ఒక సంస్థను నేర్పరచి ఆ సంస్థకు సర్వాధికారములు ఒప్పగించుచో ప్రజలందరికి సర్వసౌఖ్యములు సమకూరునని ఆకాలమునందు తలంచబడెను. ఈనాడుకూడ యిట్టి సంస్థలుండుట అవసరమనియే తలంచబడుచున్నది. ప్రజలను నియమబద్ధుల గావించుటకు

సర్వాధికారములుగల ప్రభుత్వము లుండుట అవసరమని విప్లవకారులు, స్వామ్యవాదులుకూడ అంగీకరించుచున్నారు. కాని ప్రస్తుత ప్రభుత్వవిధానములో లోపము లున్నవనియు, ఆ లోపములు తొలగింపబడిన చాలుననియు అనుచున్నారు.

మొదటినుండి నేటివరకు మానవసంఘమును ఎదుర్కొనిన గొప్ప సమస్య యియ్యదియే. ప్రభుత్వ శాసనములను స్వబుద్ధిచేగాక ప్రభుత్వపు ఒత్తిడికి లోబడి తలయొగ్గిన కొందరాశాసనములు తమ అవసరములకు చాలియుండలేవనియు, మంచివిగా అంగీకరింపనొల్లకయు ప్రభుత్వముపై తిరుగుబాటొనర్తురు. అధికారమందున్నవారి నాస్థానమునుండి తొలగించి (తిరుగుబాటుదార్లు) తామా స్థానమాక్రమింతురు. తామధికారమునకు వచ్చినందులకు మంచిపద్ధతులపై ప్రజాశాంతిరక్షణలు చేయుదుమని ప్రకటించు కొందురు. అధికారపదవులందధిష్ఠించగనే అధికారమదాంధతచే తమవిధుల నతిక్రమించి స్వార్థపరులై తమ అధికారబలమును ప్రజాక్షేమ కార్యములయందు వినియోగించుటకు బదులుగా తమ పదవులను నిల్పుకొనుటయందే వినియోగించిరి. ఈ ప్రకారము ప్రతితిరుగుబాటునందును క్రొత్తవారికన్న ప్రాతవారే మేలనుకొనునట్లు మరింత అన్యాయములు, అక్రమములు గావించిరి. ఇట్టి తిరుగుబాట్లయందు అంతవరకు అధికారమందున్నవారే జయించుట తటస్థించుచో ఇక ఆ తిరుగుబాటుదార్లతోబాటు ప్రజలనుకూడ ప్రభుత్వములు క్రూరముగా హింసించుచుండెడివి.

గత ౧౯ వ శతాబ్దములో యూరప్‌ఖండమునందు జరిగిన పోరాటము లన్నియు విప్లవములకు సంబంధించినవే. క్రీ. శ. ౧౮౫౦-౧౯౦౦ వరకు జరిగిన విప్లవములందు చాలావరకు విప్లవకారులే జయించుచూ వచ్చిరి. కాని అధికారము వహించిన తిరుగుబాటుదార్లు ప్రజలకు కల్పించిన క్రొత్త సౌకర్యము లేవియు లేకపోవుటయేగాక, తమ అధికారమును చిరస్థాయిగా చేసుకొనుటయందును, తిరిగి యిట్టి విప్లవములు జరుగకుండు

నట్లును తగు కట్టుబాట్లొనర్చుటయందే నిమగ్నులై తమ కాలమునంతయు వినియోగించిరి. ప్రజ లికముం దిట్టి విప్లవముల గూర్చి ఊహించుటకు కూడ నలవిగానంత కట్టుదిట్టము లొనర్చుకొనుటయందు తమ అధికార దుర్వినియోగము విస్తారముగా గావించిరి. మానవులపైననేగాక ప్రకృతిని కూడ తమ స్వాధీనపర్చుకొనిరి. ప్రజల అపార ధనరాసుల కొల్లగొట్టుటయేగాక సమర్థులగువారిని సైనికులుగా చేర్చుకొని సైనికబలమును వృద్ధి గావించిరి. ప్రజలను ఎల్లకాలము తమ అధికారమునకు లోబడియుండుటకై ప్రజల ఆధ్యాత్మిక జీవనముపై అధికారము కలిగియుండుట అవసరమని తలంచిరి. ఇందుకొరకై పత్రికలను, మతాధికారులను, విద్యావిధాన నిర్ణయ హక్కులను తమ అధికారముక్రిందకు తీసుకొనిరి. ఈ ప్రకారము వారు గావించిన కట్టుబాట్ల ఫలితముగనే క్రీ.శ. ౧౮౪౮ సంవత్సరమునకు పిమ్మట జరిగిన ఏ విప్లవముకూడ జయప్రదము కాజాలకపోయెను.

ఈ కాలపు వింతలలో వింతయైన విషయ మేమన, ఇంతకు ముందు అధికారమం దున్నవారెవ్వరును, ఎంత బలవంతులుగా ఉండినను, ప్రజల ఆధ్యాత్మిక జీవన విధానమునం దెట్టి మార్పులను గావించ ప్రయత్నించియుండలేదు. ప్రజల నైతిక, పారమార్థిక, మతవిశ్వాసములయందుగాని, విద్యావిధానములందుగాని ఎట్టిజోక్యమును కలిగించుకొనియుండలేదు. ఇప్పు డివన్నియు ప్రభుత్వమువారి చేతులలో నున్నవి. రహస్యాపరాధ పరిశోధకులు,గూఢచారవర్గము, పత్రికాధిపతులను లంచములిచ్చిస్వాధీనమందుంచుకొనిరి. రైళ్ళు, తంత్రీవార్తా మందిరములు, శబ్దవాహక తారాయంత్రములు, ఛాయాచిత్రగ్రహణయంత్రములు, వీటితో పాటు అపార ధనరాసులు సమకూర్పబడినవి. తమ పాటకు ప్రచాతాళము వేయువారినే సిద్ధము చేయుటకై రాబోవు సంతతి యొక్క విద్యావిధాన నిర్ణయాధికారముకూడ వారిచేతియందే యుంచుకొనిరి. వీటినన్ని

చేనిని తలతన్ను విషయము మరొకటి కలదు. అపార సైన్యములు ప్రభుత్వముల అధీనమందున్నవి.

రాజ్యాధికారి ఎంతటి అసమర్థుడు, తెలివితక్కువవాడైనను ఏమాత్రము శ్రమలేకనే ఎంతటి విప్లవమునైనను క్షణములో అణచివేయగల్గినంత కట్టుదిట్టములు గావింపబడినవి. ఇవ్విధముగా విప్లవకారులు చేయు ప్రయత్నములు ప్రభుత్వములు మరింప బలపడుటకే తోడ్పడినవి. కాన ప్రస్తుతప్రభుత్వ వ్యూహమును ఛేదించు మార్గమేది? ఒక్కటే సాధనము కలదు. సైనికులుగా చేరు ప్రజలు తమకు పరోక్షముగా జరుగుచున్న అన్యాయములు, అక్రమములు, అపాయములు గ్రహించి ప్రభుత్వముతో సహాయ నిరాకరణము చేయవలెను. కాని ప్రభుత్వములు మాత్రము సామాన్యపు తెలివికలవియా! ప్రభుత్వములు తమ ఉనికికి సైన్యములే మూలాధారములని మొదటనే గ్రహించెను. ఎట్టి ప్రబోధముగాని, ప్రచారముగాని సైనికుల దరిచేరకుండుటకును, ఎంతటి ప్రజ్ఞావంతుడుకూడ సైనికుని కలియుటకు వీలులేకుండను తగు కట్టుదిట్టము లొనర్చిరి. ఎట్టివాడైనను, అతని రాజకీయాభిప్రాయము లెట్టివైనను సైనికుడుగా చేరిన వెంటనే ఏమాత్రము అధికార ధిక్కార ప్రయత్న మొనర్చినట్లు అనుమానింప బడినను కనుమూత కాలములో కాలునింట కాలిడవలసినదే. ప్రభుత్వము ౨౦ సంవత్సరముల వయస్సుగల బాలురను సైనికులుగా చేర్చుకొని దొంగసిద్ధాంతముల బోధించి దేశభక్తియను మత్తుమందు చల్లుదురు. తలిదండ్రుల మాట జవదాటని పసిపిల్లవానివలె వారి స్వీయాభిప్రాయము లెట్టివైనను ప్రభుత్వాజ్ఞల శిరసావహించుదురు. ఒక సంవత్సర కాలము గడచునప్పటికి సైనికుడు తనవ్యక్తిత్వమునే మరచి ప్రభుత్వము చేతిలోని పనిముట్టుగా మారిపోవును. ఎక్కడనో, ఎన్నడో ఒకడు ప్రభుత్వధిక్కార మొనర్చగలిగిన సైనికుడుండిన నుండవచ్చునుగాని అయ్యది అంత ప్రధాన విషయముకాదు. యూరప్ ఖండమందలి ప్రభుత్వ

ములు స్థిరముగా నుండగోరుచో (వారు కోరునదదియే) సైన్యముల పోషింపక తప్పదు. సైనికబలమును తగ్గించుట యన తమ నిరంకుశాధికారమును, రాజరికమును తగ్గించుకొనిన ట్లగును. కాన సైనికసంఖ్యను తగ్గించనొల్లరు. ఇట్టి పరిస్థితులలో తిరుగుబాట్లొనర్చు ప్రయత్నముల ఫలితము వేలకొలది అమాయక ప్రజలు చచ్చుట తప్ప వేరొండు కాజాలదు. అంతియేగాక ప్రభుత్వ నిరంకుశత్వము మరింత బలపడును. ఉత్సాహోద్రేకములకు లోనై పూర్వ మెప్పుడో సాధ్యమైనదని యిప్పుడుకూడ సాధ్యమగునను భ్రమకు లోనై విప్లవకారులు, స్వాప్నికవాదులు నిజమును గ్రహించజాలకున్నారు. కొందరు దీనిని (విప్లవమును) వృత్తిగా పెట్టుకొనిరా ఏమి? యను ననుమానము కలుగుచుండును. కాని చరిత్రాంశముల గమనింపగలవారు ఈ మనకాలమున విప్లవము గాంచుట అసాధ్యమని అంగీకరించక తప్పదు.

ఇప్పటి ప్రభుత్వముల నడకయందే మార్పు గాన్పించుచున్నది. కాన నేటి ప్రభుత్వముల మార్చదలచువారుకూడ తమ మార్గములను మార్చుకొనకతప్పదు.

పూర్వము జరిగిన తిరుగుబాట్లయందు తిరుగుబాటుదారులు ప్రభుత్వమును కూలద్రోయుటయు, ఆ ప్రభుత్వ స్థానమును తిరుగుబాటువారు లాక్రమించుచుండుటయు జరుగుచుండెను. అనగా ఒకప్పుడు తిరుగుబాటుదార్లనబడినవారే అధికారమునకు వచ్చినప్పుడు ప్రభుత్వవర్గము వారనబడుచున్నారు. ఈ ప్రకారం ఒకటితరువాత నొకటిగా యిప్పటికి చాలా విప్లవములు జరిగియుండెను. కాని యాభై సంవత్సరముల క్రిందట ప్రభుత్వములు మారుట అసంభవములగునట్లు కట్టుబాట్లొనర్చిరి. ప్రభుత్వశక్తి విజృంభించుచున్నకొలది పరస్పర విరుద్ధకార్యము లొనర్చుచుండుటయు జరుగుచుండెను. స్వార్థము, దౌర్జన్యములతో కూడిన అధికారము ఎంతటి జాగ్రత్తతో అమలుపర్చబడినను ప్రమాదములకు లోనైతీరునని ధ్రువపడు

చున్నది. అధికారము దుర్వినియోగపడకుండ నుండవలెనన్న అధికారము సత్పురుషుల చేతులయందుండు టవసరము. కాని మొదటినుండియు అధికారము దుష్టుల వశమునందే యుండుచూ వచ్చెను. అధికారము, దౌర్జన్యముతో కూడినదగుటను, యిరుగుపొరుగువారితో కలహములకు పురి కొల్పునదగుటను సత్పురుషులైనవారు అధికార పదవుల నొల్లకుండిరి. అధికారము వహించినను తామా పదవులను ఎంతో కాలమునిల్పుకొన జాలియుండలేదు.

ఈ చిక్కు లెల్ల రెరింగినవే. ఈ ప్రభుత్వముల ఆడంబరములకు, అధికారములకు, భయంకరకృత్యములకు తామే కారకులమనియు, తమ మౌనమువలన కలిగిన ఫలితములనే తామనుభవించుచున్నట్లును ప్రజలు గ్రహించగలుగుటకు వేల సంవత్సరములు పట్టెను. ఈ గొడవకంతకు కారణము అసలీ ప్రభుత్వ నిర్మాణమునకు తాము మొదట అంగీకరించినదాని ఫలితమని ప్రజలు తెలుసుకొనిరి. ప్రభుత్వములు ప్రజలను బెదరించి అదుపు నందుంచుకొని, ప్రజల ధన, మాన, ప్రాణాపహరణములకు ప్రయత్నించు చున్నట్లు ఈ రాజులు, చక్రవర్తులు, మంత్రులు, న్యాయాధీశులు, ఇదితరులు యావన్మందియు తమతమ పదవులయం దంటిపెట్టుకొనియుండు ప్రయత్న ములుతప్ప తమ కుపయోగకరములగు పనులేవియు చేయుజాలరని ప్రజలు బాగుగా గ్రహించుచున్నారు. సత్పురుషులకు బదులు దుష్టు లధికారము వహించియుండుటవలన సత్ఫలితము లాశించుట వృథాయని తెలుసుకొనిరి. అధికారమును కొద్ది వ్యక్తుల పరమొనర్చి, ఆ వ్యక్తుల ఆజ్ఞలను భక్తి శ్రద్ధలతో దేవతాప్రసాదమని భావించి స్వీకరించిన ప్రజలే, నేడు ప్రభు త్వములనిన ఎడమొగము పెడమొగము పెట్టుచుండుటయేగాక, అసం తుష్టి, అసహ్యత వెలిబుచ్చుచున్నారు. ఈ ప్రభుత్వముల పటాటోపము ఫలితముగా, మనలనందరిని ఎన్నడో ఒకనాడు ఉరికంబముల కెక్కిం చుటతోగాని ముగియదని ప్రజలు గ్రహించిరి.

క్రమముగా ప్రజలలో అసంతుష్టి పెరుగుచున్నను తలయొగ్గు నట్లు చేయునది ఎన్నిక సభ్యులయందలి గౌరవముగాని ప్రభుసంతతికి చెందినట్లు విర్రవీగు ప్రభువులయందలి భక్తివలనగాని కాదు. కేవలము పశుబలముతో కూడిన దగుటచే, క్రూరనిర్బంధవిధాన మవలంబించుటకు వెనుదీయనిదగుటచే లొంగుచున్నారు, ప్రజావిశ్వాసము కొల్పోయిన ప్రభుత్వములు కేవలము నిర్బంధవిధానములపై నాధారపడక తప్పదు. తత్ఫలితముగా ప్రజలమధ్య అసంతుష్టి పెరుగుచునే యుండును.

ప్రభుత్వములా ! జయింపసాధ్యముగానివి. ఆ ప్రభుత్వములు ఎన్నికలపై నాధారపడిన ప్రజా ప్రాతినిధ్య ప్రభుత్వములుగావు. కేవలము పశుబలముపై నాధారపడిన నిరంకుశ సంస్థలు. ప్రజలు దీనిని గ్రహించియు గత్యంతరము లేక తలలొగ్గుచున్నారు

దాదాపు ఒక శతాబ్దముసుండి ఎనగా ప్రభుత్వమనునది పూర్తిగా నిరంకుశసంస్థలుగామారి తమగౌరవమును పోగొట్టుకొనుటయు, ప్రజలకు ప్రభుత్వములయందు భక్తి సన్నగిలుటయు ప్రారంభించిన నాటినుండి కొద్దివ్యక్తులు తమపై నిరంకుశాధికారము వహించుటచే ప్రజలు, తమ అంతరాత్మప్రేరణ కనుగుణ్యముగా పన్నులనిచ్చుట, మానుట; సైనికులుగాచేరుట, మానుట; యిరుగుపొరుగు రాజ్యములవారితో సఖ్యముగా ఉండుట, మానుట యను నిర్ణయముల గావించుకొను హక్కు తమకు గలదని ప్రతిమానవుడు గ్రహించగల్గుచున్నాడు. ఇట్టి స్వాతంత్ర్యము గోరుచో వ్యక్తుల పరిపాలన అధికారము పోవలెను.

తామూహించుచున్నట్లు ప్రభువులు భగవదంశ సంభూతులు కారనియు, వ్యక్తులు కొందరు తమపై అధికారము చేయగల్గుట భగవదాదేశము వలన కాదనియు, కేవలము నిరంకుశమనియు నేడు స్పష్టమైనది. పరిపాలనాధికారము ఒకానొకవ్యక్తి హస్తగతమైయున్నను, లేక మరెందరధికారము వహించినను అది వ్యక్తిపరిపాలన యనిపించుకొనును. అందు

స్వాతంత్ర్యముండదు. ప్రజలు నిరంకుశముగా అణచియుంచబడుదురు. కాన ప్రభుత్వాధికారములను రూపుమాపవలసియే యుండును.

అయితే దానిని రూపుమాపుటెట్లు ? అధికార నిర్మూలన మొనర్చిన పిమ్మట ప్రజలు తమలోతాము కలహించుకొని చంపుకొనకుండ నుండు మార్గమేది ? యను రెండు ప్రశ్నలకు సమాధానము కావలసియున్నది.

ప్రభుత్వశక్తిని కూలద్రోయుట యనునది పశుబలమువలన సాధ్యముకాదనియు, మానవులమధ్య ప్రభుత్వములవలన కలుగు హానిని, నష్టమును బాగుగా ప్రబోధమొనర్చి ప్రజలను విముఖులుగాచేయుటమూలముననే సాధ్యమగుననియు, అరాజకులనబడువారుకూడ మొదటి ప్రశ్నకు ఏకగ్రీవముగా జవాబిడుచున్నారు. అది ప్రభుత్వమనునదిలేకుండ సంఘము కట్టుబాట్లతో నియమబద్ధముగానుండునట్లు చేయుటకు మార్గమేది ? అను రెండవప్రశ్నకు పలువురు పలువిధములుగా చెప్పుచున్నారు.

క్రీ. శ. ౧౮ వ శతాబ్దాంతమునందును ౧౯ వ శతాబ్దాదియందును జీవించియున్న గాడ్విన్ యను నాంగ్లేయుడున్నూ, ప్రౌధ్యాన్ యను ఫ్రెంచివాడున్ను మొదటిప్రశ్నకు, ప్రజాప్రబోధముచేతనే ప్రభుత్వములంత మొందించ వచ్చుననియు, ప్రజాశాంతి న్యాయము అధికారముతోకూడిన ప్రభుత్వ సంస్థలచే కొంతకాలము సక్రమముగా నిర్వహింపబడినచో క్రమముగా, అధికారముతోకూడిన ప్రభుత్వ సంస్థలు లేనప్పుడే శాంతిగా, న్యాయముగా జీవించగలమని ప్రజలు తలంతురనియు, అటుల తలంచినంతనే ప్రభుత్వసంస్థలు క్రమేణా కూలిపోగలవనియు చెప్పుచున్నారు.

అయితే ప్రభుత్వములు కూలద్రోయబడిన పిమ్మట ప్రజలు తమలో తాము కలహింపకుండ సంఘమును నియమబద్ధముగా నుంచుటెట్లు? అను విషయమై ప్రజలే, పరస్పరప్రేమకలవారై న్యాయపథానువర్తులగుటయే శాంతిభద్రతలకు మార్గమని గ్రహించి తదనుగుణ్యముగా ప్రవర్తింతురను చున్నారు.

మరికొందరు అరాజకనాయకులు ప్రజాప్రబోధమొక్కటే చాల దనియు, ప్రభుత్వములపై తిరుగుబాటొనర్చవలసి యుండుననియు, అందు కొరకు ప్రజలను తయారుచేయుట అవసరమనియు అనుచున్నారు. ఇక రెండవప్రశ్నకు జవాబుగా ప్రభుత్వ సంస్థలను కూలద్రోసినపిమ్మట ప్రజలు తమంతట తామే పరస్పర స్నేహ సహకారములతో శాంతియుత జీవనము గడుపగల్గుదురనుచున్నారు.

ప్రభుత్వమును కూలద్రోయువిధానమునుగూర్చి, జర్మను దేశీయుడగు మాక్సుస్టిర్నర్, అమెరికా దేశీయుడగు టక్కరు ఉభయులును దాదాపు పైవారి అభిప్రాయములతో నేకీభవించిరి. ప్రజలు తమ ఆత్మ ప్రేరణ (Inner voice) కనుగుణ్యముగా ప్రవర్తించుచూ, తమదానిసత్వమునకు కారకులైన ప్రభుత్వవర్గములను ధిక్కరించుచుండుటద్వారా ప్రభుత్వసంస్థలను స్తంభింపచేయవచ్చుననియు, ప్రభుత్వముతో సహాయ నిరాకరణము గడంగవలసియుండుననియు అనుచున్నారు. ఇక రెండవ ప్రశ్నకు వారు తెల్పినదేమన పై చెప్పిన విధమును నాచరించి ప్రజలు ప్రభుత్వ నిరంకుశత్వమునుండి విముక్తిపొందగనే తమతమ మనస్సాక్షి కనుగుణ్యముగా జీవన విధానము మార్చుకొనవలసియుండుననియు, అటుల మార్చుకొందురనియు, తద్వారా అన్యోన్యత, ప్రేమ ప్రజలలో పెంపొందుననియు చెప్పుచున్నారు.

పైన వివరింపబడినవాటియం దొకసత్యము కలదు. దౌర్జన్యముతో కూడిన ప్రభుత్వశక్తిని కూలద్రోయుగల్గిన శక్తియున్నప్పుడే ఆ ప్రభుత్వములను కూలద్రోయుట సాధ్యమగునుకదా! అట్టి శక్తియుండి ఆ ప్రభుత్వములను కూలద్రోయగల్గి పిమ్మటకూడ ఆ శక్తి అటులేనిలచియుండక ఎచ్చటికిపోవును? పోదు. అయితే ఆ ప్రభుత్వశక్తిని నిర్మూలమొనర్చుటకు ప్రజలశక్తి నిరుపయోగకరమైనదనియు, హానికరమైనదనియు గ్రహించి ఆ ప్రభుశక్తికి తలయొగ్గుటగాని, అందు పాల్గొనుటగాని కూడ

దని గ్రహించినప్పుడే సాధ్యమగును. మరియు ప్రేమతోకూడిన మన స్సాక్షి కనుగుణ్య ప్రవర్తన నవలంబించుటవలననే నిది సాధ్యమగును అయితే ఏ ఏ విషయములకు ఈమనస్సాక్షి నెటుల ననుసరించవలెను ? సార్వజనికశ్రేయము, న్యాయము, అభివృద్ధి, వ్యక్తిగతలాభములు వీటిని గూర్చిన విషయములయందు ఐక్యతసాధించవచ్చునని అరాజకు లందురు. అయితే అన్నిటివిషయమటుంచి వాటిలోని ఏ ఒక్కవిషయమునందైననూ మానవుల మనస్సాక్షి ఏకరీతిగా యుండుననుట కాధారములేవి ? భిన్న భావములు, భిన్న ఆశయములుగల మానవులు ఏకాభిప్రాయమునకు రాగలుగుదురనుట అసంభవము. అంతియగాక సార్వజనికక్షేమము, అభివృద్ధి, న్యాయము, స్వాతంత్ర్యము లనువాటిని దృష్టియందుంచుకొని ప్రభుత్వ నిర్బంధములనుండి విముక్తిని పొందిన మానవులు స్వార్థమును త్యజించవలెనను పరమార్థ చింతకలవారుకానిచో పరస్పర సంఘర్షణ లేకుండ సంఘీభావముతో మెలంగుదురనుట సందేహాస్పదమగు విషయము. మాక్సుస్టిర్నరు, టక్కరుగార్ల సిద్ధాంతము ప్రకారం ప్రతి వ్యక్తియు స్వీయాభివృద్ధికి ప్రయత్నించుట మూలముగా పరస్పర సఖ్యత పెంపొంద గల్గుననుట కేవలము అస్వాభావికమేగాక అసంభవ విషయ మనవచ్చును.

కాన ఆత్మశక్తియను బలవత్తర సాధన మొకటి గలదనుటయు, అద్దానిచే నెంతటి నిరంకుశ ప్రభుత్వములనైననూ కూలద్రోయ వచ్చు ననుటయు నిస్సందేహము. మత విశ్వాసములేక ప్రకృతిపై నాధారపడు అరాజకవాదులు ఈ యాయుధము నెరుంగరు. వా రూహాప్రపంచమునందు ప్రయాణ మొనర్చుచూ, ఆత్మశక్తియం దిమిడియున్న ప్రభావ మెరుంగని వారగుట ప్రాతిపద్ధతులగు దౌర్జన్యయుత విప్లవముల గూర్చియే యోచించు చుందురు.

ఈ ఆధ్యాత్మికశక్తి నేటిదికాదు. మానవులు చిరకాలము క్రిందటనే దీనిని గ్రహించిరి. సక్రమపద్ధతులపై ఈ ఆయుధ ప్రయోగము గావించినవారందరును లొంగుబాటునుదెరుగంగక సంపూర్ణ విజయమును బడయగల్గిరి. ఈ ఆయుధమును చేపట్టవలచువారు తెలుసుకొనవలసిన విషయ మొక్కటికలదు. అఖండ సచ్చిదానందస్వరూపములో అణుమాత్రుడనియు, ఈ అణువు (మానవుడు) ఆ సచ్చిదానంద స్వరూపములో లీనముగా దలంచుచో, అఖండ సచ్చిదానంద స్వరూపుడగు ఆ భగవంతుని ఆజ్ఞయ మాత్రమే శిరసావహించి ఆచరించదగినవని తెలుసుకొన వలసియుండును. అంతరాత్మకు వ్యతిరేకమగు నెట్టి మానవ శాసనములకు తలయొగ్గరాడదు.

అందరిని ఏకముఖము గావించగల్గిన దీపురవిశ్వాస మొక్కటియే. ప్రభుత్వశక్తిని నెదుర్కొనగల్గుటకు, నాశనము గావించుటకు ఇదొక్కటియే సాధనము.

దౌర్జన్యముతో నెట్టి సంబంధము లేకుండగనే ప్రేమ, న్యాయముతో కూడిన సక్రమ జీవితము గడుపగల్గుట కిదొక్కటే మార్గము.

ప్రభుత్వములు జయింపరాని స్థితియందున్నవనియు, దౌర్జన్య పద్ధతులద్వారా కూలద్రోయుట అసంభవమనియు గ్రహించగల్గుచున్నారు. కాని, ఈ ప్రభుత్వము లింత హానికరముగా పరిణమించుటకు కారణము ఆ ప్రభుత్వాధికారము వహించినవారి దుష్టబుద్ధియే కారణమని తెలుసుకొనజాలకపోవుట ఆశ్చర్యకరమైన విషయము. కాన మారవలసినది, నశించవలసినది అధికారవాంచ, దుష్టబుద్ధిగాని వ్యక్తులుకాదు.

మానవులు దీనిని గ్రహించ మొదలిడిరి. కాన మానవులలో సత్ప్రవర్తన పెంపొందు మార్గాన్వేషణము చేయవలసియున్నది. అసంఖ్యాక జనులను మతము, ఆత్మవిచారమువంకకు బుద్ధిని మరల్చుటకు ప్రయత్నించవలెను.

కాన ఆత్మవిచారముతో కూడిన మతబోధను మానవుల కంద జేయుచో, ప్రజలను ఆందోళన పర్చుచున్న సమస్యలెన్నియో పరిష్కరింప బడగలవు.

మానవులందు సత్ప్రవర్తన మతవిశ్వాసము పెంపొందనిచో, తమ్మణచిపెట్టిన నిరంకుశాధికారము తొలగజాలదు.

అహంకారముతో కూడిన జీవితముపై రోతచెంది సోదర మానవ సేవ చేయవలెనను నిశ్చయముతో నున్నవారలకు నేను చెప్పదలచిన దిదియే. ప్రభుత్వవర్గముతో చేరి తద్వారా ప్రజాసేవ చేయదలచువారు తెలుసుకొనవలసిన విషయ మొకటికలదు. పశుబలముపై నాధారపడి నడపబడుచున్న ప్రభుత్వములన నెట్టివి ? అని మీలో ప్రతిఒక్కరును ప్రశ్నించుకొనుడు. మీకు మీరే పై ప్రశ్నను వేసుకొని యోచించినచో దౌర్జన్యములు, దోపిడులు, హత్యలపై నాధారపడనట్టియు, కావించనట్టియు, కావించ తలపెట్టనట్టియు, ప్రభుత్వము లేనేలేదని తెలుసుకొనగలుగుదురు.

అమెరికా విలేఖరి యొకడు ప్రభుత్వధిక్కార మొనర్చుట ప్రతి మానవుని విధియను నొక వ్యాసమును వ్రాసి, అందు అమెరికా ప్రభుత్వమునకు తాను చెల్లించవలసిన రూ. ౩౪౦ యివ్వ నిరాకరించిన విధమును తెల్పుచు నీగ్రోజాతివారిని బానిసలుగా చేసి నిర్బంధించుచున్న ప్రభుత్వమునకు తోడ్పడజాలనని వ్రాసియుండెను. ఒక్క అమెరికా దేశీయుడే యన నేల ? ఆ ఒక్క అమెరికాయందేనననేల ? చీనా దేశీయులకు నల్లమందు నలవాటుచేసినట్టి, బోయర్లపై అమానుషచర్య జరిపించినట్టి ఇంగ్లాండు ప్రభుత్వము, ఆయుధబలముచే ఫ్రాన్సువారొనర్చు ఘోరములకు వారలపైకూడ పన్నుల నిరాకరణ పద్ధతి నేల యవలంబింపకూడదు ? నిజముగా మానవ సేవ చేయు నభిలాషగలవారు, ప్రభుత్వమన నేమియో గ్రహించినవారు ఫలితము లెప్పుడు విధానము ననుసరించియుండునను పద్ధతి ననుసరించి ననేతప్ప, ప్రభుత్వముతో సహకార మొనర్చజాలరు.

కాన ప్రభుత్వవర్గములతో చేరి ప్రజలకు మేలొనగూర్చ దలచువారు వాస్తవమున కెట్టి మేలును నొనగూర్చ జాలకపోవుటయేగాక తమ వ్యక్తిత్వమునకే భంగము కలిగించుకొనినవారు కాగలరు.

కొందరు ప్రభుత్వవర్గములో చేరి శాసనాధికారములను తమ చేజిక్కించుకొని ప్రజలకు కొన్ని హక్కుల ప్రసాదించుటద్వారా ప్రజాసేవ చేయదలచుచున్నారు. ప్రభుత్వము, స్వాతంత్ర్యము అనునవి రెండు పరస్పర విరుద్ధపదములు. ప్రజాస్వాతంత్ర్యమనిన ప్రభుత్వాదాయము, అధికారము సన్నగిలుటని యర్థము. ఈ రహస్యము ప్రభుత్వము నెరుగక పోలేదు. అధికారము లన్నియు తమ వశమందే యుంచుకొని అప్రధానమైనట్టియు తమ అధికారమును బలపరచుటకే తోడ్పడునట్టియు, చిన్న చిన్న సంస్కరణముల కొన్నిటిని చేయురు. వారల ఉనికికి భంగకరమైన ఇట్టి ప్రయత్నములను సాగనివ్వరు. కాన ప్రభుత్వములో చేరి ప్రజలకు మేలుచేయగల్గుదుమని తలంచుట ఉత్తభ్రమ. పైగా ప్రత్యక్షముగనో, పరోక్షముగనో ప్రభుత్వశక్తిని వృద్ధిచేసి మరింత నిరంకుశముగా నొనర్చినవారగుదురు. ప్రభుత్వముతో చేరి పనిచేయదలంచువారి స్థితి యిట్లున్నది.

ఇక విప్లవములు, సామ్యవాద పద్ధతులపై ప్రభుత్వములను కూలద్రోయ దలంచువర్గమునకు చెందినవారగుచో ఆ ప్రయత్నము లెన్నటికిని ఫలప్రదము కాజాలవని తెల్పుదును. విధానములా భయంకరమైనవి. అసత్యము, హత్యలు దోపుడులతో కూడిన వగుటచేత అనాచరణీయములు. పోనీ ! ఈ పద్ధతు లవలంబించుట మూలమున ఫలసిద్ధి కలుగుననుటకు వీలులేదు. ఏలన ప్రభుత్వబలమును జాగరూకతతో గనునించుచో కూలద్రోయుటకు కాదుగదా కదలించుటకుకూడ శక్తిచాలదు. ప్రతి తిరుగుబాటు ప్రయత్నము ప్రభుత్వము నిర్బంధవిధానము మరింత కఠినముగా అమలు జరుపుటకు సాకుగా ఏర్పడగలదు.

అసాధ్యమగు విషయము సాధ్యమగునని అంగీకరించి పై పద్ధతులతో జయప్రదము కాగలదని అంగీకరించినను మనము విచారించవలసిన విషయ మొక్కటి కలదు. ఇంతకు మున్ను దౌర్జన్యపద్ధతులపై విప్లవముల గావించి జయించగలిగినవారు ఆ ప్రభుత్వస్థాన మాక్రమించిన పిమ్మట ప్రజాస్వాతంత్ర్యము పెంపొందునట్లు చేసిన ఘనకార్యములేవి? శక్తిని శక్తితో నిర్మూలించుటవలన అట్టి నిర్మూలనా శక్తిని తగ్గించుకొనుటకును, తమ అధికారములను ప్రజలకు ఒప్పగించి ఊరకుండుటకును ఎవరు ఇష్టపడగలరు? తమ తమ పదవుల నంటిపెట్టుకొని యుండగలుగుటకై శక్తిని వృద్ధిచేసుకొన జూతురుగాని తగ్గించుకొనరు. ప్రజలా స్వబుద్ధితో యోచించి సక్రమ పద్ధతిని నడుచుకొందురనిన తగిన శిక్షణ లేనందున ప్రభువులస్థితికూడ యథాప్రకారముగనే యుండును.

ఒకానొకడు అభివృద్ధిని సూచించు ప్రణాళిక కొకదానిని అమలు పరచిన పర్చవచ్చును. సాంఘికవాదుల అభిప్రాయప్రకారము పరిశ్రమలను సాముదాయిక ఆస్తిగా పరిగణించునట్లు శాసనములు గావించవచ్చును. అయితే ఆ పరిశ్రమలు తిరిగివ్యక్తుల హస్తగతము గాకుండ చూచు అధికారము వ్యక్తుల హస్తములయందే యుండవలసివచ్చును. వారికి తల యొగ్గవలసియే యుండును. ఆ వ్యక్తుల రక్తతృష్ణ తీరినకదా ప్రజోపయోగ కార్యములు చేయగల్గునది?

పరస్పర కలహములు లేకుండుటకును, సహజమై, సరళమైన జీవనము చేయగల్గుటకును అధికారము వహించిన సంస్థతో ఒకతే పని లేదు. నిర్బంధమువలనగాక, తన అంతరాత్మ ప్రేరణ కనుగుణముగా సద్బుద్ధితో 'ఆత్మవత్సర్వ భూతాని' యను వేదవాక్యమును ఆచరణయందుంచవలెను. అట్టి సత్పురుషులు లేకపోలేదు. అన్ని దేశములయందును గలరు. అధికారముతోకూడిన శాసనములవలనగాక స్వబుద్ధి ప్రేరణచేతనే యిరుగుపొరుగువారితో సుఖజీవనము గడుపగలుగుచున్నారు.

పరస్పర ప్రేమతో ప్రజలను మంచి దారిని వేయ ప్రయత్నించుటయే మన ఈ కాలమునకు సరిపోవు విధానము. మన మధ్య నివసించి యున్న మహాపురుషుల సద్బోధనలను మనోవాక్కాయ కర్మలయందు సంపూర్ణముగా (అనగా అన్ని మతములవారును నేడు మతముపేరిట చేయుచున్న బాహ్యాడంబరములకు సంబంధించినవిగావు. కేవలము ధర్మోపన్యాసములు వినుట, చెప్పుటయేగాక ఆచరించుటగూడ నుండవలెను.) అనుసరించుచు, ప్రస్తుత ప్రభుత్వపద్ధతులకు తలయొగ్గక, న్యాయస్థానములను బహిష్కరించి, పన్నుల నిరాకరణ, సేనలలో చేరకుండుట మూలమున ప్రభుత్వముతో సహాయ నిరాకరణ మొనర్చు టొక్కటియే సరియైన విధానము. ప్రస్తుత ప్రభుత్వ దాస్యమునుండి శాశ్వతవిముక్తి పొందదలచినయెడల యిట్లు చేయుము. అట్లు చేయుమని యితరులకు బోధించుటకు ముందు స్వయముగా ఆచరణయందుంచి యితరులకు మార్గదర్శులు కావలెను.

ఇందుకు భిన్నమార్గముల (దౌర్జన్యపద్ధతుల) ద్వారా ప్రజాస్వాతంత్ర్యము సాధించదలచువారు జీవితవిధానములున్నూ గుణములు, జీవితాశయములు ఒకేసారి వృద్ధిపొందునని సాధారణముగా తలంచుదురు. ఈ పరిణామమును హేతువుగాను, హేతువును పరిణామముగాను పొరపడుచు, తద్వారాగల ఫలితములగూర్చికూడ పొరపడుచున్నారు.

మానవుల గుణములలోను, జీవితాశయములలోను మార్పు కలిగినట్లెల్ల జీవిత విధానముకూడ మారవలసి యుండును. కాని జీవిత విధానము మార్చినంతమాత్రమున మానవుల గుణములు జీవితాశయముల యందు మార్పుగలుగు టసంభవము. ఇంతియేగాక ఈ పద్ధతి మానవు నక్రమ పద్ధతినుంచి వేరుజేసి తప్పుదారి త్రొక్కించగలదు. జీవిత విధానములందు మార్పు గావించి తద్ద్వారా గుణములందును, జీవిత ఆశయముల యందును మార్పు గావించవచ్చునని తలంచుట, పచ్చికబైలు పొయ్యి

క్రిందపెట్టి పచ్చి కట్టెలను కాల్చగల పొయ్యి ఉండునని తలంచుటను బోలియుండును. ఏవిధముగా పెట్టినను ఎండు కట్టెలకు మాత్రమే నిప్పంటుకొనగలదు.

ఈ పొరపాటును చేయువారు తమ పొరపాటును గ్రహించగల్గుటకు సకారణముగా ఋజువుచేయవలసి యుండును. మానవుల గుణముల యందు మార్పు కలుగవలెననిన అట్టిమార్పు మానవునియందే పుట్టవలెను, అట్టుమార్పుగల్గుటకు ప్రతివారును నిగ్రహము సంపాదించుకొనుటకై ప్రయత్నము చేయవలసియుండును, అట్టి నిగ్రహము ఆత్మపారిశుద్ధ్యమువలన తప్ప కలుగజాలదు. ఆత్మపారిశుద్ధ్యము లభించనంతవరకు బాహ్యోపచారములు, ప్రయత్నములు ఎన్ని చేసినను ప్రయోజనములు గాజాలవు,

సహజముగా జనులు తరచు చేయుచుండు తప్పిదమిదియే. నేడు మనకు కలుగుచున్న హానికంతకు నిదియే కారణము, కాన నిజమైన ప్రజాసేవ చేయదలచువారు ఇట్టి పొరపాట్లు పొందకుందురుగాకయని హెచ్చరించుచున్నాను. మామధ్య నివసించు పారిశ్రామికు లనుభవించుచున్న దుర్భర దారిద్ర్యమును కళ్ళారచూచుచూ. నీతులబోధించుటతో ఎట్లు తృప్తిపడగలము ? వారికొరకై మా ప్రాణములతోసహా సర్వస్వమును త్యజించియైననూ పారిశ్రామికుల శ్రేయస్సుకొరకు తీవ్ర ప్రయత్నములు చేయగోరెదమని కొందరు అతురతతో వచింతురు.

ఆచరణయోగ్యముగను, ప్రయోజనకారిగను కాన్పించు మీ విధానముద్వారా, ప్రజలకు మేలుగలుగగలదని తలంచు మీకు నా జవాబును గమనించితిరా ? చూడుడు. మీ జవాబును బట్టిచూడ నీతిమార్గమునగాక, మీకు విశ్వాసముగలట్టియు, మిమ్ముల నాకర్షించుచున్నట్టియు రాజకీయ పద్ధతుల మూలమున పోరాడనిశ్చయముగావించుకొన్నట్లు కాన్పించుచున్నది.

రాజకీయవేత్తలందరు మీవలెనే తలంతురుగాని ఒకరి కొకరికి ఏకీభావము లేదు. కాన ఆ పద్ధతియందు లోపమున్నదనుట నిశ్చయము.

ఎవరికి తోచిన విధమున వారు ప్రజాసేవ చేయదలచవచ్చునుగాని ప్రజా సేవకు యిన్ని మార్గములులేవు. ఒక్కటే మార్గము కలదు. మొదట అంతరంగికముగా నిష్కల్మషుడై స్వయముగా నాచరించుచూ యితరులకు ప్రబోధ మొనర్చవలసి యుండును, గాన సంస్కరణ తనతో ప్రారంభము కావలెను. అట్టి త్యాగ పురుషులు సంసారిక వ్యవహారములనుండి వైతొలగక (సన్యసించక) సంఘముతో కలిసియుండి, తమ ఉనికివలన ప్రజలయందు పరస్పర ప్రేమలతలు పెంపొందునట్లు ప్రయత్నించవలెను. ఈ పద్ధతివలన కలుగు మహత్తర మార్పులనుగూర్చి యింతవరకు ఎవ రును యోచించనైనలేదు.

రాజ్యాంగములయందుగాని, విప్లవములయందుగాని పాల్గొనుట వలన రానున్న ఫలితములను ముందుగా ఊహించ వచ్చును. ఇంతేకాదు, రాజ్యాంగమునందు పాల్గొనిన, గౌరవపదవులు, సౌఖ్యము, భోగము లనుభవించ వచ్చును. లేక విప్లవములయందు పాల్గొనిన కష్టముల నెదుర్కొన వలసి యుండును. బాధలు హెచ్చినకొలది జయము రానున్న దను ఆశకూడ యినుమడించుచుండును. సైన్యములతో కూడిన పద్ధతుల యందు బాధలేగాక తరుచు మరణములుకూడ ప్రాప్తించును. ఈ పద్ధతులు స్వార్థపరులు, అవినీతిపరులు నగువారికి ప్రీతికరమైనవి.

ఇక మత విశ్వాసముల ననుసరించి, చేయు ప్రయత్నములలో రానున్న ఫలితములు వెంటవెంట స్థూలదృష్టితో పరికించిన గాన్పించవు. ఈ విధానమునందు బాహ్యజయ మనునది కాన్పించదు. గొప్పగొప్ప హోదాలుగాని, కీర్తిగాని లభించదు. సాంఘికదృష్టితో చూచుచో దుర్భర దారిద్ర్యస్థితి యనుభవించవలసి వచ్చును. నిరసనలకు గురియగుటయేగాక చివరకు మరణములుకూడ సంభవించ వచ్చును.

బలవంతముగా జనులు సైనికులుగా చేయబడుచున్న మన కాలము నందు నిజమైన ప్రజాసేవచేయు కుతూహలముగల మానవుడు ప్రభుత్వ

ఉత్తర్వుల ధిక్కరించవలసి యుండును. ప్రభుత్వపు ఉత్తర్వుల ధిక్కరించుటయన ఉరికంబముల కౌగలించుటయే యగును. అయితే ఈవిధాన మొక్కటియేమానవునికి నిజమైన స్వేచ్ఛను ప్రసాదించ గలదు. తాను తన విధ్యుక్తమును నెరవేర్చుచున్నట్లు ఆత్మ సంతుష్టిని పొందగల్గును.

ఈ విధానము ననుసరించుచో విప్లవకారుల అస్వాభావిక పద్ధతులపై సాధించదలచు సంఘశ్రేయమును, స్వాభావిక మైనట్టియు, సత్యముతో కూడిన ఉత్తమమార్గ మవలంబించిన వారగుటయేగాక మన కోరికలను సాధించినవార మగుదుము.

సంస్కరణ మొదట తనతో ప్రారంభించవలె నునదియే ప్రథమ సూత్రము. ఋజుజీవన మవలంబించ వలెను. ఫలితములు రానున్నట్లు భ్రమింపజేసి, అస్వాభావిక పద్ధతులవైపు నాకర్షించజూచు నాయకుల ప్రయత్నములను బోలియుండక ఫలితములు మొదట కాన్పించకున్నను, క్రమముగా సంఘశ్రేయ మొనకూర్చ జాలిన విధాన మియ్యదొక్కటియే.

అయితే ఈ విధానము ఆచరణకు వచ్చున దెన్నడని ఫలితముల కొరకు ఆతురపడువా రడుగుచున్నారు.

వెంటనే ఎవరైన చేయగల్గుచో గొప్ప విషయమే. అందు సందేహములేదు.

కాని, ఒక్క దినములో మనమొక ఉద్యానవనమును నిర్మించ గలమా? ఎవరును చేయజాలరు. విత్తనములు నాటవలెను. మొక్కలు మొలవవలెను, ఆకులు వేయవలెను, కొమ్మలు పెరగవలెను. అప్పుడు దానిని వనమందురు.

చిన్నచిన్న కొమ్మలను భూమిలోపాతి తోటవలె ప్రదర్శించ వచ్చును. కాని అయ్యవి తాత్కాలిక ప్రదర్శనమునకు మాత్రమే ఉపయోగించును. మానవ సంఘమునకు కూడ యిదే క్రమము. సాంఘిక సంస్కరణ విషయమున కూడ పై ఉదాహరణ వర్తించును. ప్రజాళికల

వలె ఒకడు ఎన్నియో ప్రణాళికలను తయారుచేయవచ్చును. కాని అసు కరణము లెప్పుడును సత్యమును మరుగు పరుచును. ప్రజలకు గొప్ప మేలును సమకూర్చ నున్నట్లు ప్రభుత్వములు ఆశను పురిగొల్పి ఉన్న పద్ధతులయందు మార్పు గావింతురు. మరియు ఈమార్పులు కేవలము అధికార బలముతో కూడిన వగుట చిరకాలము నిలువజాలక పోవుటయే గాక, సక్రమాభివృద్ధిని నిరోధించును. కావున ఆదర్శసాధనలనుగూర్చి తొందరపాటు కూడదు. తొందర కార్యభంగమునకేగాక హానికికూడ కారణమగును.

దౌర్జన్యరహిత విధానముద్వారా సంఘ సంస్కరణ మొనర్చ వలెనని కోరుచో, తొందరలో నెరవేరునా, ఆలస్య మగునా యను విష యము, ఇటు మానవుల యొక్కయు అటు ప్రభుత్వము యొక్కయు దృక్పథముపై నాధారపడి యుండును. మానవ సంఘము నూతనాదర్శము లను సాధించబూనుటకు ముందు ప్రస్తుతప్రభుత్వముయొక్కయు, విప్లవకా రులయొక్కయు దృష్టిపథమునందలి లోపములను మనముగ్రహించవలెను. ప్రాతవిధానములనే నమలుపర్చ చూచుట, మతమును, మతభావములను నణగద్రొక్కుట, ప్రభుత్వసేవకు ప్రజలను పురిగొల్పుట యనునవి ఉభయులకు (ప్రభుత్వము, విప్లవకారులు) సమానములే యగుట వారి ప్రయత్నముల వలన కలగబోవు ఫలితములుకూడ తదనుగుణ్యముగనే యుండును. నీచమై, స్వార్థపరమగు జీవితముగాక మానవుల దుస్థితిని బాపి సంఘశ్రేయ మొనగూర్చ బూనినవారు తెలుసుకోవలసిన దేమన యిరుగు పొరుగు వారిపై దౌర్జన్యము లొనర్చుట మూలమునగాని, దౌర్జ న్యము లొనర్చువారికి తోడ్పడుట మూలమునగాని సంఘశ్రేయ మొన గూడ దనియు, తనయం దితరుల నెట్లు ప్రవర్తించ కోరునో, తానుకూడ యితరులయందు తద్విధముగనే ప్రవర్తించుట వలన మాత్రమే సంఘ శ్రేయ మొనగూడునని గ్రహించవలెను. ప్రస్తుతపు దౌర్జన్యయుతములు,

ప్రకారములు నగు జీవనపద్ధతులుమారి క్రొత్తరకపు మానవ సంఘము తయారు కాగలదని ఎంత తొందరలో గ్రహించ గల్గిన నంతతొందరలో సంఘశ్రేయ మొనగూడ గలదు.

ఎందరో ప్రజ్ఞానిధులు తమశక్తిని, కాలమును ప్రభుత్వ సేవలకును, విప్లవములకును దుర్వినియోగ మొనర్చిరి. ఎందరో యువకులు తమ యౌవనమును, ప్రాణములను సాంఘికసంస్కరణలకు సంబంధించిన పృథాకలలు కనుటయందువినియోగించిపోకదా! ఫలరహితకార్యములయందు తమ అమూల్య కాలమును వృధాచేయుటయేగాక, నిజసేవసేయువారి ప్రయత్నములను అసాధ్యమగునంతటి ప్రమాదస్థితికి దించిరి. మరియు అట్టివారి ప్రయత్నములు నిష్ప్రయోజన కరములేగాక హానికరములుగా మారినవి. వృథా చేయుటయేగాక, యిరుగు పొరుగు వారిని కూడ తమతోబాటు అపాయ స్థితిలోనికి దింపిన ఆశక్తులను తమ ఆత్మ పారిశుద్ధ్యము కొరకు వినియోగించిన ఎంత లాభకరముగా నుండెడిది ?

ప్రాతబడి కూలనున్న యింటికొరకు ఎంత ధనవ్యయ మొనర్చినను, పాతయిల్లు పాతయిల్లే. క్రొత్తది కాజాలదు. గాని ప్రాతదానిని కూలద్రోసి నూతన రుచులకును, అవసరములకును, అనుగుణ్యముగా నూతన భవననిర్మాణమునకు గడంగుచో ఎంతయో సులభకార్యమగును. పాత యింటి వలన కొందరికి కొన్నిరకముల సౌకర్యములుండిన యుండవచ్చును. అట్లే నూతన విధానము అమలునకు వచ్చినచో స్వార్థపరులగు వారికి నష్టము కలిగిన కలుగవచ్చును. మానవ సంఘమునందుకూడ పాతపద్ధతులను సమన్వయ మొనర్చు ప్రయత్నముకంటె వాటిని త్రోసివేసి, వాటిస్థానే నూతన విధానము లవలంబించుట అవసరము.

నేను పైన చెప్పినదాని సారాంశమేమన మానవులకు మంచిని ఒనగూర్చ బూనువారు మొదట తాము మంచివారుగా తయారుకావలెను.

మానవులను సత్ప్రవర్తన గలవారుగానుండ ప్రోత్సహించుటకొక్కటే మార్గము. ప్రతివారును తమతమ ప్రవర్తనలను మొదట సరిచేసుకొన వలెను. 'ఆత్మవత్సర్వభూతాని.' తనయందు, నిఖిల భూతములందు నొక భంగిగా ప్రవర్తించుట నేర్వవలెను. ఈ పద్ధతిని సంస్కరణకు పూనుచో సంఘ శ్రేయము కలుగుననుట నిశ్చయము.





# నాల్గవ ప్రకరణము

## అరాజకము

ఇప్పుడున్న పద్ధతిని, ప్రభుత్వములను సాగనిచ్చుటకంటె అరాజకమే మేలు. అరాజకులవలన కలుగుహాని ప్రభుత్వ దౌర్జన్యములంత చెరుపును చేయజాలవు. గాన ప్రస్తుత పద్ధతి మారవలెను. అరాజకము కావలెననువారి మాటలయందు సత్యము కలదు. అయితే 'అరాజకము' దౌర్జన్యయుత విప్లవముల మూలముననే సాధ్యమగునని తలంచుటయందే అరాజకులు పొరబడుచున్నారు. ప్రాణ, మాన, ధనంబుల రక్షణకై ప్రభుత్వములపై నాధారపడుటకు నిరాకరించువారి సంఖ్య పెరుగవలెను. స్వశక్తిపై నాధారపడువారి సంఖ్య పెరిగిన కొలది ప్రభుత్వములు తమ శక్తిని ప్రజారక్షణపేర దుర్వినియోగము చేయుటకు సిగ్గుపడుస్థితివచ్చును.

"ధనికవర్గపు సంస్థలును పాటకపు జనుల వశమగును. అందువలన పాటకపు జనుల బాధ తొలగును. కష్టఫలితము సందలి పంపకపు హెచ్చుతగ్గులు తొలగిపోవును." అని అరాజక వాదులు తమ అరాజకము వలన రాబోవు ఫలితములను గూర్చి చెప్పుదురు.

"అయితే పరిశ్రమల నేర్పాటుచేయువారెవరు? ఎవరునిర్వహింతురు?"

"వాటంతటవియే సాగును. పాటకపు జనులే అన్ని ఏర్పాట్లను చేసుకొందురు."

ప్రతి పనిని నిర్వహించుటకు అధికారముతో కూడిన కార్యనిర్వాహకులు కావలసియుండును. అందువలననే ధనికవర్గ సంస్థలు పుట్టెను. పనియున్నచోట నాయకత్వము, అధికారయుత కార్యనిర్వాహక వర్గము ఉండును. ఎచ్చట అధికారముండునో అచ్చటనే అధికారమును గూర్చిన నిందారోపణలు కూడ నుండును. గాన అరాజకులు చేయు ప్రయత్నమంతయు ఈ అధికారమును అంతమొందించుటకే.

న్యాయస్థానములు, సైన్యములు మొదలగువాటితో కూడిన ప్రభుత్వముయు అసలే లేకుండ నుండుటెట్లు? అను ప్రశ్న ఉదయించును అయితే, ప్రస్తుతావసరముల కనుగుణ్యమైన పద్ధతిని ప్రభుత్వములను సంస్కరించుటెట్లు? సంస్కరించుటయే సాధ్యమై, సంస్కరింపబడిన పిమ్మట నడుపువారెవరు? అను ప్రశ్నలకు ప్రత్యుత్తరముల కై మిమ్ములను (అరాజకులను) గాని, నన్నుగాని ఎవరును నియమించి యుండలేదు.

అయినను, మనమీ ప్రశ్నలకుకూడ జవాబివ్వవలసియే యుండును. నాకిళ్ళ యెదుట కాన్పించుచున్న ఈసమస్యకు సంబంధించినంతవరకు ప్రభుత్వ వర్గముతో నాప్రవర్తన ఎట్లుండవలెను? తప్పుచేయువారిని ఉరితీయునట్టి, మనుష్యులను హత్యచేయుటకు సైనికుల పంపునట్టి, నల్లమందు సారాయముల విక్రయించి మానవజాతిని నీతిదూరుల చేయునట్టి ప్రభుత్వములకు నా అంతరాత్మ (మనస్సాక్షి)ను స్వాధీన మొనర్చి, వారి చర్యలకు నా ఆమోదము తెల్పి చూచుచు ఊరకుండ వలసినదేనా? లేక నామనస్సాక్షి కనుగుణ్యముగా ప్రవర్తించుచూ యిందుకు విరుద్ధమగు ప్రభుత్వచర్యల ప్రతిఘటించ వలెనా?

ఇందువలన రాబోవు సారాంశమేమి? ముందెట్టి ప్రభుత్వము లుండవలెనను విషయము నాకు తెలియదు, నేను తెలుసుకొన దలచనని కాదు. తెలుసుకొన జాలను. తనలోని సహజజ్ఞానము ననుసరించి తేనెటీగ తోడి ఈగలతోబాటు తేనెపట్టు వదలి ఎగిరిపోయినప్పుడు తేనెటీగకు ఎట్టిహానియు కలుగనట్లే, నేను నామనస్సాక్షి కనుగుణ్యముగా ప్రేమమార్గము ననుసరించుచో ఎట్టిహానియు కలుగదని మాత్రము నాకు తెలియును.

ఏసుక్రీస్తు (జీసస్) దేవుడనిగాని, గొప్పవాడనిగాని నేనిచ్చట చెప్పబూనుటలేదు. కాని, అతడు సందేహాస్పదములుగా నుండిన విషయ

షులను స్వయముగా నాచరించి వాటినే యితరులకు బోధించినవాడుగాన, ఆతని బోధనలు ఖండింప దగనివని తలంచి యిచట నుపహరించు చున్నాను. ఏమని చెప్పెనో చూడుడు: "నీవొక మనుష్యుడవు. జ్ఞానము, దయ గల ఒకజీవివి, గుణములు ఉన్నతమైనవి. మరియు నీవు నేడో రేపో చనిపోయెదవని తెలుసుకొనుము. పైన దేవుడే యున్నచో, నీవాతని వద్దకు వెళ్లెదవు. అతడు నీప్రవర్తనల గూర్చి సంజాయిషీ కోరును. నిన్నాతడు తన న్యాయ శాస్త్రము ప్రకారము ప్రవర్తించితివా యని యడుగును. కనీసము అతడు నీలోనుంచిన మంచిగుణములనైన అనుసరించితివో లేదో చూచును. ఒకవేళ దేవుడే లేడనుచో నీలోయున్న వివేకము, ప్రేమ గొప్పగుణములుగా పాటించుము. నీవు నీ పశుప్రవృత్తికి లోనుగాక, తుచ్ఛసుఖము లాసించక, నీలోని ఆత్మ ప్రేరేపించురీతి నీవాచరించుము. జీవన వ్యాపారముల యందును, జడమైన ఆపదల యందును ప్రేమ, వివేకములను పాటింపుము."

ఏజాతి ఎక్కువ సౌఖ్యముగాను, భద్రముగానుండును ? ఆయుధములు, ఫిరంగులు, వురికంబములు మొదలగువాటిని రక్షణ పరికరములుగా తలంచుచూ, వాటిపై ఆధారపడు ప్రభుత్వములపై ఆధారపడుట మంచిదా ? లేక పైసాధనల నుపయోగింపని వారిపై ఆధారపడుట మంచిదా ?

మరొక ప్రశ్నకలదు. క్షణకాలము జీవితము గడుపవచ్చిన నీవు, ఏక్షణమున ఈ లోకము వీడిపోదువో తెలియని నీవు జ్ఞానము దయ నీయందు మూర్తీభవించియుండ తప్పు లొనర్చిరనిగాని, ఇతరజాతికి చెందినవారనిగాని, హత్యలొనర్చుటకు సిద్ధపడు ప్రభుత్వచర్యలయందు పాల్గొందువా ? అనాగరకజాతులను నెపంబున సర్వనాశన మొనర్చుట కంగీకరింతువా ? స్వలాభమునకై నల్లమందు, సారాయములను విక్రయించి బుద్ధినాశనమొనర్చు పనులయందు పాల్గొందువా ? నీవు స్వయముగా ఆచ

రించక పోవచ్చును. గాని యిట్టిపనులొనర్చువారితో కలిసియుండుట కంగీకరింతువా ? లేక నిరాకరింతువా ? ఈ ప్రశ్నలకు ప్రతివారును యివ్వ తగిన ప్రత్యుత్తరము ఒకటేగలదు. ఈ విధమగు ప్రచారమువలన రాబోవు ప్రతిఫలమేమియో నాకు తెలియదు. ఏలన నేను తెలుసుకొన నవసరము లేదు. అయితే పైన తెల్పిన సందర్భములయందు ఎట్లు ప్రవర్తించవలెనను విషయము మాత్రము నిస్సందేహముగా నాకు తెలియును.

దీనివలన నేమి జరుగునని మీరడుగుచో మంచియే జరుగునం దును. అత్యుత్తమమైనట్టి ప్రేమ, వివేకములను న్యాయసూత్రములపై నాధారపడినట్టి సత్ప్రవర్తనలవలన మంచియే కలుగక మరేమగును ? సర్వ మానవ సోదరభావము పెంపొంది వివేకవంతులుగా యుండవలసినవారు, మోసములచే, కుతంత్రములచే అణగద్రొక్కబడి నాశనోన్ముఖులగు చున్నారు. ఈస్థితి భయంకరమైనది, నిరాశను గొల్పునదిగా ఉన్నది.

ఇట్టి క్లిష్టపరిస్థితులనుండి వెలువడుటకు రెండే మార్గములు గలవు. దౌర్జన్యములను దౌర్జన్యములతో నెదుర్కొని బాంబులతోడను బాకుల తోడను విప్లవము లేవదీసి ఇతరజాతులవారిపై కుట్రలుబన్ని నాశన మొనర్చు ప్రభుత్వములను అంతమొందించవలెను. ఈ పద్ధతిని నిరీశ్వర వాదులు, అరాజకులు అవలంబింపకోరుచున్నారు. రెండవపద్ధతికూడ కలదు. ప్రభుత్వముతో సమాధానపద్ధతి నవలంబించవలెను. ప్రభుత్వ వ్యూహములో ప్రవేశించవలెను. క్రమక్రమముగా వ్యూహచ్ఛేదమునకు పూనవలెను. తద్వారా ప్రభుత్వము అంతమొందించి ప్రజలను ప్రభుత్వదాస్యమునుండి విముక్తిని కలిగించవలెను. కాని ఈ రెండు విధానములకు ఇప్పు డవకాశము లేదు.

మన మింతవరకు సంపాదించిన అనుభవము వలన బాంబుల, బాకుల పద్ధతి నిష్ప్రయోజనకరమని నిశ్చయమైనది. దౌర్జన్య పద్ధతుల వలన మన కాధారమైనట్టి మనకున్న ఏకైక సాధనమైనట్టి ప్రజాసానుభూతి యనుదానిని కోల్పోవుదుము.

ఇక మిగిలినది రెండవ పద్ధతి (ప్రభుత్వ వర్గముతో చేరుట)ని గూర్చి యోచింతము. ప్రభుత్వములు తమ్ము సంస్కరించదలచువారిని ఏహద్దువరకు చేర్చుకొనవచ్చునో బాగుగా నెరుంగుదురు. ఆ హద్దుల వరకు సంస్కర్తలకు ప్రవేశమిత్తురు. ప్రభుత్వములు తమకేవి ప్రమాద కరములో బాగుగా గుర్తెరింగి యున్నవి. వారి ఉనికికి భంగకరములగు ఎట్టి మార్పులను చేయనొల్లరు. తమతో నేకీభవించక సంస్కరించదలచు సంస్కర్తలను తృప్తిపరచు నిమిత్తమున్నూ, స్వప్రయోజనములకు ఉపయోగపడుదురని తలంచబడిన వారిని సంతృప్తి పరచు నిమిత్త మున్నూ, కొందరిని తమతో చేర్చుకొందురు, అట్టివారిని చేర్చుకొననిచో వారపాయకరమైనవా రనియు, తిరుగుబాటుకు ప్రయత్నింతురేమో యనియు వారి భయము. ప్రతిపక్షుల వలన హాని కలుగకుండుటకును, ప్రజాసానుభూతి సంపాదించవచ్చునను ఆశచేతను వీరిని తమలో చేర్చు కొందురు. ప్రజాశయములను అణచిపెట్టుట, ప్రజలను దోచుట యను దుష్కృత్యములను వీరిచేతనే చేయింతురు.

ఈ రెండు పద్ధతులు మన కనుకూలించవు. ఇక చేయవలసినదేమి?

దౌర్జన్యము లొనర్చుటకా సాధ్యముకాదు. అవి ప్రతిక్రియకు కారణమగును. ప్రభుత్వములతో చేరుదుమా వారి చేతులలో పనిముట్ల మగుటయే సంభవించును.

కాన ఇక మనకు మిగలినదేమన, ప్రభుత్వములను మనోవా క్కాయ కర్మలయందు అనగా మన యోచనలు ఉపన్యాసములు, (వ్రాత, కూతలు) చర్యలు మూలముగా అవసర మగుచో ప్రాణముల నర్పించి యైనను, ప్రభుత్వములకు లొంగక వారి శక్తి వృద్ధియగుటకు తోడ్పడక వారితో దౌర్జన్యరహిత సహాయ నిరాకరణకు గడంగవలెను.

ఇయ్యదియే చేయతగినది. దీని మూలముననే జయము నిశ్చ యము. ఇయ్యదియే భగవంతుని యుద్దేశ్యము. ఇదియే భగవదాదేశము.

ఇప్పుడు మనమొక నిశ్చయమునకు రాగల్గితిమి. వివేకము, ప్రేమ గల మానవుడు ప్రభుత్వముతో సహకారము చేయజాలడు. పారిశ్రామికుల కొల్లగొట్టు ధనికవర్గములు, భూస్వాములను ప్రోత్సహించు ప్రభుత్వములతో, భారతీయుల దాస్యమునందుంచి నిర్ధనులు, నిరాయుధులుగా గావించిన ప్రభుత్వములతో, నల్లమందు సారాయిలను త్రాగించి చెరుచుటయేగాక చైనాప్రజలను కొరడాలతోగొట్టు ప్రభుత్వములతో, ఆఫ్రికావాసుల సమూలముగా దుంపనాశన మొనర్చిన ప్రభుత్వములతో (పై విశేషణములు ఇంగ్లీషువారి నుద్దేశించి చెప్పబడినవి) ఎట్లు సహకారము చేయగల్గును?

ఒక డీట్లను ననుకొనుడు. "ప్రభుత్వమననేమో నాకు తెలియదు. అది ఎందుకున్నదో నా కసలేతెలియదు. నాకు తెలుసుకొనవలసిన అవసరమసలే లేదు. గాని నా అంతరాత్మ ప్రేరణకు వ్యతిరేకముగా మాత్రము ప్రవర్తించజాలను." ఈ సమాధానమున కిక తిరుగులేదు. ఈ పద్ధతిని అవలంబించుటయే గత్యంతరము. "నా అంతరాత్మ ఏమి చెప్పునో నాకు తెలియును. ఓ ప్రభుత్వ నిర్వాహకులారా! మీ శక్తికొలది సాధ్యమైనంత మంచిగా నిర్వహించుడు. ఈ కాలపు మానవుల అంతరాత్మ ప్రేరణకు విరుద్ధము కాకుండునట్లు చేయుడు." ఈ పద్ధతి ఉత్తమమైనది.

అయితే ఈ ఉత్తమపద్ధతిని చేపట్టక, ప్రభుత్వములను సంస్కరించవలెనను భ్రమకులోనై తమ స్థితిని అయోమయ మొనర్చుకొని, ప్రభుత్వములను సమర్థించు స్థితికిదిగి తమ కోరికలకు తిలోదకము లిడుచున్నారు.

పారిశ్రామికుల స్థితిబాగుపడుటకును, మానవులమధ్య సోదరభావము పెంపొందుటకును మూడేమార్గములు గలవు.

౧. నీకొరకై యితరులచే పనిచేయించకుము. ప్రత్యక్షముగాగాని, పరోక్షముగాగాని వారిసేవలను కోరకుము. ప్రత్యేక పరిశ్రమ అవసరమగు వట్టి వస్తువుల కోరకుము. ఇవియన్నియు భోగములకు సంబంధించినవి.

౨. విసుగుపుట్టించునట్టియు, నిరుత్సాహమును పుట్టించునట్టియు, పనులను స్వయముగా నాచరింపుము. ఇంకనూ ఓపికయున్నచో యితరులకుకూడ సహాయపడుము.

౩. పైన తెల్పిన ప్రకారము విసుగుకలిగించునట్టియు, నిరుత్సాహకరమైనట్టియు పనులను స్వయముగా నాచరించుటవలన అనుభవము మూలముననే ప్రకృతి పరిశోధనలు గావించుట తటస్థించెను. పరిశోధనల ఫలితమే యంత్రనిర్మాణములకు, విద్యుచ్ఛక్తిని కనిపెట్టుటకు, ఆవిరివలన నుపయోగములు తెలుసుకొనుటకు కారణభూతమాయెను. ప్రతివాడును తనపని తేలికగా ముగియుటకు యోచించుచుండుట సహజము.

అయితే మానవులు నేడు మూడవపద్ధతికే మొగ్గుచున్నారు. అదియు సక్రమపద్ధతిని ఆచరించుటలేదు. రెండవ పద్ధతికి ఇష్టపడుట లేదు. ఇక మొదటిపద్ధతి కసలే విముఖులు.

శాశ్వత విప్లవమొకటి రావలెను! అయ్యది నీతికి సంబంధించినది. మార్పు ఆంతరంగికమైనది.

ఈ విప్లవమెట్లు తటస్థించగలదు. మానవులమధ్య ఈ విప్లవమెటుల కలుగునది ఎవ్వరును ఎరుగరు. కాని ప్రతిమానవుని ఆత్మకు తెలియును. ఈ ప్రపంచములో ప్రతిమానవుడు సంఘమును సంస్కరించ దలచును. గాని తనయందలి లోపములను తొలగించుకొన ప్రయత్నించడు.

ప్రజలు బానిసత్వమును, బానిసలనుంచుటయు శాసనవిరుద్ధ కార్యముగా శాసించిరి. తమ జీవితవిధానమునందు మాత్రము మార్పుగావించరు. యథావిధిగా తాము నివసించుటకు పదిగదులు కావలెను. తమకు పలురకముల భోజనములుకావలెను. ప్రయాణమునకు వాహనములుండవలెను. బానిసలు లేకుండ ఇన్ని సౌకర్యము లెట్లు ఒనగూడగలవు? ఈ విషయమంత స్పష్టముగా కాన్పించుచున్ననూ, ఎవరును దీనిని గ్రహించరు.

---

అనుబంధము

# గాంధీ - టాల్‌స్టాయ్ లేఖలు

## *గాంధీజీ టాల్‌స్టాయికి వ్రాసిన లేఖ*

వెస్ట్‌మినిస్టర్ ప్యాలెస్ హోటల్
4, విక్టోరియా వీధి, యస్. డబ్ల్యు.
లండను, 1909 అక్టోబరు 1.

అయ్యా!

దక్షిణాఫ్రికాలోని ట్రాన్స్‌వాల్‌లో ఇప్పటికి మూడేండ్లనుంచి ఏమి జరుగుతున్నదో ఈ లేఖద్వారా మీ దృష్టికి తేదలచాను.

ఆ కాలనీలో దాదాపు 13,000 మంది బ్రిటిషుఇండియావారున్నారు. భారతీయులైన వీరు చాలా సంవత్సరాలనుంచి వివిధశాసనాలవల్ల అనేక కష్టనష్టాలకు గురి అవుతున్నారు. ఆ దేశంలో వర్ణవిచక్షణ, ఆసియా వాసులపై విద్వేషం తీవ్రంగా వున్నాయి. ఆసియా వాసుల విషయంలో ఈ విద్వేషం ఎక్కువగా వ్యాపారానికి సంబంధించినట్టిది. మూడేండ్ల క్రితం ఆసియా వాసులకు ప్రత్యేకంగా వర్తించునట్టి ఒక శాసనం అమలులోకి తేబడినప్పటినుంచి పరిస్థితి మరీ విషమించింది. ఈ శాసనం ఎవరికొరకు చేయబడిందో వారి కది చాలా అవమానకరమైనట్టిదని నేనూ, ఇంకా ఇతరులు కొందరు భావించాము. ఇటువంటి శాసనానికి లొంగిపోవడం ధర్మకర్తవ్యాన్ని విస్మరించడమే అవుతుంది. నేను, నా మిత్రులు కొందరు దౌష్ట్యాన్ని అహింసతో ఎదిరించే సిద్ధాంతాన్ని గట్టిగా నమ్మినవారం. మీ రచనలను కొన్నిటిని చదివేభాగ్యం నాకు కలిగింది. అవి నన్ను చాలా ఎంతో ప్రభావితుణ్ణి చేశాయి. బ్రిటిషుఇండియా భారతీయులకు వారి పరిస్థితి

సాకల్యంగా వివరించి చెప్పగా ఆ శాసనానికి లొంగిపోరాదనీ, అంతకంటె ఆ శాసనాన్ని ఉల్లంఘించి ఆ మీదట విధింపబడే శిక్షలను అనుభవించడమే మంచిదనీ వారు నిశ్చయించుకున్నారు. కాని పోరాటంవల్ల కలిగే ఇబ్బందులను తట్టుకోలేమనీ, జైలుబాధలను ఓర్చుకోజాలమనీ భావించినవారు భారతీయ జనాభాలో దాదాపు సగంమంది ఉన్నారు. వార్లు ఈ అవమానకరమైన చట్టానికి లొంగిపోవడం ఇష్టంలేక ట్రాన్సువాల్ నుంచి వెళ్ళిపొయ్యారు. మిగతాసగంమంది అంటే దాదాపు 2500 మంది ఆత్మాభిమానంతో జైళ్ళకు వెళ్ళారు, వీరిలో కొందరు అయిదారు పర్యాయాలు జైలుకు వెళ్ళినవారు ఉన్నారు. నాలుగు రోజులు మొదలు ఆరు నెలలవరకు వివిధములైన శిక్షలు వారికి విధించబడినవి. చాలామందికి కఠినశిక్షలు వేశారు. అనేకులు ఆర్థికంగా నాశనమయ్యారు. ఇప్పుడు ట్రాన్సువాల్ జైళ్ళలో నూరుమందికిపైగా నిర్బంధితులై వున్నారు. వీరంతా శాంతియుతంగాశాసనాన్ని ఎదిరించినవారు. వీరిలోకొంతమంది నిరుపేదలు. ఏరోజుకారోజు దినబత్తెం సంపాదించుకొనేవారు. అందుచేత ప్రజలనుంచి విరాళాలు సేకరించి వారి భార్యాపిల్లలను ఆదుకోవడమైనది. ఇందుకు కొందరు సత్యాగ్రహులుకూడా భూరివిరాళాలిచ్చారు. దీనివల్ల బ్రిటిష్ఇండియా భారతీయులపై మోయలేని భారం పడింది. అయినా వారు తట్టుకొని నిల్చి తమ కర్తవ్యాన్ని నెరవేర్చారు. ఈ పోరాటం ఇంకా సాగుతున్నది. దీనికి అంతమెప్పుడో తెలియడం లేదు. పశుబలం నెగ్గనిచోట శాంతియుత పోరాటం తప్పక విజయవంత మవుతుందని మాకుతెలుసు. ఈపోరాటం ఇంతకాలం జరిగిందంటే అది మా బలహీనతే అని చెప్పాలి. అదీగాక ఎక్కువకాలం పోరాటం సాగిందంటే మేము ఆ బాధలకు తట్టుకోలేక లొంగిపోగలమనే ఆశ ఒక ప్రభుత్వానికి ఉంటే ఉండవచ్చు.

ఇక్కడ సామ్రాజ్యాధికారులనుచూచి, వారికి అసలు పరిస్థితిని వివరించి మా ఇబ్బందులను తొలగించుకుందామనే ఉద్దేశ్యంతో నామిత్రు

డొకాయనతో నేను ఇక్కడికి వచ్చాను. ప్రభుత్వానికీవిధంగా విజ్ఞాపన చేసుకోరాదని సత్యాగ్రహుల అభిప్రాయం. అయితే వారిలో బలహీనులైన వారి ప్రతిపాదనపై ఈ ప్రతినిధివర్గం ఇక్కడికి వచ్చింది. ఈ ప్రతినిధి వర్గం వారి బలాన్నిగాక బలహీనతను వెల్లడి చేస్తుంది. కాని ఇక్కడికి వచ్చి పరిస్థితులను పరిశీలించిన మీదట "నైతికసూత్రాలు — సత్యాగ్రహ సార్థకత్వం" అను విషయంపై వ్యాసరచనపోటీ నొకదానిని జరిపి నట్లయితే అది ఈ ఉద్యమాన్ని బలపరచి, ప్రజలు ఆలోచించేటట్లుగా చేయగలదని ఊహించాను. అయితే అటువంటి పోటీ జరుపడం నైతి కంగా సమర్థనీయమేనా అని ఒక మిత్రుడు ప్రశ్నించాడు. అటువంటి పోటీ సత్యాగ్రహంయొక్క మూలసూత్రాలకు విరుద్ధంకాగలదనీ, అలా చేయడం ప్రజాభిప్రాయాన్ని డబ్బు ఇచ్చి కొన్నట్లవుతుందనీ ఆ మిత్రుని అభిప్రాయం. ఈ విషయంలో మీ అభిప్రాయమేమిటో నాకు తెలియ జేయ గలరా? అటువంటి పోటీ జరుపడంతప్పు కాదని మీరు భావించినట్ల యితేఈ విషయంపై వ్యాసాలువ్రాయవలసిందిగా నేను ఎవరెవరిని కోరవ లెనో వారిపేర్లను వ్రాసి నాకు పంపవలసిందిగా అర్థిస్తున్నాను.

మరొక విషయాన్నికూడా మీ దృష్టికి తెచ్చి మీ సమయాన్ని నేను తీసుకుంటున్నందుకు క్షమించగలరు. భారతదేశంలో ప్రస్తుత కల్లోలాన్ని గూర్చి మీరు ఒక హైందవునికి వ్రాసిన లేఖ[1] యొక్క ప్రతిని ఒక మిత్రుడు నాకిచ్చాడు. స్థూలంగాచూస్తే అది మీ అభిప్రాయాలను వ్యక్తం చేస్తున్నది. ఆ మిత్రుడు తన సొంతఖర్చుతో ఆ లేఖయొక్క 20 వేల ప్రతులను ముద్రించవలెననీ, ఆ వ్యాసాన్ని అనువదించవలెనని కూడా అనుకుంటున్నాడు. అయితే దాని అసలుప్రతి మాకు అందలేదు. మాకు

1. శ్రీ హిందుస్థాన్ పత్రిక సంపాదకుడు తారకానాథదాసుకు జవాబుగా 1908 లో "ఒక హైందవునికి లేఖ" అను శీర్షికతో టాల్‌స్టాయి వ్రాసిన వ్యాసం.

— అనువాదకుడు.

అందిన ప్రతి సరియైనది అవునో కాదో, దాన్ని మీరే వ్రాశారో లేదో మాకు స్పష్టపడనందున దాన్ని ఇలా అచ్చువేయడం సబబుకాదని మేము భావిస్తున్నాము. నా దగ్గరవున్న ప్రతికి మరొక ప్రతితీయించి ఈ ఉత్తరంతో జతపరచి మీకు పంపుతున్నాను. దయచేసి ఇది మీరు వ్రాసినది అవునో కాదో, ప్రతి సరిగా ఉన్నదో లేదో, దీనిని పైవిధంగా మేము ప్రచురించ డానికి మీకు ఇష్టమవునో కాదో తెలియపరచండి. దీనికింకా మీరేమైనా మార్పులుచేర్పులు చేయదలిస్తే చేయండి. ఈ సందర్భంలో నేనొక సూచన చేయ సాహసిస్తున్నాను. ఆ లేఖ చివరిపేరాలో పునర్జన్మ విశ్వాసంపట్ల మీరు పాఠకులను నిరుత్సాహపరుస్తున్నట్లు వ్యక్తమవుతున్నది. మీరు అసందర్భంగా తలవకపోతే ఒకమాట చెప్పదలచుకున్నాను. మీరు ఈ పునర్జన్మ అనేమాటను ప్రత్యేకంగా ఆలోచించి అర్థంచేసుకున్నారో లేదో నాకు తెలియదు. భారతదేశంలోను, చైనాలోను కోట్లకొలది జనం పునర్జన్మ సిద్ధాంతంపట్ల విశ్వాసం కలిగివున్నారు. ఈ సిద్ధాంతం కేవలం శాస్త్రరీత్యా విశ్వసింపబడుతున్నది కాదు. ఇది అనుభవానికి సంబంధించి నది, మీరు పాఠకుణ్ణి పునర్జన్మపై నమ్మకం పెట్టుకోవద్దని చెప్పుతున్నట్లు నాకు అనిపిస్తున్నది. పునర్జన్మ అనుభవానికి సంబంధించినదనీ శాస్త్రరీత్యా నమ్మదగినది కాదనీ ఎవరైనా అంటే అనవచ్చు. కాని జీవితంలోని అనేక రహస్యాలను ఇది హేతుబద్ధంగా వివరిస్తుంది. ట్రాన్సువాల్ జైళ్ళకు వెళ్ళిన సత్యాగ్రహులలో కొందరికీ సిద్ధాంతం కడు ఆత్మీయమైనది. ఈ నమ్మకం వారి మనస్సులకు ఊరటకలిగించి వారికి జీవితంపై ఆశా మయవృక్పథం కలుగజేస్తుంది. ఇదంతా మీకు వ్రాస్తున్నానంటే ఈ సిద్ధాంతంపై మీకు విశ్వాసం కలుగజేయడం నా ఉద్దేశంకాదు. పైన పేర్కొన బడిన లేఖలో మీరు పాఠకుడిని నమ్మవద్దని చెప్పిన కొన్ని విషయాల నుంచి "పునర్జన్మ" అనే మాటను తీసివేయండని అర్థించడంకోసమే నేనిదంతా మీకు వ్రాస్తున్నాను. కృష్ణభగవానుని ప్రవచనములను మీరు

చాలా ఉదహరించారు.* మీరు ఏ పుస్తకంనుంచి ఆ ప్రవచనాలను స్వీకరించారో దానిపేరు తెలియపరిస్తే మిక్కిలి కృతజ్ఞుడను.

సుదీర్ఘమైన ఈ లేఖతో మీకు చాలాశ్రమ కలుగజేశాను. మిమ్మల్ని గౌరవింఛేవారు, మిమ్ములను అనుసరించాలని ప్రయత్నించేవారు మీ సమయాన్ని వ్యర్థపుచ్చకూడదని నాకు తెలుసు: సాధ్యమైనంతవరకు మీకు శ్రమ కలుగజేయకుండా చూడడం అటువంటివారందరి కర్తవ్యం. నేను మీకు క్రొత్తవాడిని అయినా సత్యాన్వేషణకోసమని ఏ సమస్యలకు పరిష్కారం సాధించాలని మీరు దీక్షవహించారో ఆ సమస్యలపై మీ సలహా పొందాలని నేను స్వతంత్రించి మీకీ ఉత్తరం వ్రాశాను; చిత్తగించగలరు.

గౌరవాభివందనాలతో
భవదీయుడు
యం. కె. గాంధీ.

కౌంట్ లియో టాల్‌స్టాయి
యస్నావాపోల్యానా (రష్యా)

గాంధీజీ వ్రాసిన పై లేఖను అందుకున్న తరువాత టాల్‌స్టాయి 1909 సెప్టెంబరు 24 తేదీన తమ డైరీలో ఇలా వ్రాసుకున్నారు: "ట్రాన్సువాల్‌లోని ఒక హిందువునుంచి చక్కని వుత్తరం వచ్చింది" ఆ తరువాత సెప్టెంబరు 28 తేదీన వి. జి. చెర్కాఫ్‌కు ఇలా వ్రాశారు: "ట్రాన్స్‌వాల్ హిందువునుంచి వచ్చిన ఉత్తరం నన్నెంతో ముగ్ధుణ్ణి చేసింది."

* టాల్‌స్టాయి వ్రాసిన "హైందవునికి లేఖ" లో ప్రతి విభాగానికి శ్రీకృష్ణుని ప్రవచనాన్ని ఉపోద్ఘాతంగా వ్రాశారు. అది వారి సొంత అనువాదం. దాన్ని ఎక్కడనుంచి స్వీకరించిందీ వారు తెలియపరచలేదు. ఈ ప్రవచనాలు బాబా ప్రేమానంద భారతిగారి "శ్రీకృష్ణ- ప్రేమశబ్దము" అను పుస్తకం లోనివి. న్యూయార్కులో 1904 లో ఇది ప్రచురింపబడింది.

## 2. టాల్‌స్టాయి గాంధీజీకి వ్రాసిన లేఖ

యస్నావాపోల్యానా
1909 అక్టోబరు 7

మీరు వ్రాసిన ఉత్తరం ఇప్పుడే నాకు చేరింది. ఉత్తరం మిక్కిలి పఠనయోగ్యంగా వుంది. చదివి చాలా సంతోషించాను. ట్రాన్స్‌వాల్‌లోని మన సోదరులకు, సహచరులకు భగవంతుడు సహాయపడుగాక ! కోమల హృదయులైనవారు కఠినులకు వ్యతిరేకంగాను, వినయం ప్రేమ మొదలగు సద్గుణాలు గర్వం హింస మొదలగు దుర్గుణాలకు వ్యతిరేకంగా నిలబడి చేస్తున్న ఈ పోరాటాన్ని ఇక్కడ మేము ప్రతియేటా గమనిస్తూనే వున్నాము. ముఖ్యంగా మత సిద్ధాంతాలు ప్రపంచ శాసనాలతో పడుతున్న సంఘర్షణ—అంటే మిలిటరీ సర్వీసులో చేరడానికి నిరాకరణ అని నా భావం. ఇటువంటి నిరాకరణలు ఈ మధ్య తరచు జరుగుతున్నాయి.

"హైందవునికి లేఖ" అను దానిని నేనే వ్రాశాను. దాని అనువాదం చాలా బాగున్నది. శ్రీకృష్ణునికి సంబంధించిన పుస్తకం పేరు మాస్కోనుంచి మీకు తెలియజేస్తాను.

పోతే "పునర్జన్మ" అనేమాట విషయంలో—ఆ మాటను నా అంతట నేనే తీసివేయటం నా కిష్టం లేదు. ఎందుచేతనంటే ఆత్మ యొక్క అమరత్వంపైనను, దైవం న్యాయం ప్రేమ మొదలగు వాటి పైనను ఉండే విశ్వాసం ఎంతటి బలవత్తరమైనదో పునర్జన్మపై వుండే నమ్మకం అంత బలవత్తరమైనదికాదు. ఇది నా అభిప్రాయం. అయితే ఆ మాటను తొలగించే విషయంలో మీరు ఉచితమని తోచినరీతిగా చేయవచ్చు. మీ ప్రచురణకు నేనేమైనా సహాయపడగలిగితే అది నాకు అత్యంతానందకరమైన విషయం కాగలదు.

నా లేఖను హైందవ భాషలోనికి అనువదించి ముద్రించి పాఠకులకు పంచిపెట్టడం నాకు సమ్మతమే కాక సంతోషకరమైన విషయంకూడా.

కాని మతానికి సంబంధించిన విషయంలో వ్యాసరచనపోటీ అంటూ జరిపి ధనాశచూపి ప్రోత్సహించడం అంతమంచిదికాదనే నా అభిప్రాయం.

మీకు నా హృదయపూర్వక శుభాకాంక్షలు. మీతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపడం నాకు ఆనందకరమైన విషయం.

లియో టాల్‌స్టాయ్.

## 3. గాంధీజీ టాల్‌స్టాయికి వ్రాసిన లేఖ

జోన్స్‌బర్గ్
1910 ఏప్రిల్ 4

అయ్యా,

నేను తాత్కాలికంగా లండనులో వుండగా మీతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపిన సంగతి మీకు జ్ఞాపకమున్నదనుకుంటాను. మీపట్ల విధేయతగల అనుచరునిగా దీనితో నేను వ్రాసిన ఒక పుస్తకాన్ని మీకు పంపుతున్నాను.* దీనిని మొదట గుజరాతీభాషలో వ్రాసి తరువాత నేనే దీనిని ఆంగ్లంలోకి అనువదించాను. అయితే చిత్రమైన విషయమేమంటే మూలంలోని రచనమ భారత ప్రభుత్వం జప్తుచేసింది. కాబట్టి ఈపుస్తకాన్ని త్వరగా నేను ప్రకటించాను. మీకు శ్రమ కలుగజేయకూడదని నా అభిలాష. కాని మీ ఆరోగ్యం బాగావుండి, మీకు తీరిక సమయం ఉన్నట్లయితే దయచేసి ఈ పుస్తకాన్ని ఒకపర్యాయం చదివిచూడండి. దీనిపై మీ విమర్శ అమూల్యమైనదిగా నేనుభావిస్తాను. మీరు నాకు అనుమతి ఇచ్చినారు గనుక మీరువ్రాసిన "హైందవునికి లేఖ" అను రచనతాలూకు

* 1910 లో జోన్స్‌బర్గ్‌లో గాంధీజీ ప్రకటించన "ది ఇండియన్ హోమ్ రూలు" అంటే "భారత స్వరాజ్యం" అను గ్రంథం.

—అనువాదం.

కొన్ని ప్రతులను మీకు పంపుతున్నాను. ఇది ఒక భారతీయ భాషలోకి సూటా అనువదించబడింది.

భవదీయుడు,
యం. కె. గాంధి.

1909 అక్టోబరులో వ్రాసిన మొదటి ఉత్తరం కంటె గాంధీజీ వ్రాసిన ఈ రెండవ ఉత్తరం టాల్‌స్టాయిపై మరింత ప్రభావం వేసింది.

టాల్‌స్టాయి తమడైరీలో ఇలా వ్రాసుకున్నాడు:

1910 ఏప్రిల్ 19 : "ఈ ఉదయం ఇద్దరు జపాను దేశస్తులు వచ్చారు. కిరాతకులైన మనుషులు యూరపు నాగరికతను చూచుకొని మురిసిపోతున్నారు. కాని యూరపు నాగరికతలోగల లోపాలను, ఆ నాగరికత నిష్ప్రయోజకత్వాన్ని అర్థంచేసుకున్న ఒక హైందవునివద్ద నుంచి వచ్చిన పుస్తకం, దానితోపాటు ఒకలేఖ నన్నెంతో ఆనంద పరిచాయి."

ఏప్రిల్ 20 : "ఈ సాయంత్రం నాగరికతనుగూర్చి గాంధీజీ రచనను చదివాను. చాలా బాగుంది."

ఏప్రిల్ 21 "గాంధీని గూర్చి వ్రాయబడిన ఒక పుస్తకం* చదివాను. చాలా ముఖ్యమైన గ్రంథం. గ్రంథ రచయిత కొకలేఖ వ్రాయాలి."

ఏప్రిల్ 22 తేదీన వి. జి. చెర్కాఫ్‌కు వ్రాసిన లేఖలో టాల్‌స్టాయి ఇలా అన్నారు :

* 1909 లో లండనులో డోక్స్‌జోసెఫ్ జె వ్రాసి ప్రకటించిన "యం. కె. గాంధి, యాన్ ఇండియన్ పేట్రియాట్ ఇన్ సౌత్ ఆఫ్రికా" అంటే "యం. కె. గాంధీ - దక్షిణాఫ్రికాలో దేశభక్తిగల ఒక భారతీయుడు" అను గ్రంథం.

"నాకు ఒక లేఖతోపాటు వచ్చిన పుస్తకాన్ని నిన్నటి సాయంత్రం నుంచి చదువుతున్నాను. పుస్తకాన్ని పంపిన వ్యక్తిపేరు గాంధి. ఈయన హిందూ తత్వవేత్త. సత్యాగ్రహం అనే సాధనంతో బ్రిటీషు డొమినియన్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాటం సల్పుతున్నాడు. మనకతడు చాలా సన్నిహితుడు. ముఖ్యంగా నా అభిప్రాయాలు, ఆయన అభిప్రాయాలు చాలా సన్నిహితంగా ఉన్నాయి. ఆయన నా రచనలను చదివాడు. భారతీయ భాషలో ఆయన వ్రాసిన "ఇండియన్ హోమ్‌రూల్" అనే పుస్తకాన్ని బ్రిటీషు ప్రభుత్వం నిషేధించగా "హైందవునికి లేఖ" అను శీర్షికతో నేను చేసినరచనను ఆయన ఒక భారతీయ భాషలోకి అనువదించాడు. తన పుస్తకాన్ని గూర్చి ఆయన నా అభిప్రాయం కోరుతున్నాడు. నేనాయన కొక సుదీర్ఘమైన లేఖ వ్రాయదలచాను. నా లేఖను మీరు అనువదిస్తారా?"

డి. పి. మకోవిట్‌స్కీ డైరీలలో టాల్‌స్టాయిపై గాంధీజీ పుస్తకములు, ఆయన లేఖయొక్క ప్రభావం ఎంతటిదో విదితమవుతుంది. టాల్‌స్టాయి ఇలా అన్నారట: "గాంధీ 'ఇండియన్ హోమ్‌రూల్' అనే పుస్తకాన్ని వ్రాశాడు. ఆయన ఇంగ్లండుకు వ్యతిరేకంగా పోరాటం సల్పుతున్న పార్టీకి నాయకుడు. ఆయన జైలుకువెళ్ళాడు. ఆయనను గూర్చి వ్రాయబడిన గ్రంథం నాకు అందింది. ఆ గ్రంథం చాలా బాగున్నది. మత దృక్పథంగల ఒక హిందువుని దృష్టితో యూరపు నాగరికతనంతటినీ ఉదాత్తంగా విమర్శచేసిన గ్రంథం అది. ఆయన ఎలా లండను వచ్చాడు, ఎలా మాంసం తినడానికి అలవాటుపడ్డాడు, నాట్యం చేయడం ఎలా నేర్చుకున్నాడు, ఆ నాగరికతకు ఎలా లొంగిపోయ్యాడు, ఇదంతా తెలుపబడింది ఆ గ్రంథంలో. దక్షిణాఫ్రికాలో యుద్ధం ఆరంభమైంది. రంగుజాతులవారి పట్ల తెల్లవారి వైఖరిని ఆయన నిరసిస్తున్నాడు. పైగా అన్నిటికంటే గొప్ప తిరుగుబాటు సత్యాగ్రహమేనని ఆయన ప్రచారం చేస్తున్నాడు."

# 4. టాల్‌స్టాయి గాంధీజీకి వ్రాసిన లేఖ

ప్రియమిత్రమా,

మీ లేఖ "ఇండియన్ హోమ్ రూల్" అను మీ గ్రంథం ఇప్పుడే నాకు చేరాయి.

మీ గ్రంథాన్ని మిక్కిలి కుతూహలంతో చదివాను. ఎందుచేత నంటే అందులో మీరు ప్రస్తావించిన సత్యాగ్రహం అనే విషయం ఒక్క భారతదేశానికే గాక యావత్తు మానవజాతికి బహుప్రధానమైనది.

ఇంతకు క్రితం మీరు వ్రాసిన లేఖలను నేను చూడలేదు. కాని జె. డోస్* వ్రాసిన మీ జీవితచరిత్రను మాత్రం చదివాను. ఆ గ్రంథం కూడా చదవదగినది. దానిని చదివిన తర్వాత మీ లేఖను బాగా అర్థం చేసుకోగలిగాను.

ప్రస్తుతం నా ఆరోగ్యం బాగాలేదు. కాబట్టి మీ పుస్తకాన్నిగూర్చి, మీలేఖనుగూర్చి నేను వెలిబుచ్చవలసిన అభిప్రాయాన్ని ఇప్పుడే వ్రాయ లేను. వాటిని నేను చాలా మెచ్చుకుంటున్నాను. నా ఆరోగ్యం బాగుపడ గానే నా అభిప్రాయాలు మీకు వ్రాయగలను.

ఏప్రిల్ 25 (మే 28) 1910
యాస్నావాపోల్యానా

మీ మిత్రుడు, సోదరుడు
టాల్‌స్టాయ్

---

* టాల్‌స్టాయి ఆ గ్రంథకర్తపేరును డోక్స్ అని వ్రాయుటకు బదులుగా పొరపాటున డోస్ అని వ్రాశాడు.

## 5. గాంధీజీ టాల్‌స్టాయికి వ్రాసిన లేఖ

టెలిఫోన్ నెం. 1635, బాక్సు 6522,
టెలిగ్రాములు : "గాంధి"
ఎ. బి. సి. కోడ్ 5వ సంపుటం.

21 - 24 కోర్టుఛాంబర్సు
కార్నర్ రిసిక్ అండ్ ఆండర్సన్ స్ట్రీట్స
జోన్స్‌బర్గ్, 1910 ఆగస్టు 15

అయ్యా,

పోయిన మే నెల 8 తేదీనాటి మీలేఖ అందినది. కృతజ్ఞుడను. మీలేఖ కడుప్రోత్సాహకరంగా అవ్యాజమైన ప్రేమతో కూడివున్నది. నాచే రచింపబడిన "ఇండియన్ హోమ్‌రూల్" అనే పుస్తకం మీ ప్రశంసను పొందడం నాకు అమూల్యమైన విషయం. మీకు తగు సమయం వుండి, నాపుస్తకంపై మీరు దయతో వాగ్దానం చేసినట్లుగా సవివరంగా విమర్శ వ్రాసి పంపినట్లయితే మిక్కిలి కృతజ్ఞతతో స్వీకరించగలను.

టాల్‌స్టాయి క్షేత్రాన్ని గూర్చి మిస్టర్ కలెన్ బాచ్ మీకు వ్రాసే ఉన్నారు. ఆయన చాలాకాలంనుంచి నాకు మిత్రుడు. "మై కన్ఫెషన్స్" అంటే "నేను అంగీకరించిన విషయాలు" అనే మీగ్రంథంలో ప్రత్యక్షంగా మీరు వర్ణించినట్టి అనుభవాలను ఆయన ఎన్నిటినో పొందివున్నాడు. మీరచనలు మరే ఇతర రచనలు ఆయనలో అంతగా సంచలనం కలిగించ లేదు. ప్రపంచానికి మీరుచాటిన లక్ష్యాలను ఆదర్శంగా పెట్టుకొని వాటి ప్రకారం నడుచుకునే అభిలాషతో ఆయన తన క్షేత్రానికి నాతో సంప్ర దించినమీదటనే మీపేరు పెట్టుకున్నాడు.

ఆయన తన క్షేత్రాన్ని సత్యాగ్రహుల ఉపయోగార్థం ఇచ్చి తన ఔదార్యాన్ని ప్రకటించాడు. ఇందుతో మీకు "ఇండియన్ ఒపీనియన్" "భారతీయ అభిప్రాయం" పత్రికల ప్రతుల పంపుతున్నాను. పైక్షేత్రానికి సంబంధించిన వివరాలు దయచేసి ఈ పత్రికలలో చూడగలరు.

ఈవివరాలన్నిటితో మీకు శ్రమ కలుగజేయడం నా అభిమతం కాదు. కాని ట్రాన్స్‌వాల్ సత్యాగ్రహోద్యమంపట్ల మీరు ఆసక్తికలిగి వున్నారు గనుక వీటిని మీకు పంపుతున్నందుకు మన్నించగలరు.

భవదీయుడు,
యం. కె. గాంధి

కౌంట్ లియో టాల్‌స్టాయ్
యాస్నావా పోల్యానా

పై ఉత్తరంతోపాటు టాల్‌స్టాయికి హెర్మన్ కల్లెన్ బాచ్ నుంచి మరొక ఉత్తరం వచ్చింది. హెర్మన్ కల్లెన్ బాచ్ గాంధీజీకి మిత్రుడు, అనుచరుడు కూడా. ఈయన ధనికుడు. గొప్పనిర్మాత. ట్రాన్స్‌వాల్‌లో టాల్‌స్టాయిక్షేత్రానికి ఈయనే వ్యవస్థాపకుడు. బ్రిటిషు అధికారుల వర్ణవివక్షణ విధానానికి గురైన దక్షిణాఫ్రికా భారతీయులకు ఈక్షేత్రం ఆశ్రయంగా ఉంటూవచ్చింది.

ఈదిగువన కల్లెన్ బాచ్ వ్రాసిన ఉత్తరం ఉదహరించబడింది.

టాల్‌స్టాయి క్షేత్రం, లాలేస్టేషన్
ట్రాన్స్‌వాల్ 1910 ఆగస్టు 14

అయ్యా,

మీ అనుమతి తీసుకోకుండానే నా క్షేత్రానికి టాల్‌స్టాయిక్షేత్రం అని పేరు పెట్టాను. నేను మీ రచన లనేకం చదివాను. మీ ప్రబోధాల ప్రభావం నాలో పరివర్తన కలిగించింది.

దక్షిణాఫ్రికాలో భారతీయ సమాజానికి నాయకుడైన యం. కె. గాంధీ నాతోటే ఉంటున్నారు. ఆయన నాకు మిత్రుడని చెప్పుకోవడం గొప్ప గౌరవమని నేను భావిస్తున్నాను. నా క్షేత్రం 1100 ఎకరాలది.

దాన్ని సత్యాగ్రహులు, వారి కుటుంబాలు ఉపయోగించుకోవడానికై నేను గాంధీజీకి అప్పగించాను.

నా క్షేత్రానికి మీపేరును ఉపయోగించుకున్నాను. కాబట్టి మీకీ సంజాయిషీ చెప్పుకోవడం నా కర్తవ్యమని భావించి ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. మీ పేరును సద్వినియోగం చేసుకున్నాను. గనుక మీరు ప్రపంచానికి నిర్భయంగా చాటినట్టి ఆదర్శాలకు అనుగుణంగా నడచుకోవడానికి సర్వదా ప్రయత్నించగలనని ఇందుమూలంగా ప్రతిజ్ఞగైకొంటున్నాను.

మీ విధేయుడు,
హెచ్. కల్లెన్ బాచ్

గాంధీజీ, కల్లెన్‌బాచ్‌గారలు వ్రాసిన పైలేఖలు, గాంధీజీ పంపిన భారతీయ పత్రికలు టాల్‌స్టాయికి గాంధిజీపైగల ఆసక్తిని ఇనుమడింప జేశాయి.

1910 సెప్టెంబరు 6 వ తేదీన టాల్‌స్టాయి తమ డైరీలో ఇలా వ్రాసుకున్నారు : ట్రాన్స్‌వాల్ నుండి సత్యాగ్రహుల క్షేత్రానికి సంబంధించిన ఆహ్లాదకరమైన వార్త వచ్చింది.

ఈ కాలంలోనే టాల్‌స్టాయికీ, ఆయన భార్యకూ పడిరాక ఇద్దరికి వుండే అన్యోన్యత చెడిపోతున్నందువల్ల ఆయనమనస్సు బాగాలేక ఆరోగ్యంకూడా క్షీణిస్తూ వచ్చింది. అయినా ఆయన ఉత్తరం అందుకున్న వెంటనే గాంధీజీకి ప్రత్యుత్తరం వ్రాశారు.

సెప్టెంబరు 6 తేదీన డి. పి. మకోవిట్‌స్కీ ఇలా వ్రాశారు : "ట్రాన్స్‌వాల్‌లో జోన్స్‌బర్గ్‌లో వున్న భారతీయ సత్యాగ్రహుల నాయకుడైన గాంధీకి 5 వ తేదీనుంచి 6 వ తేదీ సాయంత్రం వరకు లెవ్ నికోలాయివిచ్ చెబుతుండగా నేను ఒక ఉత్తరం వ్రాశాను.

మరునటిరోజు అంటే సెప్టెంబరు 7 వ తేదీన టాల్‌స్టాయి తమ ఉత్తరంలో సవరణలు చేసి, అదనంగా కొన్ని చేర్పులుచేసి, దాన్ని అనువదించ వలసిందిగా చెర్కాఫ్‌కు పంపారు. 1910 సెప్టెంబరు 14 తేదీన టాల్‌స్టాయికి చెర్కాఫ్ ఇలా వ్రాశారు :

"నేను దీనితోపాటు :

ట్రాన్స్‌వాల్‌లోవున్న గాంధీకి మీరు వ్రాసినలేఖయొక్క అనువాదాన్ని పంపుతున్నాను. నేను దీని ప్రతినితీయవలసి వున్నది. గమక దయచేసి దీనిపై సంతకం పెట్టి నాకు పంపించండి. ఆ తరువాత దీనిని నేనే గాంధీకి పంపగలను."

(2) "మీ తరపున నేను గాంధీకి, ఆయన మిత్రుడు కల్లెన్‌బాచ్‌కు వ్రాసిన లేఖలసంగతి—మీరు నాకు ఆ లేఖలు దుషాన్* ద్వారా పంపారు. ఆ లేఖలలో ప్రతిదానిపై మీరు 'చాలాబాగాఉన్నది' అని వ్రాశారు. కాని ఆలేఖలను ఏమిచేయవలసిందీ తెలుపలేదు. బహుశా వాటికి నేను జవాబు వ్రాయవలెనని మీరు వాటిని నాకు పంపారని నేను అనుకున్నాను. నేను వ్రాసే ప్రత్యుత్తరాలను ఆమోదించినట్లయితే వాటిని మీరు నాకు తిరిగి పంపగలరు."

"గాంధీకి నేను వ్రాసిన ఉత్తరాన్నిబట్టి నేను మీ లేఖను ఇంగ్లండులో డేనియల్† యొక్క "ఓపెన్‌రోడ్" పత్రికలో మీకు అభ్యంతరం లేకపోతే ప్రకటించదలచినట్లుగా మీకు వ్యక్తం కాగలదు. ఇంగ్లండులో మిసెస్ మేయో అనే ఆమె మనకు మిత్రురాలు. మన ఆదర్శాలకు తోడ్పడవలెనని ఆమె ఉద్దేశిస్తున్నది. కనుక ఆమెను కలుసుకొని మాట్లాడ వలసిందిగా నేను గాంధీకి వ్రాస్తున్నాను."

---

* అంటే డాక్టర్ డి. పి. మకొవిట్‌స్కీ.

† డేనియల్—టాల్‌స్టాయికి అనుచరుడు. బ్రిటిషువాడు, మంచిరచయిత ప్రకాశకుడుకూడా. అనేక టాల్‌స్టాయి పత్రికలకు సంపాదకుడు.

సెప్టెంబరు 17 తేదీన టాల్‌స్టాయి చెర్కాఫ్‌కు ఇలా ప్రత్యుత్తరం వ్రాశాడు :

"(1) గాంధీకి నేను వ్రాసిన లేఖయొక్క మీ అనువాదాన్ని చదివాను. లేఖయొక్క శైలి (అనువాదం కాదు) బాగాలేదు. కాని అంతకంటె బాగా వ్రాయలేక పోయినప్పుడు నేను చేసేదేముంది? అనువాదం మాత్రం నాకు తెలిసినంతవరకు సాఫీగా వున్నది. మూలంలోని అర్థాన్ని స్పష్టపరుస్తున్నది"

"(2) గాంధీకి, కల్లెన్‌బాచ్‌కు అటువంటి మంచి ఉత్తరాలు మీరు వ్రాయడం, ఆ లేఖను డేనియల్‌కు ఇవ్వడం, మిసెస్ మేయోతో కలిసి సంప్రదించవలసిందిగా గాంధీకి వ్రాయడం—అంతా బాగావున్నది."

గాంధీకి, కల్లెన్‌బాచ్‌కు వి. జి. చెర్కాఫ్ వ్రాసిన లేఖలు ఈదిగువ ఉదహరింపబడినవి.

1910 సెప్టెంబరు 11

ఎం. కె. గాంధీకి

అయ్యా,

ఆగస్టు 15 తేదీన మీరు వ్రాసిన ఉత్తరం అందినట్లు నా మిత్రుడు లియోటాల్‌స్టాయి మీకు వ్రాయమని నన్ను కోరినారు. దానికి ఆయన సెప్టెంబరు 7 తేదీన రష్యన్ భాషలో మీకు వ్రాసిన ఉత్తరాన్ని ఇంగ్లీషులోకి అనువదించవలసిందిగాకూడా నన్ను ఆయన కోరినారు.

మిస్టర్ కల్లెన్‌బాచ్‌నుగూర్చి మీరు వ్రాసిన విషయాలు టాల్‌స్టాయిని చాలా ఆనంద పరచాయి. ఆయన తరఫున మిస్టర్ కల్లెన్‌బాచ్ లేఖకు జవాబు వ్రాయవలసిందనికూడా టాల్‌స్టాయి నన్ను కోరారు.

టాల్‌స్టాయి మీకు వ్రాసిన ఉత్తరంయొక్క అనువాదాన్ని ఈ ఉత్తరంతో జతపరుస్తున్నాను. ఆ ఉత్తరాన్నిబట్టి మీ ఉద్యమాన్ని ఆయన

ఎంతగా ప్రశంసిస్తున్నారో మీకు తెలుస్తుంది. ఈ ఉద్యమంలో మీకు విజయం చేకూరాలని కోరుతూ మీకూ మీ సహచరులకూ తమ శుభాకాంక్షలు పంపమన్నారు. టాల్‌స్టాయి అనువాదం చేయడంలో ఆంగ్లభాషలో దొర్లిన తప్పులకు నన్ను మన్నించవలసిందిగా వేడుతున్నాను. నేను రష్యాదేశంలో పల్లెప్రాంతంలో ఉండడంచేత నా తప్పులను సరిదిద్దుకోవడానికి ఏ ఆంగ్లేయుని సహాయం పొందలేక పోతున్నాను.

టాల్‌స్టాయి అనుమతితో ఆయన మీకు వ్రాసిన ఉత్తరాన్ని లండను లోని కొందరు మా మిత్రులు అచ్చువేస్తున్న ఒక పత్రికలో ప్రచురిస్తున్నాము. ఆ పత్రికప్రతిఒకటి, ఇంకా ఫ్రీ ఏజ్ ప్రెస్* వారు ప్రకటించిన టాల్‌స్టాయి ఇంగ్లీషు అనువాదాల ప్రచురణలు కొన్నిటిని మీకు త్వరలోనే పంపుతాము.

మీ ఉద్యమాన్ని గూర్చి ఇంగ్లండులో ఇంకా ఎక్కువగా అందరికీ తెలియవలసిన ఆవశ్యకతవున్నది. టాల్‌స్టాయికీ, నాకూ మిత్రురాలైన ఒకామె గ్లాస్గో పట్టణంలో ఉన్నది. ఆమె పేరు మిసెస్ ఫైవీ మేయో. మీతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి సంప్రదించవలసిందిగా ఆమెకు నేను వ్రాస్తున్నాను. ఆమెకు మంచి సాహిత్యపరిజ్ఞానం కూడా కలదు. రచయిత్రిగా ఆమె ఇంగ్లండులో మంచి పేరుప్రఖ్యాతులు పొందింది. మీ ప్రచురణల నన్నిటినీ ఆమెకు అందజేసినట్లయితే బహుశా మీ ఉద్యమాన్ని గూర్చి ఒక వ్యాసం వ్రాయవచ్చు. ఆ వ్యాసంగనుక ఇంగ్లండులో ప్రచురింపబడిందంటే మీరు చేస్తున్నపని అక్కడ నలుగుర్నీ ఆకర్షిస్తుంది. మిసెస్‌మేయో స్వయంగా మీకు ఉత్తరం వ్రాయవచ్చు.

శుభాకాంక్షలతో.

భవదీయుడు

వి. చెర్ట్కాఫ్.

---

* ఇది ఒక ఆంగ్ల ప్రచురణ సంస్థ, ఇది వి. జి. చెర్ట్కాఫ్‌కు చెందినది. టాల్‌స్టాయి రచనల చవుక ప్రచురణలను ఈ సంస్థవారే ప్రకటించారు.

దయచేసి మిస్టర్ కల్లెన్‌బాచ్‌కు ఇందుతో పంపబడిన ఉత్తరాన్ని అందజేయగలరు.

1910 సెప్టెంబరు 14

హెచ్. కల్లెన్‌బాచ్‌కు

అయ్యా,

ఆగస్టు 14 తేదీన మీరు టాల్‌స్టాయికి వ్రాసిన ఉత్తరానికి జవాబు వ్రాయవలసిందిగా ఆయన నన్ను కోరారు. గాంధీ ప్రారంభించిన ఉద్యమం పైనను, దానికి మీరు ఉదారంగా చేస్తున్న సహాయంపట్లను టాల్‌స్టాయి మిక్కిలి ఆసక్తి కలిగివున్నారు. వారినిగూర్చి మీరు వ్రాసిన వాక్యాలు చదువుకొని ఆయన చాలా సంతోషించారు. మీ సుహృద్భావానికి వారి కృతజ్ఞతలు తెలుపమన్నారు. మీరు చేస్తున్నకృషి ఫలప్రదం కావాలని టాల్‌స్టాయి ఆకాంక్షిస్తున్నారు.

భవదీయుడు

వి. చెర్ట్కాఫ్

## 6. టాల్‌స్టాయి గాంధీజీకి వ్రాసిన లేఖ

కోచెటీ

1910 సెప్టెంబరు 7

అయ్యా.

"ఇండియన్ ఒపీనియన్" అనే మీ పత్రిక అందినది. సత్యాగ్రహులను గూర్చి ఆ పత్రికలో వ్రాయబడిన విశేషాలు చదివి ఎంతో సంతోషించాను. ఈ సందర్భంలో నా అభిప్రాయాలను, నాలో కలిగిన భావాలను మీకు తెలియజేస్తున్నాను.

నేను ఎంత ఎక్కువకాలం బ్రతుకుతానో అంత ఎక్కువగా మీ అహింసాత్మక సిద్ధాంతాన్నిగూర్చి హెచ్చుగా ఆలోచించి దానిని ఇతరులకు తెలియజెప్పవలెనని అభిలషిస్తున్నాను. ముఖ్యంగా నాకు మరణం సమీపిస్తున్నదని నేను అనుకుంటున్న ఈ తరుణంలో నా ఈ అభిలాష మరీ అధికతరమవుతున్నది. అహింస అనేది ఏమిటో కాదు. అది ప్రేమ సిద్ధాంతం. ఆ సిద్ధాంతాన్ని వక్ర భాష్యాలు మారుమాపు చేయలేవు.

ప్రేమ అంటే ఐక్యతకోసం మానవ ఆత్మలుచేసే ప్రయత్నమూ, ఆ ప్రయత్నంలో జరిగే పనులు - మానవ జీవితంలో ప్రేమ మహోన్నతమైన ఏకైక సూత్రం. ప్రతిమానవుడు ఈ సూత్రాన్ని అర్థంచేసుకో గలుగుతాడు. అయితే తప్పుడు బోధలవల్ల పెడమార్గం పట్టినవారుమాత్రం దీన్ని అర్థంచేసుకోలేరు. పిల్లలవిషయంలో మనం ఇదే చూస్తున్నాము. ఈ సూత్రాన్ని ప్రపంచంలోని మహర్షులంతా—వారు భారతీయులైనా, చైనా దేశస్థులైనా, యూదులైనా, గ్రీకులైనా, రోమనులైనా—అంతా ఏకాభిప్రాయంగా ప్రవచించి ఉన్నారు. ఈ సూత్రాన్ని అందరికంటె క్రీస్తు బాగా బోధించాడని నా భావం. సమస్త సూత్రాలు, సర్వప్రవర్తలు ఆ సూత్రంలోనే ఇమిడి వున్నారు. ఆ సూత్రం ఎటువంటి మార్పులు పొందుతున్నదో, ఇంకా ముందుముందు ఎటువంటిమార్పులు పొందగలదో ఇదంతా ముందుగా ఊహించాడు కాబట్టే క్రీస్తు దీనికి ప్రమాదం కలదనీ, ప్రాపంచిక వాంఛలతో జీవించే మనుషులు ఆ వాంఛలను తీర్చుకోడానికీ, తమకున్నవాటిని సంరక్షించుకోడానికీ బలప్రయోగం చేస్తారనీ, అంటే దెబ్బకుదెబ్బ తీస్తారనీ, తాము కోల్పోయినవాటిని తిరిగి బలప్రయోగంతో సాధిస్తారనీ అన్నాడు. జీవితం ప్రాతిపదికగా హింస అనేది ప్రేమకు విరుద్ధమైనదనీ, ఏ సందర్భంలోనైనా హింసను ఆమోదించినట్లయితే జీవిత సూత్రమే నిరర్థకమవుతుందనీ అప్పుడా సూత్రమే త్రోసిరాజనదగునని క్రీస్తుకు తెలుసు. కైస్తవనాగరికతయావత్తు పైకి అంత ఉజ్జ్వలంగా

కన్పిస్తున్నప్పటికీ అది ఈ అపార్థంపైననే, ఈ వైరుధ్యంపైననే ఆధారపడి వున్నది. ఈ అపార్థం ఒకొక్కప్పుడు బాహ్యంగా మాత్రమే వున్నట్లు తోస్తున్నది. ఒకప్పుడు విపరీతంగా కన్పిస్తుంది. మరొకప్పుడు బుద్ధి పూర్వకంగానే అవలంబించబడినట్లు అనిపిస్తుంది. కాని ఎక్కువగా తెలిసి జరిగింది కాదని మనకు స్పష్టమవుతుంది.

ప్రేమకూ, హింసకూ పొత్తిగా పొసగదు. హింసవుంటే ప్రేమ రహితమై పోతుంది. ప్రేమభావం వుంటే హింస జరుగదు. జీవిత సూత్రంలో ప్రేమ వ్యర్థమై పోయిందంటే ఇక మిగిలేది హింస మాత్రమే. అంటే బలవంతుల అధికారమన్నమాట. క్రైస్తవ ప్రపంచం 19 శతాబ్దాలవరకు అలాగే వుండింది. మానవులు తమ జీవితాలను వెళ్ళ బుచ్చుకోవడంకోసం హింసను అనుసరించారన్నమాట వాస్తవమే. ఇతర మతాలవారికంటె, ఇతర జాతులవారికంటె క్రైస్తవ జాతిఅవారి జీవితం పూర్తిగా భిన్నమైనది. ఎందుచేతనంటే ఇతరమతాల బోధనల కంటె క్రైస్తవమత బోధనలో ప్రేమసూత్రం విస్పష్టంగా అసందిగ్ధంగా నిర్వచింపబడింది. ఆ సూత్రాన్ని క్రైస్తవ ప్రపంచప్రజలు, ఎంతో గౌరవ భావంతో అంగీకరించారుకూడా. కాని ఒకవైపు అలా అంగీకరిస్తూనే హింసాయుత చర్యలకుదిగి, హింసపైననే తమ జీవిత సౌధాలు నిర్మించు కున్నారు. కనుక క్రైస్తవజాతుల జీవితం యావత్తు పరస్పర వైరు ధ్యంతో కూడివున్నది. అంటే వారుచెప్పేదానికీ, వారి జీవితమార్గాలకీ ఎంతో అంతరం వున్నది. వారు ప్రేమను జీవితసూత్రంగా అంగీక రిస్తారు. కాని హింసను ఒక అవసరంగా అనేకరూపాలలో, అంటే పాల నాధికారం, న్యాయస్థానాలు, సైన్యాలు, మొదలైనవాటి రూపంలో ఆచరిస్తు న్నారు. క్రైస్తవప్రపంచ ప్రజలు ఆధునికంగా పురోగమించినకొద్దీ ఈ వైరుధ్యంకూడా హెచ్చుతూ పోయి ఇటీవల పతాకస్థాయికి చేరుకుంది.

ఇప్పుడు అసలు ప్రశ్న ఇది: జీవితంలో ఏ మతానికి చెందిన నైతిక సూత్రాలను అంగీకరించకుండా బలవంతులైన అధికార దర్పంలోనే గడుపుకుపోవడమా? లేక బలవంతంగా వసూలుచేయబడుతున్న ఈ పన్నులను, ఇప్పుడున్న న్యాయవ్యవస్థను, పోలీసులను, సైన్యాలనురద్దు చేయడమా?

గత వసంతకాలంలో మాస్కోలోని ఒకానొక మహిళాసంస్థలో మతబోధల పరీక్ష జరిగింది. అందులో ఒక మతబోధకుడు, ఆయన తరువాత అటెండింగ్ బిషప్ అచటి బాలికలను కమాండ్‌మెంట్సు అంటే క్రైస్తవమత ఆజ్ఞలనుగూర్చి ముఖ్యంగా ఆరవ కమాండ్‌మెంటు* ను గూర్చి ప్రశ్నించారు. కమాండ్‌మెంటును గూర్చిన ప్రశ్నకు సరియైన సమాధానం ఇవ్వబడినట్లయితే బిషప్ సాధారణంగా మరో ప్రశ్న అడుగుతాడు. చంపడాన్ని ఎల్లప్పుడు అన్ని సందర్భాలలోను మతం నిషేధించిందా? ఇదీ ప్రశ్న. ఈ ప్రశ్నకు పాపం ఆ బాలికలు ఏంచెప్తారు? గురువులు తమకు ఏం బోధచేశారో అదే జవాబుచెప్పారు. 'ఎల్లప్పుడూ నిషేధింపబడలేదు. యుద్ధ సమయంలోను, అంతేగాక నేరస్తులను† ఉరి తీసే సమయంలోను నిషేధం లేదు.' అని బాలికలు సమాధానం చెప్పారు. కాని ఒక అమ్మాయిని (నేను చెప్పేది కల్పితమైన విషయంకాదు. ఒకరు స్వయంగా చూచి నాకు చెప్పినసంగతి.) "చంపడము ఎల్లప్పుడూ పాపకార్యమేనా" అని రెండవసారి సాధారణంగా ప్రశ్నించేటట్లుగానే ఆ మతాధికారులు అడిగారు. ఆ అమ్మాయి గట్టిగా "అవును పాపకార్యమే."

---

* మోజెస్ సూత్రావళిలో ఆరవది. "మీరు చంపరాదు" అనేది.

† కేట్‌చిస్మ్ ఆఫ్ ది గ్రీక్ ఆర్థడాక్సుచర్చి" యొక్క ఆరవ కమాండ్‌మెంటు జారిస్టు రష్యాలోని అన్ని స్కూళ్ళలోను నిర్బంధపఠనాంశం. కాని దానికి వారు బోధించిన నిర్వచనం అలావుంది!

అని బదులుచెప్పింది. అంతేకాక చంపడము ఎల్లప్పుడూ నిషిద్ధమేననీ, "ఓల్డు టెస్టామెంటు"లో కూడా నిషేధింపబడిందనీ, క్రీస్తుకూడా నిషేధించాడనీ, చంపడమేగాక తోడి మానవునికి చేసే ప్రతి అకృత్యం, ప్రతి ఒక్క అపకారం నిషిద్ధమేననీ ఆ అమ్మాయి ధైర్యంగా సమాధానం చెప్పింది. దానితో బిషప్‌గారి భేషజం, ఆయన సంభాషణాశీవి అక్కడ సాగలేదు. చివరకు ఆ బాలికయే జయించింది.

పత్రికలలో మనం ఈనాడు అనేక కొత్త వార్తలు చదువుకొని వాటిని చర్చించుకుంటూ వుంటాము. విమానయానం విజయవంతంగా చేయబడుతున్నదట. ఒకరాజ్యానికీ మరొక రాజ్యానికీ రాయబార సంబంధాలు కొత్తరకంగా ఏర్పడుతున్నాయట. వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు అనేక కొత్తవిషయాలను కనిపెడుతున్నారట. తమాషా క్లబ్బులు వెలుస్తున్నాయట. రకరకాల సంఘాలు ఏర్పడుతున్నాయట. కళాఖండాలు నిర్మింపబడుతున్నాయట. వీటన్నిటిని గూర్చి మనం చర్చిస్తాముగాని ఆ బాలిక చెప్పిన సమాధానాన్ని గూర్చి మాత్రం ఏమీమాట్లాడం. కాని ఆ సమాధానాన్ని అలా నిర్లక్ష్యం చెయ్యడానికి వీలులేదు. ఎందుకంటే క్రైస్తవ ప్రపంచంలోవున్న ప్రతిమనిషి కొద్దో గొప్పో దాని అనుభూతినిపొందుతూనే వున్నాడు. సోషలిజం, కమ్యూనిజం, అరాచకవాదం, సాల్వేషన్ ఆర్మీ* స్థాపన, నేరాల పెరుగుదల, ప్రజలలో నిరుద్యోగం, ధనికుల విలాసమయ జీవితం, పేదలదీనస్థితి, ఆత్మహత్యలసంఖ్య నానాటికీ పెరగడం— ఇదంతా ఏమిటి? ఇది క్రైస్తవప్రపంచంలో ప్రవచనాలకూ, ఆచరణకూ వున్న వైరుధ్యం. దీన్ని ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక విధంగా పరిష్కారం చేయక తప్పదు. లేకపోతే గత్యతరంలేదు. ఏదో

* సాల్వేషన్ ఆర్మీ:– ఇది బ్రిటిషు మతధార్మిక సంస్థ. అయితే ఇది సైనిక పద్ధతులప్రకారం పనిచేస్తూ వుంటుంది.

ఒకవిధంగాకాదు, సరియైన విధంగానే—అంటే హింసను ఖండించి ప్రేమసూత్రాన్ని అంగీకరించడం ద్వారానే. అంగీకరించడమంటే అవలంబించి ఆచరించడమే. కాబట్టి ట్రాన్సువాల్‌లో మీరుచేస్తున్న పని అత్యంత ముఖ్యమైనది. ప్రపంచంలో ఇప్పుడు జరుగుతున్న వ్యవహారా లన్నిటిలోను ప్రధానమైనది మీ ఉద్యమం. చివరకీ ఉద్యమంలో ఒక్క క్రైస్తవజాతులేకాక సమస్త ప్రపంచ ప్రజలు పాల్గొనేరోజు వస్తుంది.

మీవంటి ఉద్యమం ఇక్కడ రష్యాలోకూడా ఆరంభమైనది; అయితే మరొక రూపంలో. ఈదేశంలో సైన్యం ఆయేటి కాయేడు హెచ్చు అవుతూ వున్నది. ప్రజలు ఆ సైన్యంలో చేర నిరాకరిస్తున్నారు. మీ సత్యాగ్రహులసంఖ్య ఎంత అల్పమైనా, ఇక్కడ రష్యాలో సైన్యంలో చేర నిరాకరిస్తున్నవారి సంఖ్య ఎంత తక్కువైనా, ఈ ఉభయులూ దేవుడు తమకే చివరకు విజయం కలుగజేస్తాడని విశ్వసిస్తున్నారు. ఆ విశ్వాసమే చివరకు సత్ఫలితమిస్తుంది. కారణమేమంటే మానవులకంటె భగవంతుడే సర్వశక్తి సంపన్నుడు.

క్రైస్తవ జాతులలో ప్రస్తుతం క్రైస్తవమతాన్నిగూర్చి చెప్పబడు తున్న అపప్రవచనాలు, యుద్ధాలలో భారీయెత్తున మనుషులను చంపడానికై సైన్యాలను ఆయుధాలను ఏర్పాటు చేసుకోవడం—ఇదంతా పరస్పర వైరుధ్యం. త్వరగానో లేక నెమ్మదిగానో ఇది బైటపడి అటు అధికారానికి ఆలంబనమైన క్రైస్తవమతాన్ని నాశనం చేయడమో, లేక వారు పోషిస్తూ వారి కత్యంత అవసరంగా మారిన సైన్యాలను హింసయొక్క వివిధరూపాలను నాశనం చేయడమో జరుగుతుంది. ఈ వైరుధ్యాన్ని అన్ని ప్రభుత్వాలు—మీ బ్రిటిషు ప్రభుత్వం, మా రష్యాప్రభుత్వం గమనిస్తూనే వున్నాయి. అయితే ఇక్కడ మేము రష్యాలో చూస్తున్నట్లుగాను,

మీ పత్రికలోని వ్యాసములను బట్టి అక్కడ జరుగుతున్నట్లుగాను ఈ వైరుధ్యాన్ని ఆయా ప్రభుత్వాలు స్వయం రక్షణ దృష్ట్యా మాత్రమే అనుస రిస్తున్నాయి. తమకు ముఖ్యమైన ప్రమాదం ఎక్కడ కలదో ప్రభుత్వాలు వెంటనే పసికడతాయి. ప్రత్యేకంగా ఈ సందర్భం ఆప్రభుత్వాల శ్రేయస్సు సమస్యను అటుండనిచ్చి, అవి అసలు వుండడమా లేక పూడడమా అన్న సమస్యను తెచ్చిపెట్టింది. కాబట్టే ఆయాప్రభుత్వాలు అలా వ్యవహ రిస్తున్నాయి.

భవదీయుడు
లియో టాల్‌స్టాయి

వి. జి. చెర్కాఫ్ పై లేఖయొక్క ఆంగ్లానువాదాన్ని ఆమోదం కొరకై టాల్‌స్టాయికి పంపి, ఆ తరువాత దాన్ని రష్యన్ భాషలోని మూలంతో సహా ఇంగ్లండులో వున్న ఎ. డి. జిర్నిస్‌కు పంపి, అక్కడ నుంచి దాన్ని గాంధీజీకి పంపవలసిందిగా కోరాడు. అయితే అప్పుడు ఎ. డి. జిర్నిస్ జబ్బుగా వున్నందువల్ల ఆ ఉత్తరాన్ని ఆయన నవంబరు 1 వ తేదీవరకు పంపనేలేదు. చివరకు ఉత్తరం టాల్‌స్టాయి కొద్దిరోజు లకు చనిపోతాడనగా ట్రాన్సువాల్‌లో గాంధీజీకి చేరింది. అందుచేత దీనికి గాంధీజీ ప్రత్యుత్తరం వ్రాయలేకపొయ్యారు.

అయితే పైలేఖయొక్క ఆంగ్లానువాదం గాంధీజీకి నచ్చలేదు. మళ్ళీ పాలిన్ పాడ్లాక్చక్ అనే ఆయనతో మరొక అనువాదం చేయించి, గాంధీజీ దానిని 1910 నవంబరు 26 తేదీ "ఇండియన్ ఒపీనియన్" పత్రికలో ప్రచురించారు. కొన్ని సంవత్సరాల తరువాత 1914లో దక్షిణా ఫ్రికా భారతీయులు తమ పౌరహక్కులకొరకై జరిపిన పోరాటంలో

విజయంపొందిన సందర్భంలో ఆ "సువర్ణ సందర్భం" సూచకంగా "ఇండియన్ ఒపీనియన్" పత్రిక "స్వర్ణసంచిక"లో టాల్‌స్టాయి లేఖను గాంధీజీ మరొకమారు ప్రకటించారు. అదే సంచికలో టాల్‌స్టాయి చిత్రం కూడా ముద్రింపబడింది. ఆ చిత్రంక్రింద "రష్యాదేశానికి చెందిన ఈమహారచయిత 1906 నుంచి 1914 వరకు జరిగిన దక్షిణాఫ్రికా భారతీయుల పోరాటానికి సానుభూతి తెలిపి ప్రోత్సహించిన వారిలో ముఖ్యుడు" అనికూడా వ్రాయబడింది.*





* భారత, సోవియట్ మిత్రమండలివారి "ఇస్కస్" సంచికనుంచి కృతజ్ఞతతో స్వీకరణ.

# దేశోద్ధారక గ్రంథమాల

ఆంధ్ర సోదరులకు అవసర గ్రంథముల నందించు ఆశయముతో బహుధాన్య (౧౯౩౮) సంవత్సరంలో కీ.శే. దేశోద్ధారక, విశ్వదాత, కళా ప్రపూర్ణ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి స్మారక చిహ్నముగా స్థాపింపబడిన ఈ గ్రంథమాలద్వారా లోగా ౧౨ ప్రచురణములు దేశీయుల కందజేసినాము. ఆ రోజుల్లో విజ్ఞానము నిచ్చి, స్వాభిమానమును పురి కొల్పి, సత్వర కర్తవ్యమును తెలుపు గ్రంథములను ప్రచురించి దేశభక్తుల యొక్కయు, మేధావంతులయొక్కయు మన్ననలను పొందినాము. పిమ్మట మొత్తము భారతదేశముతోపాటు హైదరాబాదులో యేర్పడిన రాజకీయ అసాధారణ పరిస్థితులలో గ్రంథమాల ౧౯౪౨ లో ఆగిపోయింది. ౧౦ సంవత్సరముల తర్వాత కొంత స్థిమితము కలిగి, తిరిగి గ్రంథ ప్రచురణకు పూనుకొను అవకాశము కలిగింది. గ్రంథమాల స్థాపన కాలములో మాముందుండిన కర్తవ్యము నేటివరకు తీరలేదని భావిస్తున్నాము.

'మనిషి యే పంథా నవలంబించవలయునో అని ఆలోచించుటకు ముందు వివిధ పంథాలను తెలిసికొనుట ముఖ్యము'. కాబట్టి మేము ప్రచురించు ప్రతి గ్రంథము దేశీయుల ఆకాంక్షలను, హక్కులను, బాధ్యతలను దృష్టియందుంచుకొని, కర్తవ్యములను సూచించునదిగా నుండును.

ఇట్టి మా కృషికి చేయూతనిచ్చి మా ఆశయ సఫలతకు దేశీయులు మమ్ము ప్రోత్సహించెదరని విశ్వసిస్తూ, విజ్ఞులగువారి సర్వసహాయాలపై మాత్రమే ఈ మా వ్యవస్థను నిర్వహించ గలుగుదుమని విన్నవిస్తున్నాము.

పది రూపాయలకు తక్కువకాని విరాళమును మీ నుండి అభ్యర్థిస్తున్నాము. రూపాయకు రెండు అణాల హెచ్చింపు ప్రకారం మీకు గ్రంథాలు క్రమంగా అందించెదము.

3—5—1027
నారాయణగూడ
హైదరాబాదు

ఇట్లు విన్నవించు
వట్టికోట ఆళ్వారుస్వామి
స్థాపకుడు, ప్రకాశకుడు

# ప్రశంసలు

"ఈ గ్రంథమాలరూపమున తమరు చేయుచున్న ఆంధ్రభాషా సేవ ప్రశంసనీయమై యున్నది."

*—ఆంధ్ర పితామహ శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులు*

"ఆంధ్రుల విజ్ఞానాభివృద్ధికి శ్రమించునట్టి వీరి గ్రంథమాలను అందరూ ఆదరించి తమ విధిని నెరవేర్చ వలసియుండును".

*—కీ. శే. సురవరము ప్రతాపరెడ్డి*

"దేశోద్ధారక గ్రంథమాలను స్థాపించి ఆంధ్రదేశమునకు గొప్ప భాషాసేవ చేసిన దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారిని చిరస్మరణీయులుగా చేసియున్నారు".

*—శ్రీ కొండా వెంకట రంగారెడ్డి*

"దేశీయులందరు గ్రంథమాలయొక్క ప్రచురణములను పొంది ఈ కార్యమును జయప్రదముగ నిర్వహించుటలో సహాయపడుదురని ఆశించుచున్నాను."

*—శ్రీ మందుముల రామచంద్రరావు*

"ప్రతి పుస్తకము ఆకర్షవంతముగను, ఉపయోగకరముగను ఉన్నది.... మీ గ్రంథమాల ఆంధ్రదేశమున కమూల్యమగు సేవచేయుచున్న దనుటలో నెట్టి యతిశయోక్తిలేదు."

*—శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు*

"ప్రజలకు వినోదం కలిగించడంవల్ల గ్రంథమాలను అభివృద్ధి చేసుకొనే దృష్టి ప్రకాశకులకు లేదు. 'ప్రజలకు ఈ దినాలలో అత్యావశ్యకమయిన విజ్ఞానం కలిగించాలి' అన్న దృఢ సంకల్పం ప్రతి ప్రచురణమునందు ప్రస్ఫుటంగా కనబడుతూ ఉంది."

*—గోల్కొండ పత్రిక 10-2-1940*

# లోగా ప్రచురించినవి

1. హైందవ ధర్మవీరులు (హైందవధర్మ పోరీలు)
—శ్రీ. శే. సురవరము ప్రతాపరెడ్డిగారు

2. ప్రాథమిక స్వత్వములు
—శ్రీ. శే. సురవరము ప్రతాపరెడ్డిగారు

3. 4. కమాల్‌పాషా జీవితము (రెండు భాగములు)
—శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరము

5. ఆంధ్ర సంస్థానము
—శ్రీ పులిగడ్డ వెంకటసుబ్బారావు

6. ప్రజలు - ప్రభుత్వము
—శ్రీ కౌంట్ లియో టాల్‌స్టాయ్

7. గ్రంథాలయోద్యమము
—శ్రీ. శే. సురవరము ప్రతాపరెడ్డిగారు

8. కాంగ్రెసు - సంస్థానాలు
—శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్యా

9. సంస్థాన సమస్యలు
—శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్యా

10. 'నా భారతదేశ యాత్ర'
—హెచ్. ఎన్. బ్రెయిల్స్‌ఫర్డ్

11. 12. గాంధీ మహాత్ముడు (రెండు భాగములు)
—'విష్ణుచక్రం'

# 13. జైలులోపల (కథానికలు)

రచయిత : శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి

వెల : ఇతరులకు 0-10-0    సభ్యులకు 0-9-3

"కొత్తజాతికథలు మీరు తెలుగులో సృష్టిస్తున్నారు.........కథలు హృదయవిదారకంగా ఉన్నవి. పడమటి దేశాల్లో ఇట్టి వాఙ్మయసృష్టి సంస్కరణాలకి దారితీసేది. మన దేశంలో ఆలనా పాలనా లేదు."

— శ్రీ చింతా దీక్షితులు

"యిలాంటి కథావస్తువులు యింతవరకు యెవరూ తీసుకోలేదనే నా అభిప్రాయం. ఈ వస్తునిర్ణయంలోనే మీరు నవ్యమార్గం అనుసరించి, సామాజికంగా చచ్చినవాండ్లతో సమానమని నిర్ణయించబడ్డ ఖైదీల జీవితాలు ఈ విషసమాజచరిత్రకు స్మృతిచిహ్నాలుగా పనికి వస్తాయని చక్కగా నిరూపించారు."

— శ్రీ ధరణికోట శ్రీనివాసులు

"జైలుసంస్కర్తలు గ్రహించాల్సిన విషయాలు బలంగా ప్రతిపాదించబడడం గమనార్హం. నేరస్తులు వస్తుతః నేరస్తులుకారు. వాదు పరిస్థితులకు లొంగిపోయి నేరస్తులు కావించబడ్డారన్న అభిప్రాయం ప్రతి రచనా కలిగిస్తుంది."

— గోలకొండ పత్రిక

".........ఇవి ఉన్నసమస్యల వాస్తవికతను, మానవ స్వభావములను, పరిస్థితుల సత్యస్వరూపమును అతిసహజముగ హృదయంగమముగ తెలుపుచున్నవి, ఇవి రచయితకు గల సంస్కారమును, భావోద్వేగమును వెల్లడించుచున్నవి."

— సుజాత

"... ....దైనందిన జీవితంలో మనం చూచే సాధారణఘట్టాలనే కథగా తీసుకొని సాధారణం అనుకునేటట్టు గాక ఉత్తమంగా సృష్టించారు. .........ఆళ్వారుసామిగారు తమ జైలు జీవితానుభవంలోంచి కొన్ని లమూల్య విషయాలను ముచ్చటైన పుస్తకంద్వారా అందజేసినందులకు అభినందనీయులు."

— స్రవంతి

# 14. నా గొడవ (గేయాలు)

రచయిత: శ్రీ కాళోజి నారాయణరావు

వెల: ఇతరులకు 1-8-0   సభ్యులకు 1-5-0

"కాళోజీ నిఖిలాంధ్రకవి........ఆయన తన ఖండకావ్య సంపుటా నికి 'నాగొడవ' అనిపేరు పెట్టారు....కాని ఇది విశాలజగత్తు ప్రజలందరి గొడవ. ఇది మనం మననం చేసుకోవాల్సిన పుస్తకం. యుద్ధంలో పార్గొన్న కవులంతా చెల్లాచెదురుగా పారిపోతే లూయీ ఆరగాన్ ఒక్కడే దేశంలోనిలబడి మహావిశ్వాసాన్ని వెల్లడించే గీతాలు వ్రాశాడు. కాళోజీ లూయీ ఆరగాన్‌వంటివాడు."

—శ్రీ శ్రీ

"కాళోజీ కవిత్వం సమాజానికి హెచ్చరిక వంటిది....వేమనకూ ఈయనకూ రేఖామాత్రంగా వ్యత్యాసం ఉందేమో గాని అతను చెప్పడా నికి వీలుగానివి కాళోజీ చెప్పంది తప్పలేదు. ఆడంబరంలేని, అలం కారాల ఆరభటిలేని నిసర్గమైన కృతి కాళోజీ కావ్య సంపుటి......... వ్యంగ్యాత్మక విపర్యాయుత హాసగీతికలు రచించి కాళోజీ కవితాజగత్తులో క్రొత్తవిప్లవాన్ని కలిగించాడు."

—శ్రీ దాశరథి

"ఈ కవి రచనలో అంతటా ఒక విశిష్టమైన ప్రత్యేక వ్యక్తిత్వం సుస్పష్టంగా కనిపిస్తున్నది....కాళోజీదారిపేరు. 'నాగొడవ' పఠిస్తున్నప్రుడు మనమొక్క విసూతనమైన అనుభూతి ప్రపంచములోకి వెళ్ళిపోతాము...., ఈయనలోగల సత్యాన్వేషణదృష్టి సంకుచితమైన రాజకీయ నినాదాలకు తాత్కాలికమైన అలజడులకు అతీతమైన కాలావధులనుదాటి నిసూక్తి

ధోరణిలో వినబడుతూంటుంది. నేటికాలపు కవితాపరిణతి అవగాహన చేసుకోదలచిన భావుకులందరు తప్పకుండా చదువ వలసిన ఖండకావ్య సంపుటి."

—భారతి

"………… ఈ సంపుటిలో ప్రతి గీతం ఒక పరమ సత్యం. ఆ "సత్యం"కల్పనా కథలకంటె చిత్రమైంది కామా ? తెలంగాణా ప్రజల కన్నీటిలో ఎన్నెన్నికలలు కలవో చూడతలచినవారికి దాశోజీగారి 'నాగొడవ' కనువిప్పు."

—కిన్నెర

# 15. ఉదయ ఘంటలు

( 56 అఖిలాంధ్రకవుల గేయసంపుటి )

వెల : ఇతరులకు 2-4-0 సభ్యులకు 1-15-6

"……..ఈ సంకలనంలో ఇంతకు పూర్వం అజ్ఞాతంగా ఉండి పోయిన ఉత్తమ ఖండకృతులెన్నో సేకరించి ప్రకటించారు. పేరుపొందిన రచయితల రచనలలోనించికూడా ఈలాంటి కృతులే సేకరించడంవల్ల ఈ సంకలనాని కీవిషయంలో ఒక ప్రత్యేకత వచ్చింది. ఇది ఆధునిక కవితాభిమాను లందరు తప్పకుండా పరిశీలింప వలసిన సంపుటి."

—ఆంధ్ర పత్రిక

"ఇప్పుడు ఆంధ్ర దేశంలో అనేక తరహాల కవిత్వం ఆవిర్భ విస్తున్నప్పటికీ అందులో ప్రధాన ప్రవాహం అభ్యుదయ సాహిత్యం. దీనికికారణం దినదిన ప్రవర్ధమానమౌతున్న సామాజిక చైతన్యమూ, ప్రజాజీవితమూ దీనిలో వెల్లివిరియడమే. ఇలాగ వెల్లివిరిసిన అఖిలాంధ్ర

కవులగీతికా సంపుటి "ఉదయఘంటలు." ........ అనేకకవుల చక్కని గీతాలు యిందులో ప్రచురితమైనాయి. ........సంపాదకుల, ప్రచురణ కర్తల కృషి కొనియాడతగింది."

—విశాలాంధ్ర

"........నవ్యకవితోద్యమంలో పాల్గొన్న వారి రచనలను ఏర్చి కూర్చి, ........ఒక్క సంపుటిలో అందించినందుకు అభినందనీయులు. ....ఆధునిక ఆంధ్ర రచనావిధానంలో వచ్చిన మార్పుయొక్క సమగ్ర స్వరూపాన్ని తెలిసికోవాలంటే ఈ గ్రంథం చాలావరకు సహాయ పడుతుంది."

—బృందావని

"........సానలుతీరి పక్షపక్షాన రంగురంగుల రోచిస్సులు విర జిమ్మే మణిలా కలరవాలను కురిపిస్తూ, వంపువంపునా కర్పూరకాంతులీనే కపోత కంఠంలా, వివిధ సౌరభాలను, వెలార్చే కదంబ ప్రసూనమాలలా, రంగు, రుచి, వాసనల. సొరుతీరులు గల అపురూపపు "ఉదయఘంటలు" నిదాదతథంగాలు అనవరతం మనశ్రవణ మనోమస్తిష్క ఫలకాలను తాకు తూనే వుంటాయనడం అత్యుక్తికాదు."

—ఆంధ్ర ప్రభ

"ఈ సంకలనంలో యావదాంధ్ర కవులు సమిష్టిగా ఏకముఖాన మనకు మేల్కొలుపు పాడుతున్నారు. ఇవి ఉదయ ఘంటలు ........ఇవి హృదయ ఘంటలు............మనకావ్య సాహిత్యంలోని విశిష్ఠభాగాలతో ఒక్క "తెలుగు ఎంథాలజీ" కూడా రాలేదని నిరుత్సాహపడుతున్న ఈనాడు కనీసం గేయసాహిత్యంలోని మచ్చు రచనలతోనైనా ఈసంపుటి వెలువడడం ఆంధ్ర సాహిత్యానికి ఒక అభ్యుదయమేనని దీనిని పరిశీలిం చిన వారు అంగీకరించుతారు."

—స్రవంతి

"........కేవలము జీవితోత్సాహమూ, సౌందర్య సంపన్నమూ మాత్రముగాక, పీడితసోదరబాధానుకంపనమూ, నిత్యనూతన చైతన్య కల్పిత చిత్రసృష్టి........"ఉదయ ఘంటలు" దారిలోనే మోగుతాయి. ........ఈ సంపుటము నిండా బ్రతికివున్న వ్యావహారికంలోనే తళుక్కు-మన్నాయి భావాలు. ........భావవిప్లవానికి "ఉదయ ఘంటలు"లో ఆట విడుపు. "మాడుపొట్టతోడ నీవు గాడిద చాకిరి చేయగ తోకఝాడి, మూతి నాకు తుచ్ఛులకే వైభవాలు."

—అనీ పుట్టకీల్నుకదిల్చే భావాలు "ఉదయఘంటలు"లో ఎన్నైనాకలవు."

—కిన్నెర

"ఈ ఆధునిక ఖండకావ్య సంపుటి పురోగమిస్తున్న నవ్యాంధ్ర సాహిత్య పోకడలను ప్రస్ఫుటింప జేస్తున్నది. ఇందులో........దేశీయ సాంఘిక సమస్యలు, ఆర్థికసమస్యా లోపాలు, ప్రపంచ క్లిష్టపరిస్థితులు, పీడితమానవ సంఘటనలును యితివృత్తముగాగలవి. ........చక్కని ముద్రణ, తయారీలతో ఆకర్షణీయంగా తయారైన యీ గ్రంథము ముద్దులు మూటగట్టుచు ఉత్సాహానందముల ప్రేరేపించుచున్నది."

—గృహలక్ష్మి

ఈ సంవత్సరం—చిరకాలంతర్వాత కవితా సంపుటాలు వచ్చాయి. అందులో ఉత్తమమైనది వేసినగౌరవం తెలంగాణావారికే దక్కింది. అఖిలాంధ్ర కవుల రచనలతో కూడిన "ఉదయ ఘంటలు" ఒక గొప్ప కృషి అని చెప్పకతీరదు."

—శ్రీవాత్సవ

# 16. ప్రజల మనిషి (తెలంగాణా నవల)

రచన: శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి

వెల : ఇతరులకు రు. 2-8-0 సభ్యులకు రు. 2-3-0

"1938 కి పూర్వమున్న తెలంగాణా గ్రామ జీవితంలోని వేర్వేరు వర్గాలను, వ్యక్తులను వారి సమస్యలను, జీవిత విధానాన్ని ఆళ్వారుస్వామి గారు కళ్ళకు కట్టినట్లు చిత్రించి కృతకృత్యులైనారు........తెలంగాణా ప్రజా జీవితాన్ని కళ్ళకు గట్టినట్లు వర్ణించే నవలలు బహుకొద్ది. వానిలో యిది నిస్సందేహంగా ప్రధాన స్థాన మాక్రమిస్తుంది."

— విశాలాంధ్ర.

"....ఈనాడు ప్రజాస్వామ్యం, స్వాతంత్ర్యం, జాతీయత స్వేచ్ఛగా అనుభవిస్తున్న ప్రజలకి ఆనాడు తెలంగాణా ప్రజలు పడిన బాధలు తెలి ...వు. ఈ నవల చదివితేమాత్రం ప్రతిపుటలోను తెలంగాణా హృదయం ...స్తూ ఉన్నట్లు, భరించిన అవమానాల పరంపరలో పరాజయం ...గాని పట్టుదలతో నిలచిన ప్రజలమనిషి పలుకరిస్తున్నట్లు కని ...ప్రజల మనిషి" తెలుగు సాహిత్యంలో ఉత్తమశ్రేణికి చెంద ...నవల."

—"శ్రీవాత్సవ" తెలుగు స్వతంత్ర.

...థ పనికట్టుకు అల్లినట్లు ఎక్కడా అనిపించదు. నలిగి ...ల పాలేళ్ళ బాగోగులు వాళ్ళభాషలోనే, వాళ్ళచేతనే రచ ...ాడు. దీనివల్ల వాస్తవికత చక్కగా పోషించబడింది..... ...ద్వేగాన్ని చూపించడానికికూడా రచయిత ప్రయత్నించ ...మ సన్నివేశాలున్ను సృష్టించ లేదు."

—ఆంధ్ర పత్రిక.

"తెలంగాణా మనగుండెకాయ. రాజకీయంగా ఆ ప్రాంతపు కోటి మంది మన సోదరులు విడిగావున్న మన కండలో కండ, రక్తంలో రక్తం. కాని పెక్కు కారణాలవల్ల మన ఈ కండల సంగతి మనం తెలుసుకోలేక పోతున్నాం. ఈ ఆత్మబోధ కలిగించి తెలంగాణా తీరుతియ్యాలను సమగ్రంగా మన కట్టెదుట పెట్టే ఉత్తమ నవల "ప్రజల మనిషి"....తెలంగాణా విమోచనోద్యమంలోని అనేక ఘట్టాలు ఈ నవలలో చక్కగా వివరించ బడినవి. తెలంగాణా నిత్యజీవితానికి మచ్చుతునకలైన పాత్రలు యిందులో కలవు ...అస్వతంత్ర తెలంగాణా సంఘ జీవితాన్ని ప్రతిబింబింపచేసిన ఈ ఉద్గ్రంథం ప్రతి గృహాన్ని, గ్రంథాలయాన్ని అలంకరించ గలదు."

—ఆంధ్ర ప్రభ.

"అందరికీ అభిరుచి కలిగించేటట్టు రాజకీయ వాతావరణంలో నవల వ్రాయడం అంత సులభం కాదు....రాజకీయాలగురించి వ్రాస్తూ ఉన్నప్పటికి ఏ పక్షాన్నీ బలపరచకుండా ఆయాసంస్థల వైఖరులు తేటప[illegible] కథ వ్రాయడం కష్టం. ఈ నవల రచించిన వారు కష్టసాధ్యమైన [illegible] జయప్రదంగా నిర్వహించారు....తెలుగు సాహిత్యంలో కలకాల[illegible] నవల వ్రాసిన కొద్దిమందిలో—ఆళ్వారుస్వామిగారొకరైనారు[illegible] చదవలసిన విధి ప్రతి సాహిత్య ప్రియుడి మీదను ఉన్నది."

"నేటి హైదరాబాదు చరిత్ర వెనుక పుటలు తిరుగవే[illegible] విదారకమైన ఎన్నో సంఘటనలు గోచరమౌతాయ్. చరిత్ర[illegible] రాలలో లిఖించ వలసిన 'ప్రజల మనుషు'లైన వ్యక్తులు ఎం[illegible] మవుతారు. 'ప్రజల మనిషి' అనే యీ నవల ఆ పరిస్థితులను[illegible] లనూ, వారి చర్యలనూ, చాలా యథార్థంగా, హృదయంగమ[illegible] చిన ఉత్తమశ్రేణి సాహిత్య సృష్టి....చెత్త శృంగారానికిగాని,

గాని తావీయక యథార్థవిషయాలను ఆధారంగా తీసుకొని ప్రబోధాత్మక మైన చక్కని నవలను సృష్టించిన శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామిగారు నిజంగా అభివందనీయులు."

—గుండుసూది.

## 17. సెలయేరు (జానపద గేయ సంపుటి)

సేకరణ: శ్రీ నేదునూరి గంగాధరం

వెల: ఇతరులకు రు. 1-12-0 సభ్యులకు 1-8-6

"జానపద వాఙ్మయ సేకరణకై అధికముగా కృషిచేయుచున్న వారిలో శ్రీ నేదునూరి గంగాధరంగారు ముఖ్యులు. వీరు దాదాపు ముప్పది సంవత్సరములనుండి చేసిన కృషి ఫలితమే ఈ గ్రంథ మనిన దీని విలు వనుగూర్చి చెప్పుట చాలును. తెలుగు దేశపు హృదయాన్ని, దాని మాధు ర్యాన్ని చవిచూడ దలచిన ఈ సెలయేరు చాలును. ఇది ఏడుపాయలుగా ...చుల నీనుచున్నది. ఇందలి తీయతీయ తేనెల ఒలుకు పాటల భావ ...ఇచ్చు వినోద, విజ్ఞానము ప్రత్యేకముగా పేర్కొన వలసిన పని ...థాలయము మొదలగు సంస్థలేగాక ఇది ఇంటింటా వెలయ ...ను."

—గోలకొండ పత్రిక.

...జానపద సాహిత్యం ఆంధ్రావళికి చేకూర్చి, అందించ ...లలో శ్రీ నేదునూరి గంగాధరంగారు 'కనిష్ఠికాధిష్ఠి ...కరించిన అపార గేయ సంపదలో కొంతను....బాల, గృహసేవ, శృంగార, పాటకజన సారస్వతాలనే ...రు'గా అందించి ప్రశంసనీయతను పొందారు.... ...క్య ముఖచిత్రంతో మరికొన్ని చిత్రాలతో అందాలు

పొర్లిపారే ఈ 'సెలయేరు'కు శ్రీ బి. రామరాజుగారు జానపద సాహిత్య చరిత్రను రేఖామాత్రంగా చిత్రించే సంపాదకీయంలో దారిచూపి నారు....ప్రతి సహృదయుడూ, ప్రజావాదీ, ప్రతి ఆంధ్రుడు, తాగి, తనిసి, తలకుపోసుకోవలసిన సెలయేరిది."

—ఆంధ్ర ప్రభ.

"శ్రీ నేదునూరి గంగాధరంగారు సుమారియవై ఏళ్ళనించి జానపద గేయాలు సేకరిస్తున్నారు....వీరి జీవితశక్తి యావత్తు ఈ పాటల సేకరణకే ధారపోశారు....గేయసంకలనంలో....రత్నాలవంటి జానపద గేయాలెన్నెన్నో కనిపిస్తున్నాయి, శ్రీ బి. రామరాజుగారు వ్రాసిన ప్రవేశిక జానపదగేయ సారస్వతాభిమాను లందరు తప్పక పరిశీలించ దగినది."

—ఆంధ్ర పత్రిక.

"తెలుగుదేశం వివిధ ప్రాంతాలలో విస్తరించి వున్న జానపద గేయాలను సేకరించడానికి ఆధునిక కాలంలో చాలామంది రసజ్ఞులు శ్ర కృషి చేస్తున్నారు. అట్టివారిలో శ్రీ గంగాధరంగారు అగ్రస్థానం వ రని నిస్సందేహంగా చెప్పవచ్చు. జానపద సంకలన వారికి వంటిది....వీరి సేకరణలో జానపద గేయాలను ఏడు శీర్షికల/ జించి హైదరాబాదులోని దేశోద్ధారక గ్రంథమాలవారు ప్ర యింత కృషిచేసిన శ్రీ గంగాధరంగారున్నూ యింతవ పద సాహిత్యాన్ని గ్రంథరూపంగా పాఠకలోకానికి అందిచ గ్రంథమాల వారున్నూ మిక్కిలి అభినందనీయులు."

"ఎంతో కష్టపడి, గంగాధరంగారు సేకరించిన ఏడు విభాగాలున్నాయి....ముఖ్యంగా గృహజీవన

మామలు, బావవదినెలు, మరదలు మొదలైనవారి మధ్య జరిగే పరియాచకాలను, హాస్యాన్ని వర్ణించే పాటలు విస్తారంగా ఉన్నాయి....”

—విశాలాంధ్ర.

“శ్రీ నేదునూరివారు సుమారు పాతిక సంవత్సరాలనించీ మన జానపద గేయాలు సేకరిస్తున్నారు. వీరి కృషి దేవేంద్ర సత్యార్థి మొదలైన ప్రముఖ గేయ సంకలన కర్తల ప్రశంస లందుకొన్నది....ఆయా విభాగాలలో వీరు ప్రచురించిన గేయాలలో స్వచ్ఛమైన జానపద ధోరణి జాలువారు తున్నది....మొత్తంమీద ఈ గేయసంపుటిలో స్త్రీల సారస్వతంలో సర్వోత్తమమైన గేయాలు కన్పిస్తున్నాయి. ఈ గేయసంపుటికి శ్రీ బి. రామరాజుగారు వ్రాసిన ఉపోద్ఘాతం చక్కగా ఉంది. ఇది గేయ సారస్వతాభిమానులందరు తప్పక పరిశీలింపదగినది.”

—భారతి.

“....చిరకాలంనుండి వేలకొలది పాటలూ, కథలూ, అవీ సేక ...ంచిన నేదునూరి గంగాధరంగారి కృషికి గ్రంథరూపంబిస్తూ బి. రామ ...రు చక్కని సంపాదకీయం వ్రాశారు....ఈ సెలయేరు....యేడు ...గా ప్రవహించింది. ఒక్కొక్క శాఖలోని ఒక్కొక్కపాట వజ్రపు తునక.”

—“శ్రీవాత్సవ” తెలుగుస్వతంత్ర.

దేశపు సాంఘిక జీవితాన్ని సమగ్రంగా తెలుసుకోవాలన్నా జానపద సాహిత్యం అవలోడన చెయ్యాలి....ఆంధ్ర జానపద ...త్యం అపారమైనది. దీనిలో ప్రత్యేకకృషి చేసిన పండితులు నేదునూరి గంగాధరంగారు....ఏడు విభాగాలుగా జానపద గేయాలు ...కరింపబడ్డాయి. ఇలాంటి ఉత్తమ గ్రంథాన్ని వెలువరించిన ప్రచురణ

కర్తలు అభినందనార్హులు. ప్రతి ఆంధ్రుడూ కొని చదవడమే గాక—పాడుకోవలసిన పాటల గ్రంథం యిది."

—ప్రజామత.

"....ఇందలి పాటలు ప్రతియొక్కటి సహజంగా సామాన్య ప్రజానీకం పాడుకొంటున్నవి.....ఈ గేయాల సేకరణలో జరిపిన కృషి ప్రశంసనీయము. ఇందలి చిత్రాలు ప్రత్యేక ఆకర్షణ."

—గృహలక్ష్మి.

## 18. జీవనరంగం (15 ఏకాంక దృశ్యనాటికలు)

### (15 గురు రచయితలు - 2 భాగాలు)

వెల : ఇతరులకు రు. 3-8-0 సభ్యులకు రు. 3-1-0

"....వివిధ రచయితల ఏకాంక నాటికలు జీవన రంగం అనే పేరున రెండు సంపుటాలుగా ప్రచురించారు. పదిహేనుమంది రచయితల నాటికా రచనలో కనబరచిన వైవిధ్యం చదువుకోవడానికే కాక, ప్ర నలకుకూడా యోగ్యంగా ఉంది. ఈ రచయితల్లో తెలంగాణాలో గద్య, పద్య రచనల్లో ప్రసిద్ధులయిన ప్రముఖు లందరూ ఉన్నా

—"శ్రీ వాత్సవ" తెలుగు

"దేశోద్ధారక గ్రంథమాలవారు తెలంగాణా యువకు ఆంధ్ర సారస్వత లోకానికి పరిచయము చేయడానికి ఉద్దేశించి యివియని తెలుస్తున్నది. ఇది సంతోషకరమగు విషయము."

—గోలకొండ

"ఉత్తమ గ్రంథాలను ప్రచురించి సాహితికీ, పాఠకులకూ సేవచేస్తున్న ఈ ప్రచురణ సంస్థవారు....వివిధ రచయితల రచ

సంపుటీకరించి ప్రకటించడంలో ప్రత్యేకత గడించారు....ఒక్కొక్క నాటిక ఒక్కొక్క ప్రత్యేకతను తెలుపుతున్నది."

—ప్రజామత.

"ప్రజల మనిషి", "ఉదయ ఘంటలు" వంటి ప్రయోజనాత్మక మైన గ్రంథాలు ప్రచురించిన దేశోద్ధారక గ్రంథమాలవారు ఈసారి నాటిక ప్రచురణలో కొత్త పోకడలు త్రొక్కారు....ఈ ఏకాంకికలన్నీ ప్రజల ఆకాంక్షలను, హక్కులను, బాధ్యతలను వ్యక్తీకరిస్తున్నాయి. ఇతి వృత్తంలో, రచనా రీతులలో వైవిధ్యం ఉండేటట్లు చక్కటి వాటిని ప్రకాశకులు ఎన్నుకొన్నారు."

—ఆంధ్ర ప్రభ

"....నాటిక లన్నీ ప్రత్యేక ప్రయోజనాలకోసం వ్రాసినవి. రంగస్థలం మీద రక్తికడ్తాయి, ఏకాంక దృశ్యకావ్యాల అవసరం ఎంతైనా ఉన్న ఈ కాలంలో ఇది ప్రజాదరణ పొందగలదని ఆశించవచ్చును.

........ఈ నాటికలన్నీ సంపుటాలుగా వెలువడిన కారణంచేత నాట ఈనాడు దినదిన ప్రవర్థమానమవుతూన్న నాటక కళా ప్రోత్సా డ్పడుతున్నాయి. వివిధ కళాశాలలు, యువజన సంఘాలు, మితులూ, అమెచ్యూర్ నాటికలు ప్రదర్శించాలని కుతూహలం ఖ. కాని వాటికి తగిన మంచి నాటికలు సేకరించ లేక ఈ కొఱత తీర్చడానికి "జీవన రంగం" వంటి నాటికా ర్నివచ్చినా స్వాగత మీయవలసిందే."

—స్రవంతి.

విధ వృత్తులలోనుండి సాహిత్య కృషి చేయుచున్న యువ కలను రెండు సంపుటాలలో ప్రచురించటం ప్రశంసార్హ . నేటి ఆర్థిక, సాంఘిక సమస్యలెన్నో ఈ నాటకాలలో

చిత్రించబడినయి....వివిధ సామాజిక సమస్యల వెలువరిస్తూ వివిధ రచనా రీతులను తెల్పుతూ, పలు నవయువక రచయితలను ఆంధ్ర దేశానికి ఎరుకచేసిన దేశోద్ధారక గ్రంథమాలవారి కృషి అభినందనీయము."

—కృష్ణాపత్రిక

## రాబోవు ప్రచురణలు

1. ఆందోళన (ప్రధాన రాజకీయ ప్రణాళికలు)
2. కూర్చిన ముత్యాలు (ప్రముఖుల ప్రవచనాలు)
3. శ్రీ భాగి నారాయణమూర్తిగారి రచనలు
4. శ్రీ పొట్లపల్లి రామారావుగారి కథలు, నాటికలు
5. తెలంగాణా కవిమిత్రులు
6. గంగు (నవల)
7. అఖిల భారత తస్కర మహాసభ
8. నాలోనేను
9. ప్రాచీన తెలంగాణా
   (రాజకీయ, చారిత్రక, ఆర్థిక, సాంఘిక పరిస్థితులు)
10. విజ్ఞాన శాస్త్రము
11. తరంగాలు
12. స్త్రీలు—సమాజము
13. బుచ్చిపాపలు (కథలు)
14. భారతీయ కళావికాసము
15. సామెతకథలు





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA114B106 |
| పుస్తకం పేరు | ప్రజలు ప్రభుత్వము |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 139 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | X |
| లేని పేజీలు | i to iv |
| తయారు చేసినది | P. Jayamma |
| పేజీలు విడదీసినది | P Jayamma |
| స్కాన్ చేసినది | Aswini |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | NO |
| పరిస్థితి | Good |